సరస్వతీ గ్రంథమండలి: ౧౦

# గృహదహనము

## (రెండవభాగము)

శరచ్చంద్రచటర్జీ

అనువాదకుడు:

పిలకా గణపతిశాస్త్రి

(సాహిత్యశిరోమణి)

రు 2/-

పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

సరస్వతీ గ్రంథమండలి: ౧౦

# గృహదహనము

(రెండవ భాగము)

శరచ్చంద్ర చటర్జీ

అనువాదకుడు:

పిలకా గణపతిశాస్త్రి

(సాహిత్యశిరోమణి)




పబ్లిషర్స్: అడ్డేపల్లి అండుకో

సరస్వతీపవర్ ప్రెస్

రాజమహేంద్రవరము.

First Edition 1947

అంకితము
శ్రీ తారకం
అన్నగారికి

Saraswathi Power Press, Rajahmundry
Printed and published by
A. Lakshmanaswamy Naidu
For Addepally & Co., Educational Publishers
Order No 4451/1947

First Edition 1947

---

అంకితము

శ్రీ తారకం

తన్నగారికి

---

Saraswathi Power Press, Rajahmundry
Printed and published by
A. Lakshmanaswamy Naidu
For Addepally & Co., Educational Publishers
Order No 4451/1947

First Edition 1947

అం కి త ము
శ్రీ తా ర కం
అ న్న గా రి కి

Saraswathi Power Press, Rajahmundry.
Printed and published by
A. Lakshmanaswamy Naidu
For Addepally & Co., Educational Publishers
Order No. 4451/1947

# గృహదహనము

## ౨౫

ఒకప్పుడు ఒకర్ని అనురాగయుక్తంగా పొగుడుతూ ఉన్నప్పుడు ఇంకొకరికది ఒక పెద్దదారుణాఘాతంగా పరిణమించవచ్చునన్న సంగతి ఇంతకిపూర్వం అచలకీ సురేశుడికీకూడా తెలియదు. సురేశుడు గిన్నె చేత్తోపట్టుకుని అల్లాగే నిర్ఘాంతపోయి కూర్చున్నాడు. అచల తనగదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకుని తలగడమీద తలపెట్టుకుని పొంగిపొంగి వస్తూన్న దుఃఖం ఆపుకుంది. ఆపక్కనే మహిముడు పడుకున్న గదిఉంది. అందుచేత ఆమె అంత నిశ్శబ్దంగా వెక్కివెక్కి ఏడవవలసివచ్చింది. ఆకారణంచేత ఆమె దుఃఖం పరమేశ్వరుడికితప్ప ఎవ్వరికీ తెలిసిందికాదు; కాని ఆమెకీదుఃఖంవల్ల స్త్రీజీవితంలో పాతివ్రత్యానికి ఉండేమహత్త్వము, బోధపడింది. ఆవేళ సురేశుడికూడా గుబులుదేరి వచ్చినప్పుడు తండ్రి అనుమానపడడం చూసి, ఆమె లోలోపల ఎంతో బాధపడింది; కాని పరస్త్రీలోలుడైన సురేశుడుకూడా ఈవేళ పాతివ్రత్యవిషయంలో ఇంత గౌరవభావం చూపించడం చూసి ఆమె ఆశ్చర్యపడింది. ఈఆశ్చర్యంలో తనగౌరవప్రపత్తులుకూడా ఆమెకు స్పష్టంగా బోధపడిపోయాయి.

ఇంతేకాక స్పష్టంగా ఉన్న మాటల్లో ఎంతశక్తిఉంటుందో ఆమెకీవేళ మొట్టమొదట తెలిసింది. ఆమె చదువుకున్న స్త్రీ. భర్తని త్రికరణశుద్ధిగా ప్రేమించడమే పాతివ్రత్యం అన్నసంగతి ఆమెకు తెలియకపోలేదు. కేవలం మనస్సుగాని, కేవలం వాక్కుగాని పవిత్రంగా ఉన్నంతమాత్రాన ఉపయోగం లేదనికూడా ఆమెకు తెలుసును. అయినాగాని ఆమె మనస్సులో మహిముడిమీద ప్రేమతగ్గిపోయింది. ఆమాట

ఆమె నోటితో చెప్పడానికికూడా సంకోచించలేదు! అల్లాంటి పరిస్థితుల్లో కూడా ఆమె నీచమైనపని చేశానని అనుకోలేదు; కాని ఈవేళ సురేశుడు మాటలప్రస్తావనలో తను పతివ్రత కాదని సూచించినట్టు భావించుకునేసరికి ఆమె యమయాతన అనుభవించింది. ఈవేళ ఈమృణాలప్రసంగంవల్ల తనకి కలిగిన అనుభవం ఎప్పటికీ మరిచిపోకూడ దనికూడా ఒక దృఢనిశ్చయం చేసుకుంది.

వీధిలో తాంగాచప్పుడయింది. ఆపైన సురేశుడి కాళ్ళచప్పుడు వినబడింది. దాన్నిబట్టి, ఆమె, వాళ్ళిద్దరూ మహిముణ్ణి చూడడానికి వస్తున్నారని గ్రహించింది. ఆతరవాత ఆ ఇంటికి తండ్రిపిలుపు వినబడింది. వెంటనే ఆమె చీరచెంగుతో కళ్ళూ ముఖమూ తుడుచుకొని తలుపు తీసుకుని మహిముడిగదిలోకి వెళ్ళింది. కేదారబాబు ఆమెముఖం కేసి చూసి కంగారుపడుతూ "ఇదేమిటి ఈవేళ ఇల్లాఉన్నావు? రెండు గంటలకి జావ ఇవ్వవలసింది. అప్పుడే నాలుగుగంటలు కావస్తోంది. ఇదేమిటి? కళ్ళు ఇంతఎర్రగా ఉన్నాయి? ఏడుస్తున్నావా ఏమిటి?" అన్నాడు. అచల ఆమాటలకి సమాధానం ఏమీ చెప్పలేదు; ఆపైన గబగబా అక్కడినుంచి ఇవతలికి వచ్చేసింది. రోగికి కాస్త జావ ఇవ్వడం మొదలుపెట్టినప్పటినించీ ఈపని మృణాలే చేస్తూవచ్చింది. సామాన్యంగా నౌకరు పొయ్యిఅంటిస్తూ ఉండేవాడు. మృణాల వేళపట్టున జాగ్రత్తగా జావకాచి ఇస్తూఉండేది; మృణాల వెళ్ళిపోగానే ఈబరువంతా అచల మీద పడింది. ఈవేళ ఆమె ఈగొడవ బొత్తిగా మరిచిపోయింది. ఆమె గబగబా వంటఇంటికేసి వెళ్ళింది. అప్పుడే పొయ్యి అంటించడమూ అది ఆరిపోవడమూకూడా జరిగిపోయింది.

ఆమె చాలాసేపు నిర్ఘాంతపడి ఆపొయ్యిదగ్గిరే నిలబడిపోయింది. ఇదంతా కేదారబాబు కనిపెట్టాడు. కాని అతను అచలని ఏమీ అనకుండా సురేశుణ్ణి ఉద్దేశించి కఠినంగా "సురేశబాబూ! ఒక నర్సు

లేదంటే ఇక్కడ వ్యవహారం నడవదని నేను ముందే ఇంతకుపూర్వమే చెప్పాను. అయినప్పటికి నాకు కలిసిన తరవాతగా మీకు తెలియజేస్తున్నాను" సురేశుడు నిశ్చేష్టుడై నిలబడిపోయాడు; కాని మహిముడు అచల తెల్లతెల్లబోయారు, చిన్నబుచ్చుకోవడమూ నిశ్శబ్దంగా నిలబడి ఉన్నారు; కాని మహిముడు చూస్తూన్న సంగతిమాత్రం ఎవరూ గమనించలేదు. అల్లాగే కొంతసేపుండి మహిముడు మెల్లిమెల్లిగా "సురేశా! నచ్చు అయితే ఆఖరికి నాకు మందుకూడా ఇవ్వవు! కాని అచలకి సహాయం చెయ్యాలి! మనిషిని ఎవరినైనా ఏర్పాటుచెయ్యి! రేపు ఎల్లుండికూడా రాత్రి తెల్లవార్లూ మేలుకోవాలి! ఏదైనా కాస్త విశ్రాంతి ఉండాలి! లేకపోతే ఎల్లాంటి మనిషికైనా కష్టమే!" అన్నాడు.

అతను చెప్పింది అంతా నిజంకాదు; గాని అందులో కొంతసత్యం లేకపోలేదు! సురేశుడు మహిముడన్న మాటకి సంతోషించి కేదారబాబుకేసి చూశాడు. అతను తనుఅన్నమాటకి ఎంతో సిగ్గుపడ్డాడు. ఆపైన అచలని ఓదారుస్తూ కాస్త మృదువుగా మాట్లాడదామనుకున్నాడు; కాని అంతలోనే అచల చటుక్కుని గదిలోనించి వీథులోకి వెళ్ళిపోయింది. ఆమె రాత్రి భర్తదగ్గిరికి వెళ్ళి అతన్ని తనతప్పులన్నీ క్షమించమని అడగాలని అనుకుంది; కాని వల్లమాలినసిగ్గుచేత ఆమె ఆమాటలు అనలేకపోయింది.

సురేశుడు ప్రతిరోజూ రాత్రివేళ మహిముడిదగ్గిరికి వెళ్ళి అతన్ని అన్నీ సరిగ్గా జరుగుతున్నాయో లేదో కనుక్కుని నిద్రపోవడానికి వెడుతూ ఉంటాడు. ప్రాణాలు ఉన్నప్పుడే అతనిల్లాగ చేస్తూఉండేవాడు. అల్లాగ అతను రావలసిన అవసరంకూడా ఉంటూండేది; కాని ఈమధ్యని కొన్నాళ్ళనించి అతను లోపలికి రావడం మానేశాడు. ఏదైనా అవసరం వస్తే దాసీదాన్ని పంపిస్తున్నాడు. సాయంత్రం వడేముందుమాత్రం

ఒకసారివచ్చి సంగతులన్నీ కనుక్కుంటున్నాడు. ఈసంగతి అందరికంటే ముందుగా అచల గ్రహించింది. ఈసంగతి సురేశునితో ప్రస్తావించడం బాగుండదని ఆమె కాస్త సహించింది; కాని ఒకనాడు మహిముడే ఆమెను ఆవిషయంలో ప్రశ్నించాడు. ఆమెకింక చెప్పకతప్పింది కాదు. అందుచేత ఆమె "సురేశుడు ఈమధ్యంగా ఇంటిదగ్గిరే ఉండడంలేదు. మరి ఎక్కడికి వెడుతున్నాడో నాకు తెలియదు" అంది. అదంతావిని మహిముడు ఊరుకున్నాడు; అంతే! తనఅభిప్రాయం ఏమిటో పైకి తెలియనియ్య లేదు. ఆతరవాత ఒకరోజున పొద్దుకే అచల మేడమీదనించి కిందికి దిగుతూంది. సురేశుడు ఏదోపనిమీద మెడమెట్లెక్కుతున్నాడు. అతను అచలని చూసీచూడడంతోటే చటుక్కుని ముఖం తిప్పివేసుకుని వెళ్ళి పోయాడు. అచల అతను తనకి ముఖం కనపరచడం ఇష్టంలేక ఆమోస్తరుగా వెళ్ళిపోతున్నాడని గ్రహించింది. ఒకప్పుడు ఆమె అతను అల్లాగ ఉండడమే మంచిది అనుకుంది; కాని ఈవేళమాత్రం అతను అల్లాగ ఉండడంచేత లోలోపల ఎంతో బాధపడింది.

౨౬

అచల ఏపనిచేస్తూన్నా అస్తమానమూ ఒక్క విషయానికిమాత్రం చాలా బాధపడింది. ఆఒక్కవిషయమూ తలుచుకుంటూ ఉన్నప్పుడు ఆమెహృదయంలో భగ్గున మండుతూన్నట్లు ఉండేది. సురేశునికీ అచలకీ ఏవిధమైన సంబంధమూ లేదు. అయినా అతనిహృదయంలో ఏదో మార్పురావడంచూసి ఆమె బాధపడింది. ఆఒక్క విషయమే ఆమెని అస్తమానమూ కలచివేస్తూ ఉండేది. అసలు సురేశునిహృదయంలో అచలమీద ఒకబ్రహ్మాండమైన ప్రేమప్రవాహం పొంగింది. ఆప్రేమవాహిని ఇప్పుడు ఏఆశ్రయమూలేక తుదకు శోకముఖంగా ప్రవహించిపోతూంది ఆమె తనమనస్సు ఎన్నోవిధాల

తిప్పివేసుకుంది. అయినాగాని ఆమె సురేశుమీదనున్నలో కలిగిన పరివర్తనం సహించలేకపోయింది. ఒకప్పుడు ఆమెకు లోలోపల ఏదో భయంకలిగి ఆపైన ఒళ్లంతా పులకించినట్లుండేది. ఆమె "నాకు తెలియకుండా నేను లోలోపల సురేశబాబును ప్రేమిస్తున్నానేమూ?" అని అనుకుంటూ ఉండేది. ఒకప్పుడు ఆమె "ఇదంతా ఒట్టి తలాతోకాలేని ఆలోచన" అని లోలోపల నవ్వుకుంటూ ఉండేది. ఒకప్పుడు ఆమె "అల్లాంటిది జరగకుండా నేను ముందే ఉరిపోసుకుని చచ్చిపోతాను" అని అనుకునేది. అయినా గాని ఆమెకీఅభిప్రాయం నీడలాగ కూడా వెంటాడిస్తూన్నట్లే ఉండేది. ఇంట్లో తిరుగుతూన్నప్పుడుకూడా ఆసురేశున్ని ప్రేమిస్తూన్న విషయం ఆమె కళ్లకి ఎదురుగుండా జరుగుతూన్నట్లుండేది. అందుచేత ఈబాధలోంచి తప్పించుకోడానికి ఆమెఅస్తమానమూ భర్త దగ్గరే ఉంటూ ఉండేది. అతన్ని విడిచిపెట్టి ఇవతలికి రావడంఅంటే ఆమెకి ప్రాణసంకటంగా ఉండేది. మహిముడిగదికి పక్కగాఉన్న గదిలో అచలఉండేది. కాని కొన్నాళ్లనించి ఆమె ఆగదిలోకే వెళ్లడం మానేసింది. ఈవిధంగా కొన్నాళ్లు గడిచిపోయాయి.

మహిముడికి చాలావరకు నింపాదిగానేఉంది. కొద్దిరోజులపాటు అతను జబ్బలపూరులో ఉంటే మంచిదని వైద్యుడన్నాడు. అందుచేత ఆవిషయమే అందరూ ఆలోచిస్తున్నారు. ఆవేళ అచల పొద్దున్నే లేచి ఒకనిప్పువెలిగించి భర్తకోసం పాలు కాస్తూంది. పాలు మాటిమాటికీ పొంగిపోతున్నాయి. అందుచేత ఆమె ఎటుచూడడానికీ వీలులేకపోయింది. మహిముడు ఇంతవరకూ ఆమెకేసి అదే పనిగా చూస్తున్నాడు; కాని ఆమె ఈవిషయం గమనించలేదు. ఆమెకు హఠాత్తుగా మహిముడు నిట్టూర్చిన ఒక పెద్దనిట్టూర్పు వినబడింది. ఆమె ఒకసారి ముఖంఎత్తి అతనికేసి చూసి ఆపైన

ఆపైన ఏమిజరిగిందో ఆమె కేమీజ్ఞాపకంలేదు. లేచినతరవాతే ఆమె కీశాలువా మారిపోవడంసంగతి తెలిసింది. తన భార్య సిగ్గుపడడమూ, బాధపడడమూ గమనించి మహిముడు స్నేహపూర్వకంగా ఒక కులాసా నవ్వు నవ్వి "ఇందులో సిగ్గుపడవలసింది ఏముందిఅచలా! బహుశా నౌఖరు తారుమారుచేసి నీశాలువా అక్కడా, అతనిశాలువాఇక్కడా పెట్టిఉంటాడు. లేకపోతే సురేశుడేనిన్నసాయంత్రం ఇక్కడ మరిచి పోయిఉంటాడు. బహుశః రాత్రిఆనవాలుపట్టడానికి వీల్లేక నువ్వతని శాలువాకప్పుకొని ఉంటావు. నౌఖరుని పిలిచి నీశాలువా నీకు తెచ్చిపెట్టమని చెప్పు" అన్నాడు.

"ఇదిగో చెబుతున్నాను" అనిచెప్పి అచల ఆపక్కనున్నగది లోకి వెళ్ళిపోయింది. ఆమెకేదో మతిపోయినట్లయింది. ఒక్కనిమిషంలో ఆమెకిజరిగినవ్యవహారం అంతా తెలిసింది. చాలారాత్రి గడచిపోయినతరవాత సురేశుడు నిశ్శబ్దంగా అచల పడుకున్న చోటికి వచ్చిఉంటాడు. ఆపైనఅచల ఆచలిలో ఆవిధంగా పడుకోడంచూసి జాలిపడి ఎంతోఆప్యాయంగా తనపైమీదఉన్న శాలువా కప్పిఉంటాడు. ఈవిషయం అంతా ఇల్లాగే జరిగిఉంటుంది. ఇందులో పిసరంతైనా సందేహంలేదు. ఆమె కళ్ళుమూసుకుని సురేశుడు తనకేసి ఎంతోఆప్యాయంగా చూస్తూన్నట్టు భావించుకుంది. ఆదృశ్యం తలుచుకునేసరికి ఒక్కసారిగా ఆమెఒళ్ళంతా పులకరించింది. బహుశః తనని స్పష్టంగా చూడడానికి అతను అక్కడికి వచ్చిఉంటాడని ఆమె నిశ్చయించింది. ఆమెకి అతనల్లాగ ప్రతీ రాత్రికూడా వస్తున్నాడేమోనని అనుమానంగలిగింది. ఆమె ఆ సంగతి నిజమే అయిఉంటుందనిన్నీ అతనువచ్చినట్లు ఎవరూకనిపెట్టలేకపోయి ఉంటారనిన్నీ నిశ్చయించుకుంది.

సురేశుడు చేసిన ఈ పొరపాటు వల్ల ఆమెకెంతో సిగ్గు కలిగింది. ఆమె అతను చేసిన పని సిగ్గుమాలినదని భావించి అతన్ని అనేక విధాల నిందించింది. అతిథి విషయంలో గృహస్థు చేసిన ఈ అపరాధం క్షమించడానికి కూడా వీల్లేదని ఆమె అనుకుంది. అయితే ఇందులో ఒక విచిత్రమైన విషయం మాత్రం ఉంది. ఆమె సురేశుణ్ణి ఇలా చేస్తూన్న నేరారోపణ లన్నిటిలోనూ ఆమె హృదయము సంపూర్ణంగా పాల్గొనడంలేదు. అందుచేత ఆమెకీ విషయము అంతా ఒక పెద్దముల్లు గుచ్చుకున్నట్టు బాధపెట్టింది.

కేదారబాబు చిన్ననాటి స్నేహితుడొకడు జబ్బలపూరులో ఉంటున్నాడు. అతని దగ్గిరనించి ఈమధ్యనే ఒక ఉత్తరం వచ్చింది. అందులో అతను జబ్బలపూరులో గాలీ నీరూ చాలా మంచివనిన్నీ తన ఇల్లు చాలా విశాలమయిందనిన్నీ అందుచేత మహిము వస్తే అక్కడ సుఖంగా ఉండవచ్చుననిన్నీ రాశాడు. కేదారబాబు ఒకనాడు ఉదయం ఈ విషయము అందరితోనూ చెప్పాడు. ఇపైన మాఘమాసం పూర్తి అయిపోయిందనిన్నీ, మహిముడికి ప్రయాణంచేసే శక్తి కలిగిందన్నీ, ఇంక ఆలస్యం చెయ్యడం మంచిది కాదనిన్నీ చెప్పాడు. కేదారబాబు చిన్నతనంలో ఒకసారి జబ్బలపూరు వెళ్లాడు. అందుచేత ఆపట్టణం అంతా ఇప్పుడతనికి జ్ఞాపకం వచ్చింది. ఆకారణంచేత అతను ఆవిషయాలన్నీ ఎంతో ఉత్సాహంగా వర్ణిస్తూ "జగదీశబాబు భార్య ఇంకా బతికిఉంది. ఆమె మహిముడివిషయంలో తల్లికంటేకూడా ఎక్కువ ఆదరంగా చూస్తుంది. పనిలోపని నేనుకూడా ఒకసారి వాళ్ళందర్నీ చూసినట్టవుతుంది" అన్నాడు

మహిముడు ఈమాటలన్నీ నిశ్శబ్దంగా వింటూకూర్చున్నాడు. అంతేగాని అతనేమీ పెద్ద ఉత్సాహంగా ఉన్నట్టు కనబడలేదు. అతనికి ఉత్సాహం లేదన్న సంగతి ఒక్క అచల మాత్రమే గ్రహించింది. అందుచేత అక్కడినించి కేదారబాబు వెళ్ళిపోగానే మహి

ముడితో మెల్లిగా "జబ్బలుపూరు చాలామంచిపట్టణము. మీాకు అక్కడికి వెళ్ళడం ఇష్టంలేకూ?" అంది. మహిముడు "మీారంతా నాకు బాగానింపాదిగా ఉందనిఅంటున్నారు. నాముట్టుకినాకు అంత నింపాదిగా ఉన్నట్టు కనబడడంలేదు. ఎప్పటికైనా తగ్గుతుందో తగ్గదో నాకు తెలియదు" అన్నాడు. అచల "అందుకనే డాక్టరు మిమ్మల్ని ఇంకొక చోటికి మార్చాలని అంటున్నాడు. కొన్నాళ్ళపాటు అక్కడ ఉండిన స్తే ఆపైన బాగానింపాదిగా ఉంటుంది. అంది. ఆమాట మీాద. మహిముడు మెల్లిగా మెడతిప్పి కొంతసేపు మాట్లాడ కుండా ఊరుకున్నాడు. ఆపైన "ఏం చెప్పగలం! ఈపరిస్థితుల్లో నాకు ఎక్కడికి వెళ్ళడానికీకూడా ఇష్టంలేకుండా ఉంది. అచలా! నాకు ఒంట్లో ఏమీా బాగుండడంలేదు! నువ్వునాదగ్గిరలేకపోతే నేనింక అట్టేకాలం బతకను" అన్నాడు. ఈమాట అంటూంటే మాట మధ్యని అతనికంఠం గద్గదమయింది. మహిముడు ఇన్నాళ్ళనించీ నోరు విప్పి ఒక్కమాటైనా మాట్లాడలేదు. ఏవస్తువైనా కావాలని ప్రత్యేకంగా కోరలేదు. అతను లోలోపల ఎంతో బాధపడుతూ అడిగిన ఈకోరిక అచలహృదయంలో ఒకబల్లెంలాగ గుచ్చుకుంది. ఇంతకుపూర్వం ఆమెహృదయంలో గుప్తంగా ఉండిపోయిన ప్రేమా, స్నేహమూా, మాధుర్యమూా ఒక్కసారిగా పైకి పొంగివచ్చాయి. ఆమె పొంగిపొంగివస్తూన్న తన దుఃఖం ఆపుగోలేక ఇంకఅక్కడ ఉంటే బాగుండదని చటుక్కుని గదిలోంచి వెళ్ళిపోయింది. మహిముడు మతిపోయినవాడిలాగ ఎంతో ఆశ్చర్యంతోనూ బాధతోనూ ఆతెరిచిఉన్న ద్వారంకేసి చూస్తూకూర్చున్నాడు. అల్లా కొంతసేపుండి ఆతరవాత మెల్లిగా పడుకునినిద్రపోయాడు.

ఆతరవాత ఏదోసందర్భంలో మళ్ళీ భార్యాభర్త లిద్దరూ కలుసు కున్నారు; కాని ఈప్రస్తావన ఏమీారాలేదు. ఆతరవాత రోజున

అచలచేత్తో ఒక టెలిగ్రాము పట్టుకుని ఒక దిగులునవ్వు నవ్వి "జగదీశ బాబు మనం ఇచ్చిన టెలిగ్రాముకి సమాధానం ఇచ్చారు. ఆయన వారింటికి దగ్గిరగా మరొక చిన్న ఇల్లు కుదిర్చారట!" అంది. మహిముడీమాట తిన్నగా బోధపరుచుకోలేక "అంటే నీ అభిప్రాయము ఏమిటో నాకు బోధపడడం లేదు" అన్నాడు. ఆమాట మీద అచల "మా నాన్నగారి స్నేహితులు తమ ఇంట్లో మీరు ఉండడానికి ఏర్పాటుచేస్తామన్నారు; కాని ఇద్దరుమనుష్యులు వెళ్ళి వాళ్ళనెత్తిమీదకూర్చోవడం బాగుండదు. అందుకని మానాన్నగారు నిన్నటిరోజున వేరే ఒక ఇల్లు కుదర్చుకుని వారికి టెలిగ్రాము ఇచ్చారు. ఇది దానికిసమాధానము" అనిచెప్పి చింపిన కవరులోంచి ఒక కాగితంతీసి మహిముడిపరుపుమీద పడవేసింది. మహిముడు ఆ కాగితం మొదటినించి చివరదాకా చదివి "బాగుంది" అన్నాడు.

అచల తనంతట తనుకూడా రావడానికి సిద్ధపడుతూందని అతను గ్రహించాడు; కాని నిన్నటివ్యవహారం అతనికింకా పూర్తిగా బోధపడలేదు. అయినాగాని అతనేమీ అనలేదు; కాని అచలమాత్రం పూర్తిగా ప్రయాణసన్నాహంలోనే ఉంది. ఆవేళ మధ్యాహ్నంవేళ ఇంటికి వెళ్లి ఆమె తనసామానులూ అవీ సర్దుకుంటూ ఉంది. కేదారబాబు ఒక తలుపువెనకాల నుంచుని అదంతా చూసి "నువ్వు వెళ్ళిపోతే వీల్లేదా అమ్మా!" అన్నాడు. అచల అదిరిపడి ముఖంఎత్తి "ఏం! ఎందుకు అల్లాగ అంటున్నారు నాన్నగారు!" అంది. కేదారబాబు, మహిముడు జబ్బుగా ఉన్నప్పుడు అచల అతనిదగ్గిర ఉండడం మంచిదికాదనుకున్నాడు; కాని తను తండ్రి అయిఉండి కుమార్తెతో ఈమాట అనడం మంచిదికాదనుకుని అతను మహిముడి జబ్బుసంగతి ఎత్తి "అక్కడ ఆట్టేరోజులు ఉండక్కరలేదు. అదీగాక జగదీశబాబుగారి ఇంట్లో ఏవిధమైన లోటూ ఉండదు. ఈ నాలుగురోజులకోసమూ ప్రత్యేకంగా ఇంత

డబ్బు ఖర్చుపెట్టి నువ్వెక్కడికి—" అని ఏదో చెప్పబోయాడు; కాని అచలకి అసలుసంగతి ఏమిటో తెలిసింది కాదు. అందుచేత ఆమె తండ్రి వైపు చూసి "ఆయనమీతో ఏమన్నా చెప్పారా!" అంది.

"అబ్బే! ముహీముడేమీ అనలేదు. నామట్టుకి నేను—!

అచల "నాన్నగారూ! మీరేమీ కంగారుపడకండి! నేనేమీ లోటు రానివ్వను" అని చెప్పి, తనసామానులు సర్దుకోవడానికి వెళ్ళిపోయింది. ఆమర్నాడు. ఆమె తననగలు రెండు అమ్మించివేసి ఆడబ్బు చేత్తో పుచ్చుకుంది. అసలు ఫాల్గుణమాసంలో వెళ్లాలని అందరూనిశ్చయించారు; కాని సురేశునితల్లి పురోహితుణ్ణి పిలిపించి ఆయనచేత ఫాల్గుణమాస ప్రారంభంలోనే ముహూర్తం పెట్టించింది.

ప్రయాణానికి రెండురోజులముందు అచలకి కలిగిన ఉత్సాహానికి అంతులేదు. ఆమె కలకత్తావిడిచి పెట్టి కొద్దిరోజులుమాత్రం అత్తవారింట్లో ఉండిఉంటే! అంతకంటె ఇంకెక్కడికీ వెళ్లలేదు. అంతేకాదు. ఆమెపడమటిదేశంకూడా ఎప్పుడూ చూడలేదు. ఆదేశంలో అందమైన పర్వతాలూ అడవులూ నదులూ మొదలైన వెన్నెన్నో ఉన్నాయని జనం అంతా అనుకుంటూ ఉండేవారు. ఆమె వాళ్ళ నోటమ్మట ఆదేశాన్నిగురించి వినడమేగాని ఎప్పుడూ అక్కడికివెళ్లాలనిఅయినా అనుకోలేదు. ఇప్పుడు ఆమెస్వయంగా ఆవిచిత్రదృశ్యాలన్నీ చూడబోతూంది. అదీకాక అక్కడికి వెళ్ళడంవల్ల ఆమెభర్తకికూడా ఆరోగ్యం కలుగుతుంది. అన్నివిషయాల్లోనూ కూడా వీలవుతుంది. అక్కడి నీటివల్లా గాలివల్లా ఆమె భర్త ఆరోగ్యం బాగుపడుతుంది. అక్కడ జీవయాత్ర కూడా సుఖంగా గడిపివెయ్యడానికితగిన అవకాశాలున్నాయి, ఆమె భర్తకి నింపాదిగా ఉన్నాక అక్కడకుంటే ఇంకాకొన్నాళ్ళపాటు ఉండవచ్చును. అదీగాక అక్కడికి వెళ్ళినతరవాత అనేకమంది కొత్తవాళ్ళ ముఖాలన్నీ ఎంతో ఆప్యాయంగా కనిపించడం మొదలుపెట్టాయి. ఈ

విధంగా ఆమెకంటూన్న ఆనందస్వప్నాలకి అంతూదరీ లేదు. అన్నిటి కంటే ముఖ్యంగా భర్తకి తనతోడిదే లోకమన్నమాట తెలుసుకుని ఆమె ఉప్పొంగిపోయింది. ఇప్పుడామె మనస్సులో ఎవరిమీదా కోపంలేదు. లోపల ఉన్న బాధ అంతా ఒక్కసారిగా మాయమైపోయింది. ఆమె హృదయం ఇప్పుడు గంగాప్రవాహంలాగ పవిత్రంగా ప్రవహించింది. ఆమె ఇప్పుడు ఎల్లాగైనా మృణాలనొకసారి కలుసుకుని, ఆమెను హృదయ పూర్వకంగా కౌగలించుకుని, తను చేసిన అపరాధాలన్నీ క్షమించమని అడగాలని ఎంతో తహతహలాడింది. సురేశుడివిషయంలోకూడా ఆమెకెంతో జాలి వేసింది. సురేశుడు ఎంతో దగ్గిరస్నేహితుడయినా ఆమె ఎదటబడి మాట్లాడలేకపోతున్నాడు. ఈసంగతి తలుచుకుని ఆమె ఈవేళ బాధపడినంతగా మరిఎప్పుడూ బాధపడలేక క్షమాపణ కోరాలని అనుకుంది. కాని ఇంట్లోకనుక్కుంటే అతను నిన్నటినించీకూడా ఇంటిదగ్గిర లేడని తెలిసింది.

ప్రయాణం అయ్యేరోజున పొద్దున్న ఆకాశంఅంతా మేఘాలతో అలుముకుపోయింది. కొంచెంకొంచెము వర్షపుచినుకులుకూడా పడుతున్నాయి. సామానుసర్దడం అంతా పూర్తిఅయిపోయింది. అప్పుడే కొంత సామాను స్టేషనుకి వెళ్ళిపోయింది. టిక్కట్లుకూడా కొనేశారు. అచలకి సెకండుక్లాసు టిక్కట్టు కొనాలనిఅనుకున్నారు; కాని ఆమె మహిముసితో "మీకు డబ్బంతా ఖర్చుపెట్టెయ్యాలని ఉంటే కొనండి నేరాయిలాఉన్నాను. అవీగాక సామాన్యంగా భాగ్యవంతుల పిల్లలంతా ఇంటరుక్లాసులో ప్రయాణం చేస్తూంటే నేను ప్రయాణంచెయ్యలేనా? ఏమైనాసరే, నేను ఇంటరుక్లాసుకంటె పెద్దక్లాసులో ప్రయాణంచెయ్యను" అంది. అందుచేత ఆమెచెప్పినట్లు చెయ్యకతప్పిందికాదు.

అప్పుడే రెండురోజులనించి సురేశుడిసంగతి తెలియడంలేదు. ఈవేళ వర్షంకురుస్తూ ఉండడంవల్లనో మరేకారణంవల్లనోగాని అతను తన

గదిలో కూర్చుని చదువుకుంటున్నాడు. అతను ఆగదిలో ఇంతసేపటినించీ ఏదో దొంగగా కూర్చుని ఇప్పుడాపుస్తకం చదువుకుంటున్నాడు. ఇప్పుడు అచల ఆగదిలోకి వసంతలక్ష్మిలా ప్రవేశించింది. అచల ఆనందం ఉప్పొంగుతూ ఉన్న కంఠస్వరంతో "సురేశబాబూ! ఇంక మీరీజన్మంలో మాకుముఖం చూపించరా? ఏమిటి? ఇంతకీ మేముచేసిన తప్పేమిటో కాస్త చెప్పకూడదా!" అంది. సురేశుడు ఇప్పుడే ఒకఉత్తరం రాయడం ఆరంభించాడు. అచలమాట వినబడేసరికి అతను చటుక్కుని ముఖంఎత్తి చూశాడు. సురేశుడిముఖం చూసేసరికి అచలకి తమ ఇల్లు కాలిపోయి నప్పుడు ఆయింటి చుట్టూరాఉన్న చెట్లు జ్ఞాపకంవచ్చాయి. అచల అతనిముఖం అల్లాగ వాడిపోయి ఉండడంచూసి అదిరిపడింది. ఆమె ఉత్సాహంఅంతా ఒక్క దెబ్బలో ఎగిరిపోయింది. ఆమె లోలోపల చెప్పాలని అనుకున్నదంతా మరిచిపోయింది. అతనిదగ్గిరగా వెళ్ళి ఎంతో కంగారుపడుతూ "సురేశబాబూ! మీకు ఒంట్లో బాగాలేదా? ఈసంగతి నాతో చెప్పారు కాదేమిటి!" అంది.

సురేశుడు ఒకక్షణకాలం ముఖంఎత్తి చూశాడు. ఆ ఉత్తరక్షణం లోనే మళ్ళీముఖంవంచి "అబ్బే అదేమీలేదు! నాఒంట్లో బాగానేఉంది" అన్నాడు. ఆతరవాత మళ్ళీ పుస్తకం పుటలు తిరగవేస్తూ "ఈవేళే కాదూ! మీరు వెళ్ళేది! సర్దుకోడం అదీ పూర్తి అయిందా? ఏమో మళ్ళీ ఎప్పుడు కలుసుకుంటామో!" అన్నాడు. ఒకనిమిషందాకా అచల దగ్గిరనించి సమాధానం రాకపోవడంచూసి సురేశుడుఆశ్చర్యంతో ముఖంఎత్తి చూశాడు. అచలరెండుకళ్ళనించీ కన్నీళ్లు ప్రవహిస్తున్నాయి ఇద్దరికళ్ళూ కలుసుకోగానే కన్నీటిబిందువులు జలజలాప్రవహించాయి.

అదిచూసేసరికి సురేశుడి నాళాల్లో ప్రవహిస్తూన్న వేడిరక్తం ఉన్మత్త నృత్యంచేసింది; కాని అతను ఈవేళ తన సమస్తశక్తినీ కేంద్రీకరించి తన మనస్సు కుదుటబరుచుకుని తనదృష్టి కిందికి వాల్చేశాడు. అచల చీర

చెరగుతో తనకళ్ళు తుడుచుకుంటూ "మీ ఒంట్లో బాగుండడం లేదు సురేశబాబూ! మీరుకూడా మాతో రండి" అంది. సురేశుడు తల అడ్డంగా తిప్పుతూ "రాను" అన్నాడు.

"ఎందుకు రారు; మీకోసం—"

ఆమె అంటూన్న మాట పూర్తి కానేలేదు. ఇంతలో తలుపు అవతల నించి ఒకనౌకరు "బాబుగారూ! తమకి టీ!" అంటూ తెరతొలిగించి గదిలోపలికివచ్చాడు. ఆ ఉత్తరక్షణంలో అచల ముఖం ఇంకోపక్కకి తిప్పి చటుక్కుని ఆగదిలో నించి వెళ్ళిపోయింది. ఆపైన ఒకగంట ఉన్న తర వాత ఆమె తనభర్త పడుకున్న గదిలోకి వెళ్ళింది. మహిముడు "సురేశుడు ఇవ్వాళ్ళనించీ కనబడడం లేదు. ఎక్కడికి వెళ్లాడో నీకు తెలుసునా? అతను పినతల్లిగారితోకూడా ఏమీ చెప్పలేదుట? అతను ఈవేళకూడా నాకు కనిపించడా?" అన్నాడు. అచల "ఆయన ఈవేళ ఇంట్లోనేఉన్నారు" అంది. మహిముడు "అబ్బే లేదు! ఇప్పుడిప్పుడే దాసీదివచ్చి ఆయన పొద్దున్నే లేచి ఎక్కడికో వెళ్లారని అంది" అన్నాడు.

అచల ఏమీ అనలేదు; కాని ఆమెకి లోలోపల "నేను ఆయనతో ఇప్పుడే మాట్లాడాను. ఆయనకి ఒంట్లో బాగా అస్వస్థతగా ఉంది. చిన్నప్పటి నించీ చేసినట్లు ఆయన ఇప్పుడుకూడా మీప్రాణాలు రక్షించారు. లేక పోతే అధమపక్షం మీకృతజ్ఞత తెలియజెప్పడానికైనా ఆయనతో ఒకసారి మాట్లాడడం అవసరం! ఆయన్ని మనం వెళ్ళేచోటికి కూడా రమ్మని పిలవండి. ఆయనవల్ల మనం భయపడవలసిన అవసరంలేదు. నాసిగ్గూ అదీ చూసి మీరు సందేహపడకండి!" అని అనాలని అనిపించింది. కాని ఆమె వీటిల్లో ఒక్కమాటైనా నోటితో ఉచ్చరించ లేకపోయింది. అల్లాగ నిశ్శబ్దంగా నిలబడి పోయింది.

క్రమంగా స్టేషనుదగ్గిరికి వెళ్ళేసమయం సమీపించింది. కింద కేదార బాబు మాట్లాడుతూన్న మాటలు వినిపించాయి. సురేశుడి పినతల్లి ప్రయాణసన్నాహం చేయించేపనిలో మునిగిపోయింది. నౌకరు

సామానంతా బండిమీద పెడుతున్నాడు ; కాని గృహయజమాని మాత్రం ఎక్కడున్నాడో తెలియలేదు. అందులోనూ చిత్రమేమిటంటే— ఆవిషయం పైకిచెప్పడానికికూడా ఎవరికీ ధైర్యంకలగలేదు. కాని అందరూ దీన్నిగురించి లోలోపల బాధపడుతూనేఉన్నారు.

కేదారబాబు ఎవరూలేనిచోటికి కూతుర్ని పిలిచి ఆమెశిరస్సుమీద చెయ్యుంచి స్నేహార్ద్రమైన కంఠస్వరంతో "సావిత్రీదేవిలాగ పాతివ్రత్యంతో ప్రవర్తించు! మీఅమ్మని పోలినకూతురివి అని అనిపించుకో! ఏదో పెద్దతనంలో కోపం పట్టలేక నిన్ను అనేకం అని ఉంటాను. ఆమాటలన్నీ మరిచిపో!" అని కళ్ళమ్మట నీళ్ళుపెట్టుకున్నాడు. మహిముడు బండిఎక్కేసమయంలో ఎంతో బాధపడుతూ మెల్లిగా "మొత్తం మీద అతన్ని కలుసుకోవడం పడిందికాదు. అతనితో ఒకవిషయం మాట్లాడాలని ఉంది. అతనికోసం నేను పొద్దుటినించీ ఎదురుచూస్తూనే ఉన్నాను" అన్నాడు. తండ్రి చెప్పినమాటలవల్ల అచలకి కళ్ళమ్మట నీళ్ళు గిర్రునతిరిగాయి. అందుచేత ఆమెముఖం ఒకపక్కగా తిప్పి నుంచుంది. అంతేనేగాని ఏమీ మాట్లాడలేదు. తలుపుపక్కగా సురేశుడిపినతల్లి నుంచుంది. అచలఅక్కడికివెళ్ళి ఎంతోభక్తితో ఆమె పాదాలకి నమస్కరించింది. వెంటనే ఆముసలావిడ గద్గదకంఠంతో ఎన్నోవిధాల ఆశీర్వదించి "దీర్ఘసుమంగళీభవ! మీఆయన జబ్బునింపాదిగా ఉండి, మళ్ళీనువ్వు వెంటనే ఇంటికిరావాలని నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఉంటానమ్మా!" అంది. అచల "ఇదే నాకు పదివేలు" అని చీర చెరగుతో కన్నీళ్ళుతుడుచుకుంటూ మెల్లిగా బండిఎక్కింది.

## ౨౮

హావడా స్టేషనునించి పడమటికి బయలుదేరేబండి కదలడానికి ఇంకా పదినిమిషాలవ్యవధి ఉంది. ఆకాశంనిండా మేఘాలు కమ్ముకున్నాయి.

కొంచెంకొంచెము చినుకులుకూడా పడుతున్నాయి. తొడతొక్కిడిచేత ప్లాటుఫారంఅంతా ఇరకటంగా ఉంది. ప్రయాణీకులు సామానులు తడిసిపోకుండా ఉండే చోటు కోసం అటూఇటూ పరిగెడుతున్నారు. సరిగ్గా ఆసమయంలో అచలకి సూటుకేసు చేత్తోపట్టుకుని వస్తూన్న సురేశుడు కనిపించాడు. అతన్ని చూడగానే కేదారబాబు కెంతో ఆశ్చర్యం కలిగింది. వెంటనే అంతకుమించి అనుమానంకూడా కలిగింది. ఆపైన అతను దగ్గిరికి వచ్చి రావడంతోనే "ఏమిటి విశేషాలు సురేశ బాబూ? మీరెక్కడికి వెడుతున్నారు?" అని అడిగాడు. సురేశుడు దానికి అచలకే సమాధానంచెప్పాడు; కాని కేదారబాబుకేసి చూసి లేనినవ్వు తెచ్చిపెట్టుకుంటూ "ఇక మీరు పిలిచినమీదట రాకుండా ఉండడం మంచిదికాదనుకున్నాను. ఆపైన మీరు ఇచ్చినసలహాని ఊరుకోవడంకూడా మంచిదికాదనుకున్నాను. అసలు మీరువచ్చి చెప్పేదాకా నాఆరోగ్యం తిన్నగా లేదన్న సంగతి నాకు తెలియనేలేదు! నడవండి కొన్నాళ్లపాటుమీతో ఉంటాను అప్పటికైనా నా ఆరోగ్యం బాగుపడుతుందో బాగుపడదో చూస్తాను నిజంగా—" అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

మహిముడు అతనిమాట పూర్తికాకుండానే చటుక్కుని "ఇహనేం! బాగానేఉంది! నువ్వు వస్తే కాస్తమాకు సాయంగాకూడా ఉంటావు" అని అతనొక క్షణకాలం అచలకేసి చూశాడు. ఆచూపులో అతనెంతో బాధపడుతూన్నట్టు కనిపించింది. ఆతరవాత మళ్ళీ గట్టిగా "నాతో చెప్పావు కావేం? అచలా! అతనిఆరోగ్యం బాగాలేదని నీకు తెలుసునుకూడాను! ఈవిషయంలో మీఇద్దరిమధ్యనా చర్చకూడా జరిగినట్టు కనిపిస్తూఉంది. నాకు కొంచెమయినా తెలియనిచ్చావు కాదేం! నాదగ్గిర ఇంత దాపరికం ఎందుకు? అన్నాడు.

కాని అచల ఇంకొకపక్కకి ముఖంతిప్పేసింది. సురేశుడు ఒకక్షణ

కాలం మతిపోయిన వాడిలాగ తయారయ్యాడు. ఆపైన లోపలినుంచి పైకి ఉబికివస్తూన్న ఆవేశం అప్రయత్నంగా లేనికంగారు తెచ్చిపెట్టుకుని "సర్లే! దానికేంగాని, అప్పుడే బండి బయలుదేరేవేళ అయింది! ఎక్కండి! బండిఎక్కండి! ఆపైన నింపాదిగా కబుర్లు చెప్పుకోవచ్చును. రండి! కేదారబాబూ!" అని చెప్పి, అక్కణ్ణించి తప్పించుకుని ముందుగా నడిచాడు. కేదారబాబు చాలాసేపటిదాకా ఏమీ అనలేదు. అతను మహిముణ్ణి బండిఎక్కించి, అచలని ఆడవాళ్ళ పెట్టెలో కూచోపెట్టాడు. సరిగ్గా బండి బయలుదేరేవేళ సురేశుడువచ్చి మహిముడిదగ్గిర కూర్చున్నాడు. కేదారబాబు అతన్నిచూసి "ఇదేమిటి! మీరుకూడానే ఉన్నారు! దారిలో ఇంక ఏ ఇబ్బందీ ఉండదు. ఆడవాళ్ళపెట్టె ఇక్కడికి కొంచెందూరంగా ఉంది. మీరు అప్పుడప్పుడు వెళ్ళి కొంచెం చూస్తూ ఉండండి!" అన్నాడు ఆపైన మహిముడికేసి తిరిగి "అక్కడికి చేరగానే ఒక ఉత్తరం రాయడం మరిచిపోవద్దు! లేకపోతే నేను కంగారుపడుతూ ఉంటాను" అన్నాడు. ఆపైన అతను కన్నీళ్లు తుడుచుకుంటూ మెల్లిమెల్లిగా అక్కడినించి వెళ్ళిపోయాడు. బెంగగా ఉన్న అతనిముఖమూ, ఆమాటలూ, ఆస్నేహితులిద్దరికీ చాలాసేపటిదాకా జ్ఞాపకంవచ్చాయి.

బండికదలగానే చలిగాలి వేస్తుందనే భయంచేత మహిముడు కంబళీ కప్పుకుని పడుకున్నాడు. ఆ తరవాత వెంటనే నిద్రపోయాడు; కాని సురేశుడు తనకూర్చున్నచోట అల్లాగే కూర్చున్నాడు. అక్కడ అతనికేసి చూసేవాళ్ళుకూడా ఎవ్వరూలేరు. అతన్ని ఎవరైనా చూసిఉంటే అతనికళ్లు ఈవేళ రోజూఉన్నట్టుగా లేవని చెప్పిఉందురు. అతనికళ్లకేసి చూస్తే లోపల ఒక ప్రచండమైన అగ్నిపర్వతం బద్దలైనట్టు కనబడింది!

వాళ్లు ఎక్కినబండి పాసెంజరు. అదిప్రతీస్టేషనులోనూ ఆగుతూ మెల్లిమెల్లిగా వెడుతూంది. వర్షంకూడా కొంచెంకొంచెము పడుతూఉంది. ఒక పెద్ద స్టేషనుదగ్గిర బండిఆగగానే మహిముడు కంబళీ కొంచెంతొలిగించి

ముఖం ప్రక్కకి త్రిప్పి సురేశుడితో "ఇప్పుడు బాగా ఖాళీగా ఉంది. కొంచెంసేపు నిద్రపోలేకపోయారా? ఈ పై మార్గం ఇంతకంటె సుఖంగా ఉంటుందా? అన్నాడు. సురేశుడు ఉలిక్కిపడి "అబ్బే ఇప్పుడే నిద్రపోతాను." అన్నాడు. అతను ఉలిక్కిపడడం చూసేసరికి మహిముడికి ఎంతో ఆశ్చర్యం వేసింది. సురేశుడిన్నోసారి చూస్తే అతనేదో పెద్ద నేరంచేసి దాంకిపోతానేమో ననేభయంచేత తప్పించుకు పోతూన్నవాడిలాగ కనిపించాడు. ఎంతసేపు ఆలోచించినా మహిముడికి అతను అవిధంగానే కనిపించాడు.

బండి మళ్ళీ ఇంకో స్టేషను దగ్గర ఆగింది. సురేశుడు తనపరిస్థితి గమనించి, కొంతసేపటంగా నవ్వుతూ పట్టుసటించి "నవ్వు ఇందాకటినుంచీ నిద్రపోతున్నా ననుకున్నాను. అందుచేత నువ్వు పిలవగానే ఉలిక్కిపడ్డాను" అన్నాడు. మహిముడు ఆ సమాధానంవిని ఊరికే ఊకొట్టాడు. అతనికి సురేశుడు చెప్పినసంగతి సహజమైనదిగా కనబడలేదు. సురేశుడు "ఆవిడికి ఏమైనా కావాలేమో! అడిగివస్తాను" అన్నాడు మహిముడు "మరి పైన చినుకులు పడుతున్నాయే" అన్నాడు. సురేశుడు "ఆ, మరేమీ ఇబ్బంది లేదు. నేను మళ్ళీ చటుక్కున వచ్చేస్తాను" అని చెప్పి తలుపుతీసుకుని ప్లాటుఫారముమీదికి వెళ్లాడు. అక్కడినుంచి అతను ఆడవాళ్ల పెట్టిదగ్గిరకి వెళ్లాడు. అచల అక్కడ తనతో సమానమయిన వయస్సుకలిగిన ఒక స్నేహితురాలిని సంపాదించుకుని ఆమెతో ఏదో పిచ్చాపాటీ మాట్లాడుతూంది. ఆ రెండవస్త్రీ మొట్టమొదట సురేశుణ్ణి చూసి అవలక్షణసంజ్ఞచేసి మరోపక్కకి ముఖంతిప్పికూర్చుంది. అచల సురేశుడివైపు చూడగానే అతను "మీకేమైనా కావాలా?" అనిఅడిగాడు.

అచల అతనికేసిచూసి "అక్కరలేదు. మీరువర్షంలో అనవసరంగా తడిసిపోతున్నారు! వెళ్లండి!" అంది. ఆతరవాత మళ్లీకిటికీకి దగ్గిరగావచ్చి మృదువుగా "మీరు నాకోసం ఏమీ కంగారుపడక్కరలేదు. ఆయన్ని మాత్రం జాగ్రత్తగా చూస్తూఉండండి!" అంది. సురేశుడు "సరే! గాని

నీ కేమీ ఫలహారం గాని సోడా గాని అవసరం లేదూ?" అన్నాడు. అచల నవ్వుతూ "నాకేమీ ఒకటి అక్కర్లేదు; గాని ఈ వర్షంలో తడిసి మీరుకూడా జ్వరం తెచ్చుకుంటారా? ఏమిటి?" అంది. సురేశుడు ఒక్కక్షణకాలం అచలకేసి చూసి మళ్లీ కళ్లు క్రిందకి దింపేశాడు. ఆపైన "నేను చాలా రోజులనించి ఇల్లాగే ఊరుకుంటున్నాను. నా అదృష్టం ఏమిటో గాని జ్వరమయినా రావడంలేదు!" అన్నాడు.

ఆ మాట వినబడేసరికి అచలముఖం చెవులవరకూ ఎర్రబడిపోయింది; కాని అతను ఆ సంగతి గ్రహించిపోతాడేమో అనే భయంచేత ఇప్పటికే వేళాకోళంలోకి దింపెయ్యాలని నిశ్చయించుకుని బలవంతంగా ఒక నవ్వు నవ్వి "నయంగాని మీకు శ్రమ అనిపించక అక్కడికి ఒకసారి వెళ్ళండి!——" అని ఏదో చెప్పబోయింది; కాని మాట పూర్తి చెయ్యలేకపోయింది. ఆమె లోలోపలినించి పొంగిపొంగివస్తూన్న సిగ్గు, ఈ వేళాకోళాన్నీ ఈ నవ్వునీ కప్పివేసి పైకివచ్చేసింది. ఇంతలో చటుక్కుని బండి కదిలే గంట మోగింది. సురేశుడు ఏదో చెప్పబోయి ముఖం ఎత్తాడు; కాని ఏమీ చెప్పకుండానే వెళ్ళిపోయాడు; కాని ఏదో లాగుతూన్నట్టు అయింది. చటుక్కుని వెనక్కి తిరిగి చూశాడు. అతని శాలువా అంచు అచల పిడికిటిలో ఉంది. ఆమె "నేను మిమ్మల్ని కూడా రమ్మన్న సంగతి అందరి దగ్గిరా ఎందుకు చెప్పారు? అందరి ఎదటా నన్నింత చిన్నబుచ్చడం ఎందుకు?" అంది. సురేశుడప్పుడు సరిగ్గా ఈ కారణంవల్లనే ఎంతో పశ్చాత్తాపపడుతూ బాధపడుతున్నాడు. అందుచేత అతను గద్గదకంఠంతో "నేనిదంతా ఆలోచించుకోకుండా ఒక పెద్దపొరపాటుపని చేసేశాను. నావల్ల తప్పే!" అన్నాడు. అచల కొంచెమయినా శాంతించకుండా అల్లాగే గట్టిగా "అవును! ఏమీ ఆలోచించకుండానే చేశారు! నాకా మాత్రం తెలియదా? తెలిసిఉండీకూడా నన్నందరిఎదటా చిన్నబరచడానికే మీరీపని చేశారు!" అంది.

అప్పుడే బండి మెల్లిగా బయలుదేరింది. సురేశుడికి ఆపైన మరి మాట్లాడడానికి అవకాశం దొరకలేదు! అచల తినబోయే వాటిని విడిచిపెట్టగానే అతనేమీ సమాధానం చెప్పకుండానే గబగబా పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు. అతను ఎటూ చూడకుండా గబగబా పరిగెత్తుతున్నాడు. ఆమె అతనికేసి అల్లాగే చూస్తూకూర్చుంది. ఆమెకు, పరిగెత్తడంలో సురేశుడిగుండెలు కొట్టుకుంటూంటే ఆబండిలో ఉన్న మరిమొకవ్యక్తిగుండెలు ఆగిపోతూన్నట్టు కనిపించింది. అచలకి ఆవ్యక్తి స్పష్టంగానే కనిపించాడు. ఆమూల ఇంకొకకిటికీలో తలదూర్చి మహీముడు వాళ్ళకేసి చూస్తున్నాడు. అచల మళ్ళీవచ్చి తనచోటులో కూర్చోగానే ఆపక్కనకూర్చున్న స్త్రీ "ఆయన మీవారేనా?" అని అడిగింది. అచల పరధ్యానంగా ఊకొట్టి, కిటికీలోంచి ఆపక్కనున్న మైదానంకేసీ, చెట్లకేసీ, చూస్తూకూర్చుంది. ఆమె ఆపక్కనున్న స్త్రీతో ఏదోవిషయం సగంసగం మాట్లాడుతూ సురేశుడిదగ్గిరికి వచ్చింది; కాని ఇప్పుడు మళ్ళీ ఆసంగతి ఎత్తడం ఆమె కిష్టంలేకపోయింది.

బండి అనేకమైన పట్టణాలూ పల్లెలూ దాటుతూ వెళ్ళిపోతూంది. క్రమంగా అచలబెంగ అంతాపోయి మనస్సు నిర్మలం అయింది. ఆమె మళ్ళీ తనపక్కని కూర్చున్న ఆవిడితో మెల్లిమెల్లిగా మాట్లాడడం ప్రారంభించింది. అచల ఇంతకిపూర్వం సిగ్గుచేత ఒక్కమాటైనా మాట్లాడలేకపోయింది; కాని ఇప్పుడామెకి ఆసంగతే జ్ఞాపకంలేదు! ఒక పెద్దస్టేషను రాగానే సురేశుడు ఒకబట్లరుచేత కొన్ని తినుబండారాలూ టీపట్టించుకుని ఆమెదగ్గిరికి వచ్చినుంచున్నాడు. ఆమెఅందులో కొన్నితీసుకుని ఎంతో ఆప్యాయంగా "మిమ్మల్ని ఇవ్వన్నీ చెయ్యమని ఎవరుచెప్పారు? బహుశః ఆయనే చెప్పి ఉంటారనుకొంటాను" అంది.

ఇల్లాంటి విషయాల్లో సురేశుడు ఒకరు చెప్పేమాట వినేమనిషి కాదని అచలకి తెలుసును. అయినా అతను ఇంత శ్రమపడినందుకు

వచ్చింది. ఆరోజుల్లో అచలకీ మృణాలకీ కొంచెమైనా పడేది కాదు. ఇప్పుడు ఈవిషయంలో కూడా అచలకి ఎంతో కోపం వచ్చింది. ఆస్త్రీ చెబుతూన్న మాటలు పూర్తిఅవగానే అచల కఠినంగా "మీరు నామాటలన్నీ వినలేకపోతేమో? వెళ్ళి మీచోటు లోనే కూర్చోండి" అంది. ఆపైన ఆమె మళ్ళీ ఆ టీ కొంచెమైనా ఉపయోగించకుండా కిటికీలోంచి పారపోసింది. ఆస్త్రీ చాలా సేపటిదాకా నోరు తెరవలేక అల్లాగే అచలకేసి చూస్తూ కూర్చుంది. ఆపైన ముఖం తిప్పేసి చీరచెంగుతో కళ్ళు తుడుచుకుంది. బహుశః ఆస్త్రీ తనమనస్సులో "ఇంతసేపటినుంచీ ఇంతమర్యాదగా మాట్లాడి నందుకు కొంచెం గౌరవమైనా అక్కరపెట్టింది కాదు" అని లోలోపల బాధపడి ఉంటుంది. ఆపైన ఆ విషయప్రస్తావనాసి మరింత పెచ్చుపెరిగి పోతుందేమో అన్నభయంచేత ముఖం పక్కకితిప్పుకుని కూర్చుని ఉంటుంది.

కొంతసేపటికి వర్షం కొంచెము తగ్గింది. కాని ఆకాశంమీద మేఘాలింకా అలుముకుంటూనే ఉన్నాయి. ఆపైన మళ్ళీ కొంత సేపటికి జోరుగా వర్షం కురవడం ప్రారంభించింది. ఆరెండో స్త్రీ ఇంకొక పావుగంటలో దిగవలసిఉంది. అందుచేత తనసామానంతా సర్దు కుంటూంది. అచల ఆపైన ఇంక మాట్లాడకుండా ఉండలేక పోయింది. అందుచేత ఛటుక్కుని ఆస్త్రీదగ్గిరికి వెళ్ళి ఆమెపక్కని కూర్చుని ఎంతో ఆప్యాయంగా ఆమెచెయ్యి పట్టుకుని "ఈవేళ చేసిన దానికి నాకెంతో చిన్నతనంగా ఉంది. నన్ను క్షమించండి!" అంది. ఆమాటకి ఆరెండోస్త్రీ నవ్వి ఊరుకుంది. అంతేనేగాని ఏమీ సమా ధానంచెప్పలేదు. అచల మళ్ళీ "నామనస్సేమీ బాగాలేదు. అందు చేత నేనేమి చేస్తున్నానో నాకే తెలియడంలేదు. నాభర్తగారికి జబ్బుగా ఉంది. ఆయన్ని ఆరోగ్యంకోసం ఇంకొక ఊరు తీసుకువెడుతు

న్నాను. ఆయనకి సింపాతిగా ఉంటే సరేసరి. లేకపోతే ఆదూర దేశంలో నాగతి ఏమవుతుందో పరమేశ్వరుడికే తెలియాలి" అంది. ఆమాటలు చెబుతూఉంటే ఆమెకంఠం గద్గదమయింది.

ఆస్త్రీ ఆశ్చర్యపడి "మీభర్తగారికేసి చూస్తే జబ్బుచేసిన మనిషి లాగ కనబడలేదే!" అంది. అచల "నాభర్తగారు వేరే ఇంకొక పెట్టిలో ఉన్నారు, ఇప్పుడు మీకు కనబడినవారు ఆయనకాదు. ఆయన వారికి స్నేహితులు" అంది. ఆస్త్రీ ఆమాటలమీద మరింత ఆశ్చర్యపడి ఊరుకుంది. ఇంతకిపూర్వం ఆస్త్రీ ఈయన మీభర్తగారేనా?" అని అడిగింది. దానికిఅచల పరధ్యానంగా ఔనొట్టి సమాధానం చెప్పింది. కాని ఆవిషయం ఆమె మరిచేపోయింది. ఆరెండో స్త్రీమాత్రం ఈవిషయం మరిచిపోలేదు. అయితే అచలమాత్రం ఆమెకి కలిగిన ఆశ్చర్యం మరొకవిధంగా అర్థంచేసుకుని సురేశుడితో తనుమాట్లాడడం ఆమె గమనించిఉంటుందని అనుకుంది. అందుచేత ఆమెదృష్టిలో తను ఎంతో తక్కువ అయిపోయినట్టు భావించుకుని లోలోపల ఎంతో సిగ్గు పడింది. ఆస్త్రీతోమాట్లాడేటప్పుడు తలా తోకా లేకుండా ఏదేదో మాట్లాడింది. ఆతరవాత "మేము హిందువులముకాము. బ్రహ్మసమాజ స్థులము" అంది. ఆపైనకూడా ఆస్త్రీ సమాధానం చెప్పలేదు. అందుచేత అచల కొంచెం సంకోచించి ఆమెచెయ్యి ఒదిలేసి "మా ఆచారవ్యవహారాలూ అవ్వీ మీకు తెలియవు. అందుచేత మీరు నన్ను చూసి ఆశ్చర్యపడి ఉంటారు" అంది. ఆస్త్రీ మళ్ళీనవ్వి "మేము ఎప్పుడూ ఆశ్చర్యపడము; కాని ఏకారణంచేతనో మీరే మమ్మల్ని చూసి దూరదూరంగా తప్పుకుంటూ ఉంటారు! ఇదిఎల్లాగ తెలిసిందని అడుగు తారేమో! చెబుతాను వినండి! మాకు బ్రహ్మసమాజం వాళ్ళలోకూడా ఒకళ్ళిద్దరు బంధువులున్నారు. వాళ్ళనిబట్టి నాకీసంగతులన్నీ తెలి శాయి" అనిమళ్ళీ నవ్వింది. అచల అయితే ఏకారణంచేత మావాళ్లు

మీకు దూరదూరంగా ఉంటున్నారు!" అంది. ఆ స్త్రీ "ఆసంగతి మరి మీకే తెలియాలి! లేకపోతే మీసమాజంవారికి నే ఇంకెవరికైనా అడగండి!" అని నవ్వింది. ఆపైన ప్రసంగం అంతటితో ఆపేసి "మీరు అంత దూరం వెళ్ళేటంత మీభర్తగారిని కూడా తీసుకురాకూడదూ!" అని అడిగింది.

అచల "ఎక్కడికి; ఆరా పట్టణానికా!" అని అడిగింది. ఆ స్త్రీ "అబ్బే ఆపట్టణానికి కాదు. అసలు అక్కడ ఎవరూ ఉండడమే లేదు. మావారు అక్కడ ఏదో కంట్రాక్టుపని చేస్తున్నారు. అందుచేత నేను అప్పుడప్పుడు అక్కడికి వెళుతూ ఉంటాను. నేను డెహ్రీ మాట చెబుతున్నాను. డెహ్రీలో మా యిల్లు శోణానది పక్కనే ఉంది. అక్కడ నాలుగైదు రోజులుంటే మీవారికి బాగా నిమ్మాదిగా ఉంటుంది. ఏం! అక్కడికి వస్తారా!" అని అడిగి, అచల రెండుచేతులూ పట్టుకుని ఆమె సమాధానంకోసం నిరీక్షించింది. ఈ అపరిచితురాలు కనబరిచిన స్నేహం చూసి అచల ఎంతో ఆనందించింది. ఆమె ఒక్క నిమిషం ఊరుకుని "అయితే ఈవిషయంలో మీవారి అభిప్రాయంకూడా తీసుకోవాలి కదా!

వారితో చెప్పకుండా నన్ను తీసుకువెళ్ళడం ఎల్లాగ కుదురుతుంది!" అంది. ఆ మాటలమీద ఆ స్త్రీ అచలకేసి పరిశీలించి చూసి "మేము పురుషులకి సేవచెయ్యడంలో దాసీలము అయితే ఇంక అన్నిటిలోనూ దాసీలమే అనుకుంటున్నారా! ఇల్లాగ ఎప్పుడూ అనుకోకండి. వాళ్ళకు మనల్నివ్వడంలో మనదే పై చెయ్యి. మీరు వెళ్ళేఊరు బాగుండకపోతే తిన్నగా డెహ్రీ వచ్చేసెయ్యండి. దీనికోసం మీరేమీ తటపటాయించక్కరలేదు. ఇదిగో! నేను మిమ్మల్ని పిలిచేశాను. ఇంక వారితో చెప్పడం సంగతి అదీ నేను చూసుకుంటాను. ఆగొడవ అంతా మీకెందుకు!" అంది. ఆమె చెప్పే ప్రతిమాటలోనూ భర్తృవాల్లభ్యం ఉప్పొంగి ప్రవహించింది. ఆమెకు కలిగిన ఆనంద-

వాహినిలో అచలకూడా మునిగిపోయింది.

బండి నడక తగ్గడంచేత ఆ స్టేషనుదగ్గిరికి వచ్చినట్లు తెలిసింది. ఆస్త్రీ మళ్ళీ అచల చేతులు రెండూ పట్టుకుని ఎంతో ఆవేశంతో "నేను దిగవలసిన స్టేషను వచ్చేసింది. ఇంక నేను దిగిపోతాను. మీరు అనవసరంగా బెంగపెట్టుకుని మనస్సు పాడుచేసుకోకండి మీ కేమీ భయంలేదు మీ వారికి వెంటనే జబ్బు నిమ్మళిస్తుంది కాని మీరు తిరిగివచ్చేటప్పుడు ఎక్కడ దిగుతారో నాకు మాటఇవ్వండి. తిరిగివెళ్ళేటప్పుడు తప్పకుండా ఇక్కడ దిగుతారు కాదూ?" అంది.

అచల చీరచెరగుతో రెండుకళ్ళూ తుడుచుకుంటూ "మీ దయవల్ల అల్లాంటి రోజు లేవస్తే తప్పకుండా మిమ్మల్ని కలుసుకుంటాను." అంది ఆస్త్రీ "అల్లాంటిరోజులు ఎందుకు రావు? తప్పకుండా వస్తాయి! మీ సంగతిఅంతా నాకు తెలిసిపోయింది. నేనొక్కమాట చెబుతున్నాను వినండి! మీ భర్తగారివిషయంలో మీకున్న భక్తిప్రేమా చూసి భగవంతుడు తప్పకుండా మీకు సహాయంచేస్తాడు మరొకవిధంగా ఎప్పుడూ కాదు." అంది. అచల ఆమాటకేమీ సమాధానం చెప్పలేక ముఖం ఇంకొకపక్కకి తిప్పి ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టింది.

బండి మెల్లిగా ప్లాటుఫారం దగ్గిర ఆగింది. ఇంకా బాగా వర్షం వస్తూనే ఉంది. ఆస్త్రీ మరిది ఇంకొక పెట్టెలో కూర్చున్నాడు. బండిఆగగానే అతనువచ్చి ఆపెట్టెతలుపు తీశాడు. అచల ఆస్త్రీ చెవి దగ్గిర ముఖంపెట్టి "మీరు భర్తపేరు నోటితో పలకరన్న సంగతి నాకు తెలుసును. దానికేంగాని మీ పేరేమిటో చెప్పండి మళ్ళీ తిరిగివచ్చినప్పుడు మీ ఎడ్రసు తెలుసుకోవడంఎల్లాగ?" అంది ఆస్త్రీ చిరునవ్వునవ్వి "నాపేరు రాక్షసి దేవారీలోంగి బంగాళీ వాళ్ళని ఎవళ్ళనిఅడిగినా నా ఎడ్రసు చెబుతారు. మీరిద్దరూ తప్పకుండా ఒకసారి మాయింటికి రావాలి! మీరు రాకపోతే నన్ను చంపుకు

తినన్నట్టే! నేనుమీరాకకోసమూ ఎదురుచూస్తూంటాను. మాయిల్లు శోణానదిఒడ్డునే ఉంది" అని చెప్పి రెండుచేతులూ జోడించి నమస్కరించి ఆవానలో తడుస్తూ ఉరికివెళ్ళిపోయింది.

ఆతరవాత మళ్ళీ బండి మెల్లిమెల్లిగా కదలింది. అప్పుడే సూర్యాస్తమానంకూడా అయిపోయింది. ఆపైన పొద్దుటినించీ ఒక మోస్తరుగా వీస్తూన్నగాలి ఇప్పుడు బాగా ఎక్కువయింది. అందుచేత ఆరాత్రి మరింతభయంకరంగా కనబడింది. అచల గాజుకిటికీలలోంచి చాలాసేపు ఆకాశంవైపుచూసింది. అల్లాగ చూడగా చూడగా కొంతసేపటికి ఆమెకి కళ్లునెప్పిపెట్టాయి. కొంతసేపటికి ఆమెకు ఆఅంధకారం నోరుతెరచుకుని మింగబోతూన్నట్లు కనిపించింది. ఆమె "ఎప్పటికైనా ఈఅంధకారం అంతా వొదిలిపోయి వెలుతురు కనిపిస్తుందా!" అని భయపడింది. ఆపెట్టిలో ఇంకెవ్వరూ లేరు. ఆమె ఒకమూలకి చేరుకుని దుప్పటీకప్పుకుని కళ్లుమూసుకుని పడుకుంది. ఆమెకళ్ళమ్మట కన్నీళ్లు జలజలా ప్రవహించడం ప్రారంభించాయి. ఆమెకు ఈవిధంగా కన్నీళ్లు రావడానికి కారణంఏమిటోకూడా తెలిసిందికాదు. అల్లాగ ఎంత ప్రయత్నించినా ఆమె ఆదుఃఖం ఆగిందికాదు. అది అంతకంతకి ఆమెహృదయంలోంచి తరంగాలలాగ పొంగిపొంగ పైకివచ్చింది. ఆమెకి మొట్టమొదట తనతండ్రివిషయం జ్ఞాపకంవచ్చింది. అటు తరవాత ఆమెకు చిన్ననాటి చెలికత్తెలంతా జ్ఞాపకం వచ్చారు. ఆపైన క్రమంగా సురేశుడి పినతల్లీ, మృణాలాకూడా జ్ఞాపకం వచ్చారు. ఆఖరికి ఇప్పుడు రైలులో కనబడినరాక్షసికూడా జ్ఞాపకంవచ్చింది. ఆపైన యముడుకూడా ఆమెకళ్ళకి ఎదురుగుండా కనబడ్డాడు. ఆమె ఈవేళ తనుఅందరినీ విడిచిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోతూన్నట్టు భయపడింది.

ఇల్లాగ కొంతసేపు జరిగినతరువాత బండిమళ్లీ ఇంకొకస్టేషనుదగ్గిర ఆగింది. అప్పటికి ఆమె హృదయానికి కొంత శాంతి కలిగినట్లయింది. ఆమె లేచికూర్చుని ఎవరైనా పెట్టెలోకి వస్తున్నారేమోనని కొంతసేపు ఇటూ అటూ చూసింది. కొందరు ఆవానలో తడుస్తూదిగివెళ్లిపోయారు. అల్లాగే రైలుఎక్కారు; కాని ఎవ్వరూ అచలకూర్చున్న పెట్టెలో ఎక్కలేదు. అచల బండిబయలుదేరగానే ఒకపెద్దనిట్టూర్పు విడిచిపెట్టి, మళ్లీదుప్పటీ కప్పుకునిపడుకుంది. అల్లాగ పడుకునేసరికి ఆమెకు ఏకారణంచేతనో మళ్లీ సంతోషంకలిగింది. ఇల్లాగ సంతోషం కలగడం ఆమెకి కొత్తకాదు. గాలిమార్పు కోసం జబలుపూరు ప్రయాణం అయ్యేటప్పటినుంచీ ఆమె ఇల్లాగే ఏవేవో సుఖస్వప్నాలు కని సంతోషపడింది. ఆమె ఈవేళకూడా తనభర్తకి జబలుపూరు వెళ్లడంవల్ల ఆరోగ్యం కలుగుతుందనిన్నీ తను ఇంక సుఖపడవచ్చుననిన్నీ అనుకుని ఆనందించింది.

ఆమె ఆతరవాత కొంతసేపు నిద్రపోయింది. మెళుకువ వచ్చినతరువాత ఎంతసేపటినించి నిద్రపట్టిందో ఆమెకి జ్ఞాపకంరాలేదు. ఆమెను పేరు పెట్టి తన్నెవరో పిలుస్తూన్నట్లనిపించింది. ఆమె కంగారుపడుతూ చటుక్కుని లేచికూర్చుంది. ఆమెకళ్లకి ఎదురుగుండా సురేశుడు కనబడ్డాడు. చటుక్కునితలుపుతియ్యడంవల్ల ఈదరగాలి లోపలప్రవేశించి అంతా జల్లుతో తడిపివేస్తూంది. సురేశుడు గట్టిగా పిలిచి "గబగబా దిగండి! బండి ప్లాటుఫారముమీద నిలబడింది. మీసూటుకేసు ఎక్కడవుంది?" అని అడిగాడు.

అచల ఇంతవరకూ నిద్రవల్ల కళ్లు తెరవలేకపోయింది! కాని జబలుపూరు వెళ్లడానికి అలహాబాదులో బండి మార్చాలన్న సంగతి ఆమెకి జ్ఞాపకం వచ్చింది. ఆమె తనసూటుకేసు సురేశుడికి చూపించి కంగారుపడుతూ గబగబా దిగింది. ఆపైన 'ఈగాలివానలో ఆయన ఎల్లాగ దిగుతారు? ఇక్కడ సవారీలాంటిది ఏదీదొరకదా? ఈవానలో దిగితే జబ్బు మరింత

ఎక్కువైపోతుందేమో సురేశబాబూ!'' అంది. సురేశుడేదో చెప్పాడు గాని ఆగాలిహోరులో అదిఏమీ వినబడలేదు! అతను ఒకచేత్తో సూటుకేసూ రెండోచేత్తో అచలచెయ్యీ పట్టుకుని, ఆరెండో ప్లాటుఫారము వైపు గబగబా నడవడం మొదలుపెట్టాడు. రెండోబండి బయలుదేరడానికి సిద్ధంగా ఉంది.

సురేశుడు గబగబా అచలని అక్కడికి తీసుకువెళ్లి, ఆమెను ఫస్టుక్లాసుపెట్టిలో ఎక్కించాడు. ఆ పైన తొందరగా "మీరు ఇక్కడ కూర్చోండి! నేను వెళ్లి మహిముణ్ణి తీసుకునివస్తాను'' అన్నాడు.. అచల అయితే ఈ టిక్కెట్టిదుప్పటి తీసుకువెళ్లి ఆయనకి బాగా కప్పి మరీతీసుకురండి! అనిచెప్పి, ఆదుప్పటి సురేశుడిమీదికి విసిరింది. అతను అదితీసుకుని గబగబా బయలుదేరి వెళ్లిపోయాడు.

అచల ఆఅంధకారంలో కనబడినంతవరకు ముందుకిచూసింది. దూరాన్నించి స్టేషనుదీపాలు కనిపిస్తున్నాయి. ఆగాలిలోనూ ఆవానలోనూ అవిఅన్నీ చాలావరకు మసకగానేకనిపించాయి. ప్రయాణీకులంతా వానలో తడుస్తూ పరిగెడుతున్నారు.కూలీలు కొంతమంది బరువులు నెత్తిమీద పెట్టుకుని గబగబా నడచివెడుతున్నారు. రైల్వేఉద్యోగస్థులంతా తమతమపనులలో మునిగిఉన్నారు. ఆదృశ్యంఅంతా మసకమసకగా కనబడింది. క్రమంగాఆమెకూడా సర్దుకునికూర్చుంది. ఇంతలోరైలుగంట గట్టిగా గణగణమని మోగింది. అచలదిగినబండి పెద్దకొండచిలవలాగ బుసకొట్టి ఆకాశంఅంతా ఒణికించి క్రమంగా ప్లాటుఫారం విడిచిపెట్టి వెళ్లిపోయింది. ఆబండి వెళ్లినతరవాత దానిస్థానంలో ఆమెకు ఒక గంభీరమైనఅంధకారం కనిపించింది. ఆ పైన మళ్లీ ఇంకోక గంటమోగింది. ఇది తనుకూర్చున్న బండికోసం మోగుతూందని అచల అనుకుంది. కాని మహిముడు ఎక్కినసంగతిగాని సామానులసంగతిగాని ఆమెకేమీ తెలియలేదు. అందుచేత ఆమె ఈవిషయంలో కంగారుపడడం మొదలుపెట్టింది.

ఒకవ్యక్తి ఒళ్లంతా కంబళీకప్పుకుని తనచేతిలో ఉన్న లాంతరు గబగబా అటూ ఇటూ కదుపుతున్నాడు. అతను ఎదుటికిరాగానే అచల "మా పాపిరులు అంతా బండిఎక్కారా?" అని అడిగింది. ఆవ్యక్తి ఫస్టుక్లాసు పెట్టెలోంచి వచ్చినవాడు ఏదీ చెప్పకుండా ఆగి "చిత్తం! అమ్మా!" అన్నాడు. అచల కొంచెం ధైర్యం తెచ్చుకుని "ఇప్పుడు టైమెన్నిగంట లయింది? అని అడిగింది. ఆవ్యక్తి "తొమ్మిదిగంటలు" అన్నాడు. అచల ఉలిక్కిపడి "తొమ్మిదిగంటలా!" అంది. ఇంచుమించు మాగా తెల్లవారే వరకూ మనకింకా బండి అలహాబాదు స్టేషనుకి రాదు. అందుచేత ఆమె కంగారుపడుతూ "అయితే అలహాబాదు చేరేసరికి——" అని ఏదో అడగబోయింది; కాని ఆవ్యక్తి ఇంకఅక్కడ నిలబడలేదు. ఆమనిషిదగ్గిర గొడుగులేదు. ఆపైని గాలితోపాటు వర్షపుచినుకులు కళ్లల్లో సూదుల్లాగ గుచ్చుకుంటున్నాయి. అందుచేత ఆమనిషిచేతిలో లాంతరు అటూ ఇటూ కదుపుతూ 'మొగలుసరాయి! మొగలుసరాయి!' అని గట్టిగా కేకలుపెడుతూ, గబగబా ముందుకివెళ్లిపోయాడు.

ఆపైన ఈజిలు వినబడింది. బండి మెల్లిమెల్లిగా కదిలింది. సరీగ్గా ఈసమయంలో సురేశుడు పరిగెత్తుకుంటూ వచ్చి, "మీరేమీ కంగారుపడక్కరలేదు! నేనీ పక్కపెట్టెలోనే కూర్చుంటాను." అని చెప్పి; గబగబా అక్కడినుంచి వెళ్ళిపోయాడు

## ౨౮

సురేశుడు పక్కపెట్టెలోనే ఉన్నాడు; కాని మహిముడిమాట? ఆమె ఇంతవరకూ కళ్లు రెప్పవెయ్యకుండా అతనికోసం చూసింది. పైన ఎంత మసకమసకగా ఉన్నా అతనిముఖం ఒకసారి అయినా కనబడవలసిందే! మరి ఎందుకుకనబడలేదు? ఆపైన, బండి అలహాబాదులో మారకుండా ఇక్కడ ఎందుకు మారింది? వర్షధారలుపడి ఆమెజుట్టూ బట్టలూ

అన్నీ తడిసిపోయాయి. అయినాగాని ఆమె ఆ అంధకారంలో మాటిమాటికీ అవతలికి చూసింది. ఇల్లాగ చూడడానికి కారణం ఆమెకే తెలియాలి! ఏది ఎల్లా జరిగినా, ఈ బండిలో తన భర్త లేడని అనుకోడానికి కూడా ఆమె సిద్ధపడి ఉండలేదు. తన రాత్రి సంగతిని విడిచిపెట్టి తను ఒక స్త్రీ సురేశుడితో కలిసి ఎక్కడికో వెళ్ళిపోవడమూ! స్వప్నంలో కూడా ఇల్లా జరగడానికి వీల్లేదు! తప్పకుండా సుహిముడు ఈ బండిలోనే ఎక్కడో ఉండితీరాలి!

సురేశుడు ఎల్లాంటిమనిషి అయినా కావచ్చును. ఎల్లాంటిపని అయినా చెయ్యవచ్చును! కాని అతను నిరపరాధిని అయిన తనని ఈవిధంగా మృత్యుముఖంలోకి విసిరి వేస్తాడా? అతను అంత మతిలేనివాడని అనడానికి వీల్లేదు! అదీగాక, దీనివల్ల అతనికి వచ్చేలాభం ఏమిటి? ఒకవేళ అతనికి అచల శరీరంమీద అపేక్ష ఉందని అనుకుందాము. ఇల్లాగ ఉంటే మాత్రం, అచల తనశరీరాన్ని ఒక వేశ్యాశరీరంలాగ మార్చివెయ్యడానికి అంగీకరిస్తుందా? ఒకవేళ ఆమెశరీరం ఆవిధంగా మారిపోతే ఇంక ఆమె జీవిస్తుందా? ఇంత స్వల్పమైన విషయం సురేశుడికి తెలియదూ? ఈమాత్రం తెలియనిమనిషి ప్రేమసంగతి ప్రస్తావించడం ఎందుకు? తనని నిజంగా ప్రేమించేమనిషికి ఈమాత్రం తెలియక్కర్లేదా? అబ్బే! ఇల్లాగ ఎప్పటికీ జరగదు! అతనూ సుహిముడూ కలిసి ఇంజనుపక్కనున్న పెట్టెలో ఎక్కడో ఎక్కి ఉంటారు. ఆ అంధకారంలో ఆమెకి తిన్నగా కనిపించలేదు!

ఇంతలో ఆమెముఖంమీద ఒక పెద్దజల్లు కొట్టింది. ఆమె అక్కడినుంచి లేచి మళ్ళీ మూలకివెళ్ళింది. ఇందాకటినించీ కిటికీలోనించి పైకి చూడడంవల్ల ఆమెచీర అంతా పూర్తిగా తడిసిపోయింది. చీరచెంగు చివళ్ళనించి చిన్న చిన్న నీటిబిందువులుకూడా రాలుతున్నాయి. ఇందాకటినించీ ఈచలిలో ఈవిధంగా తడిసిపోతున్నా, ఆమెకి ఒంటిమీద

స్మృతే లేదు! ఆమె ఇప్పుడింక ఆ చలి బాధ సహించలేకపోయింది. చీర మార్చడంకోసం ఒణుకుతూ ఒణుకుతూ సూటుకేసు తాళం తియ్యబోయింది. ఇంతట్లో క్రమంగా బండి నడక తగ్గింది, ఉత్తర క్షణంలో ఒక స్టేషనుదగ్గిర ఆగింది. అప్పటికింకా వర్షం పడుతూనే ఉంది. అందుచేత అది ఏ స్టేషనో తెలుసుకోడానికి వీలిచ్చింది కాదు. అయినా గాని ఆమె ఆ తెరిచిన సూటుకేసు అల్లాగే విడిచిపెట్టి, చటుక్కుని తలుపు తెరుచుకుని ప్లాటుఫారంమీదికి దిగింది. ఆపైన లోపల ఆవేశం పట్టలేక; అల్లాగే ఆ వర్షంలో తడుస్తూ, ఒక్కొక్క పెట్టీ వెతుక్కుంటూ చివరికి సురేశుడున్న పెట్టిదగ్గిరికి జేరుకుంది. ఆపైన గట్టిగా "సురేశ బాబూ!" అని పిలిచింది.

ఆ పెట్టిలో ఒక ఆంగ్లేయుడూ ఇద్దరు భారతీయులూ కూర్చున్నారు. సురేశుడు ఒకమూల ముడుచుకుని కూర్చుని కళ్ళుమూసుకున్నాడు. అచలకి మొట్టమొదట "అసలు తనమాట తిన్నగా వినబడుతుందా? వినబడదా?" అని భయం వేసింది. చివరికి ఆ మాట నిజమే అయింది. ఆమె పిలుపు గట్టిగా దెబ్బతిన్న గొడ్డు అరుపులాగ విన్పించింది. ఆ పిలుపు విని అక్కడ ఉన్న వాళ్ళందరూ ఉలిక్కిపడ్డారు. సురేశుడు మతిపోయిన వాడిలాగ కళ్లు తెరిచి చూశాడు. అచల ఆ పెట్టె తలుపు దగ్గిరగా నిలబడి ఉంది. ఆమె నుదుటిమీది వర్షబిందువులు విద్యుద్దీపకాంతిలో తళతళ మెరిశాయి. చూసినవాళ్ళందరికీ ఆమె స్వరూపం ఒక ఇంద్రజాలంలాగ కనబడింది. ఆ పెట్టిలో వాళ్ళందరూ, ఆమెకేసి అల్లాగే చూస్తూ కూర్చుండిపోయారు! ఆమెను చూసి సురేశుడు చటుక్కుని దగ్గిరగా వచ్చి నుంచున్నాడు. వెంటనే అచల ఆయనఎక్కడ చూసినా కనపడడం లేదు! మీరు ఆయన్ని ఏ పెట్టెలో కూర్చోపెట్టాడు?" అని అడిగింది. నడవండి! చూపిస్తాను! అని చెప్పి సురేశుడు ఆ వర్షంలో కిందికిదిగాడు. ఆపైన అచల చెయ్యి గట్టిగా పట్టుకుని ఆమె వచ్చినదారినే బలవంతంగా

తీసుకు వెళ్ళాడు.

భారతీయులిద్దరూ ఒకరి కేసిఒకరు చూసుకునినవ్వుకున్నారు! ఆ ఆంగ్లేయుడికి ఈగొడవ ఏమీ బోధపడలేదు. కాని ఆమె ప్రశ్నమాత్రం అతని కేదోవిధంగా బోధపడినట్లయింది. అతను కిందపడిఉన్న కంబళ్ళీతీసుకుని ఒళ్ళంతా కప్పుగుని ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు ఆపైన నిశ్శబ్దంగా ఆఅంధకారం కేసి చూస్తూకూర్చున్నాడు. సురేశుడు అచలకూర్చున్న పెట్టెవాకా వచ్చి చటుక్కున నిలబడి లోపలికి చూశాడు. ఆపైన భయపడుతూ "ఇదేమిటి? ఈనూటు కేసు ఇల్లా తెరచిఉందేమిటి?" అన్నాడు. ఆతరవాత అచల సమాధానంకోసం నిరీక్షించకుండా బలవంతంగా ఆమెచెయ్యిపట్టుకుని లోపలికితీసుకువెళ్ళి తలుపుగట్టిగాబిగించాడు. ఆపైన లోపల తెరచిఉన్న నూటుకేసు కేసి వేలుపెట్టి చూపిస్తూ "ఇది ఎవరు తెరిచారు?" అని అడిగాడు.

ఆమాటమీద అచల "నేనే తెరిచాను. దానికేం! ఆమాటఅల్లా ఉండనీయండి! అసలు ఆయన ఎక్కడఉన్నారో చూపించండి; లేకపోతే ఏవైపునఉన్నారో చెప్పండి! స్వయంగా నేనే వెళ్ళివెతుకుతాను" అని చెప్పి ఆపెట్టెలోనించి ఇవతలికి రాబోయింది. కాని సురేశుడుచటుక్కుని ఆమెచెయ్యిపట్టుకుని "ఇంతలో ఇంత తొందరేమివచ్చింది? బండికదిలింది. చూస్తున్నారా?" అన్నాడు అచల ఆఅంధకారం కేసి చూస్తూ తను అనుకున్నమాట నిజమే అనుకుంది. అప్పుడే బండికదిలి పోతూంది. ఇప్పుడే ఆమెరెండుకళ్ళల్లోనూ కేవలం నిరాశ మూర్తీభవించింది. ఆతరవాత ఆమె మళ్ళీవెక్కి తిరిగింది. సురేశుడు ముఖాన్ని కత్తివాటు వేసినా నెత్తురుచుక్క కనబడలేదు. ఆఉత్తరక్షణంలో ఆమె మొదలు నరికిన చెట్టులాగ సురేశుడి కాళ్ళమీదపడి అతనికాళ్ళు గట్టిగాపట్టుకుని ఏడుస్తూ "ఆయనఎక్కడ ఉన్నారోచెప్పండి! నిద్రపోతూంటే ఆయన్ని

మీరు లోనించి అవతలికి విసిరేశారా? రోగంతో ఉన్న మనిషిని హత్య చేసి మీరు ఈవిధంగా———" అని ఆమె ఇంక మాట్లాడలేకపోయింది.

ఆ హృదయవిదారకమైన ఆమె ఆక్రందనము సురేశుణ్ణి ఒక్కసారిగా రాతివిగ్రహంలాగ మార్చేసింది. ఆపైన అతిభయంకరంగా ఉన్న ఆ రాత్రిలో లీనమైపోయింది. ఆ పెట్టెలో కుర్చీమీద కూర్చున్న సురేశుడు కదలకుండా అల్లాగే చూస్తూ కూర్చున్నాడు. అతని కాళ్ళదగ్గిర ఏమి జరుగుతూందో అతనికి ఏమీ తెలియడంలేదు. చాలాసేపు ఆవిధంగా జరిగిన తరవాత అతను తన కాళ్ళు కదపడానికి ప్రయత్నిస్తూ మెల్లిగా "మీరు నేనిల్లాంటిపనిచేస్తానని అనుకుంటున్నారా?" అన్నాడు.

అచల అదేవిధంగా ఏడుస్తూ "మీరు ఎల్లాంటిపని అయినా చేస్తారు. మాయింటికి నిప్పంటించి ఆయన్ని చంపి వెయ్యాలని చూశారు. మీకాళ్లుపట్టుకుని బతిమాలుకుంటున్నాను మీరు ఆయన్ని ఏంచేశారో చెప్పండి!" అని అతని కాళ్ళమీద తలఉంచి అతని రెండు కాళ్ళూ గట్టిగాపట్టుకుంది. కాని సురేశుడికి ఒంటిమీద స్పృహఉన్నట్టు కనబడలేదు. అతనల్లాగే తెల్లబోయి చూస్తూ కూర్చున్నాడు.

ఆ పెట్టెఅవతల ఆ కాళరాత్రి భయంకరంగా గర్జిస్తూనే ఉంది. అప్పుడప్పుడు ఆ భయంకరాంధకారంలో మెరుపులు మెరుస్తూనేఉన్నాయి. ఆగాలివానలో ప్రకృతిఅంతా చిందరవందర అయిపోయింది. కానిదురదృష్టవంతులైన ఈ స్త్రీపురుషుల హృదయాల్లో నృత్యంచేసే ప్రళయంముందర ఆ బాహ్యప్రళయం ఒక అణువులాగ కనబడింది. అల్లాగపడిఉన్న అచల చటుక్కుని లేచి తలుపుదగ్గిరికి వెళ్ళి నిలబడింది. దాంతోటి సురేశుడికి కళ్ళకి ఎదురుగుండా జరుగుతూన్న ఇంద్రజాలం చటుక్కునిఆగిపోయినట్లయింది. అతనికి స్టేషనుదగ్గిరికిరావడంచేత బండినడక తగ్గిపోతూన్నట్లు కనిపించింది. అందుచేత, అచల తలుపుదగ్గిర నిలబడడానికి కారణం అతనికి క్షణంలో తెలిసిపోయింది. వెంటనే అతను ఎంతో ప్రయత్నంమీద లోపలిఉద్వేగం

లేచుచుకుని ఆమెకెదురుగుండా చెయ్యి అడ్డుపెట్టి "కూర్చోండి! మహిముడీబండిలో లేడు!" అన్నాడు. "ఈబండిలో లేడా! అయితే ఎక్కడున్నాడు?" అని, అచల చటుక్కున ఆపక్కనిఉన్న బెంచీలో కూలబడి పోయింది.

సురేశుడు, అచలముఖంలో కత్తివాటువేసినా నెత్తురుచుక్క లేదన్న సంగతి గ్రహించాడు. ఎంత ఏడుస్తూఉన్నా ఇంతవరకూ అచల హృదయంలో ఈబాధలన్నీ ఒక్కక్షణంలో తొలగిపోతాయేమో అనేఆశ ఉంది. ఆ ఆశ ఇంతవరకూ ఆమెను విడిచిపెట్టలేదు; కాని ఒక్కరాత్రి గడిచేటప్పటికి ఆమెకు తన సర్వస్వమూ నశించిపోయినట్లయింది. ఒక్కక్షణంలో ఆమె జీవితంఅంతా దురదృష్టాలతో నిండి పోయినట్లయింది! అందుచేత ఇప్పుడామె కళ్ళల్లోనించి ఆ ఆశ కాస్తా తొలిగిపోయింది. తనజీవితం ఇంతలో ఈవిధంగా మారిపోతుందని ఆమె ఎప్పుడూ అనుకోలేదు! ఇద్దరూ అల్లాగే రాతివిగ్రహాలలాగ కూర్చుండి పోయారు. బండి వెళ్ళి ఒకస్టేషనుదగ్గిర ఆగింది బండి ఆగినతరవాత క్రమంగా ఒక అరఘడియవరకూ గూడా అల్లాగే గడిచిపోయింది.

సురేశుడు ఒకసారి ఏదోచెప్పబోయాడు; కాని మళ్ళీ కొంతసేపూరుకుని లేచినుంచున్నాడు ఆపైన కిటికీలు మూసివేసి కొంతసేపు ఇటూ అటూపచారుచేశాడు. ఆతరవాత చటుక్కుని అచలకి ఎదురుగుండా నిలబడి "మహిముడు కులాసాగానే ఉన్నాడు. ఈపాటికి అతను అలహాబాదు చేరుకుని ఉంటాడు." అన్నాడు. ఆతరవాత మళ్ళీ కొంచెంసేపు ఆగి "అక్కడినించి జబలుపూరు వెళ్ళవచ్చును" లేకపోతే తిరిగి కలకత్తా వెళ్లిపోవచ్చును" అన్నాడు. అచల ఆతరవాత మెల్లిగా ముఖం ఎత్తి "మనం ఎక్కడికి వెళుతున్నాము?" అని అడిగింది. సురేశుడికి ఆత్రుతశంకితమైన ఆమెముఖంమీద మళ్ళీ నిరాశారేఖ కనబడింది. అతనిప్పుడు తనుచేసింది చాలాపెద్దపొరబాటన్న సంగతి తెలుసుకున్నాడు.

అందుచేత అతనప్పుడు ఆత్మహత్య చేసుకోడానికి కూడా సిద్ధంగా ఉన్నాడు; కాని అతను "ఈనాగులాడి నిజం విషయం మభ్యపరిచి నా చేత ఈవిధంగా ఇంత ఘోరమైన పని చేయించింది" అని అనుకున్నాడు. అందుచేత ఆమె కేసి చూస్తూంటే అతని హృదయం భగ్గున మండింది. ఆ కారణంచేత వెంటనే అతను అచల కేసి తీవ్రంగా చూసి, అతిపరుషంగా "బహుశః మనమిద్దరమూ కలిసి నరకానికి బయలుదేరి వెళుతున్నాము. ఈ భయంకరమైన అధఃపతనానికి దారిచూపించినవారు మీరు! ఈపరిస్థితుల్లో ఇంక వెనక్కి అడుగువెయ్యడం కుదరదు" అన్నాడు. ఆమాటవిని అచల ఆపాదమస్తకమూ వణికింది. కాని ఆమె ఏ సమాధానమూ చెప్పకుండా అల్లాగే తలవంచుకుని కూర్చుంది.

ఈదుర్మార్గుడు పరస్త్రీని మోసగించి ఈవిధంగా చెడుమార్గంలోకి దింపాడు. పైగా సిగ్గువిడిచిపెట్టి ఆమెమీద నిందారోపణ చేస్తున్నాడు! ఇంక అతనికి ఎవరు సమాధానం చెప్పగలరు? సురేశుడు మళ్ళీ అటూఇటూ పచార్లు చెయ్యడం ప్రారంభించాడు. ఈ పాషాణప్రతిమకి ఎదురుగుండా నిలబడి మాట్లాడడానికి అతనిదగ్గిర సామర్థ్యం లేక పోయిందేమో! అతను అల్లాగ ఒక్కనిమిషం ఊరుకుని "ఈవచ్చిన ఘోర విపత్తు అంతా మీ ఒక్కరికే వచ్చిందని మీరు అనుకుంటున్నారు! కాని నాకువచ్చే ఘోరవిపత్తు ఎల్లాంటిదో మీరేమైనా గమనించారా! నాకు మీఅందరికీ మల్లే బ్రహ్మజ్ఞానం లేదు! నేను కేవలం నాస్తికుణ్ణి! నేనిప్పుడు పాపపుణ్యాలకోసం ఆలోచించడం లేదు. కేవలం ఇప్పుడు రాబోయే ఘోరవిపత్తునుగురించే ఆలోచిస్తున్నాను! మీదగ్గిర సౌందర్యం ఉంది! అపైన కళ్ళనిండా కన్నీళ్ళున్నాయి! స్త్రీలదగ్గిర ఉండవలిసిన అస్త్రశస్త్రాలన్నీ మీ అమ్ములపొదిలో సిద్ధంగా ఉన్నాయి! ఆ అస్త్రశస్త్రాలవల్ల మీమార్గానికి ఏవిధమైన అడ్డంకులూ ఉండవు! మరి నాకెల్లాంటిగతి పట్టుతుందో మీరు కొంచెమైనా ఆలోచించారా? నేను

మగవాణ్ణి; కనక జైలుకి వెళ్ళకుండా తప్పించుకోవాలంటే పిస్తోలుతో ఆత్మహత్య చేసుకోవడం ఒక్కటే మార్గము!" అని చెప్పి చేతితో తన రొమ్ము చూపించాడు.

అచల ఏదో చెప్పాలని అనుకుని నోరు తెరిచింది; కాని చెప్పలేక ముఖం ఇంకోవైపుకి తిప్పి వేసింది. అప్పైన ఆమె కళ్ళల్లో అసహ్య భావం కనబడింది. అదిచూసి సురేశుడు మండిపడి. "నెమలిపింఛం కట్టుకున్నంతమాత్రాన్ని కాకి ఎప్పుడూ నెమలి కాలేదు! అచలా! ఈవిషయాలన్నీ నాకు బాగా తెలుసును; కాని ఇల్లాంటి వేషం వేసుకున్నంతమాత్రాన్న మీకు ఆఅందంఎప్పుడూరాదు! ఇదిమృణాలలాంటి స్త్రీకి అందంఇస్తుంది. మీకుమాత్రం అందం ఇవ్వదు. మీరు ఎంత ప్రయత్నించినా అసూర్యంపశ్యఅయిన హైందవపతిగా ఎప్పుడూ మారలేరు. ఇంతమాత్రంచేత మీజాతి ఎప్పుడూ చెడిపోదు! మీకు ఎక్కడికి వెళ్లాలని ఉంటే అక్కడికి వెళ్లిపోవచ్చును! నేను ఒకఉత్తరం రాసి ఇస్తాను; అదితీసుకువెళ్ళి మహిముడికి చూపించండి! మహిముడు మిమ్మల్ని మళ్ళీ స్వీకరిస్తాడు. ఆపైన మీకు కొంత డబ్బిస్తాను. అదితీసుకువెళ్ళి మీ నాయనగారికి ఇవ్వండి! దానితో ఆయన నోరు కట్టుపడిపోతుంది దీని కోసం మీరింతగా బాధపడడం ఎందుకు! ఇందులో నేనుచేసిన పెద్ద అపరాధం ఏముంది!" అన్నాడు.

సురేశుడు మళ్ళీ అటూఇటూ పచార్లుచెయ్యడం ప్రారంభించాడు! కాని తనుబాగా ఎర్రగాకాల్చిగుచ్చినబల్లెం ఎంతపనిచేసిందో చూడాలని కూడా అతనికి తోచలేదు! గాలానికితగిలిన చేప ఒళ్లెరగని కోపంచేత ఆగాలంఅంతా ముక్కముక్కలకింద కొరికివెయ్యాలని అనుకుంటుంది. ఆవిధంగానే అతనుకూడా అచలని ముక్కముక్కలకింద నరికివెయ్యాలని అనుకున్నాడు. అతను అల్లాగ పచార్లుచేస్తూ చటుక్కుని ఆగి "నేనుచేసినదానిలో ఏమంత పెద్దతప్పుంది! మీరు మీభర్త ఇంట్లో

నాయందని అతనిముఖంమీద నేను ఇంకోపురుషుణ్ణి ప్రేమిస్తున్నానని అన్నారు! ఆమాట అప్పుడే మరిచిపోయారా? నేనుమీయింటికి నిప్పుపెట్టి మీ భర్తని చంపివెయ్యాలని ప్రయత్నించానని అన్నారు! బాగానేఉంది. మరి అల్లాంటి మనిషితోకూడా మీరు కలకత్తా రావడానికిసిద్ధపడ్డారు! చివరికి అతనితో కలిసి కలకత్తావచ్చేశారు! ఆవిషయం మీకుజ్ఞాపకం ఉందా? అల్లాంటివ్యక్తి ఇంట్లో—అల్లాంటివ్యక్తి రక్షణలో ఉండి, బుడిబుడిదీర్ఘాలు తీస్తూ అతన్ని కూడా రమ్మనమని బతిమాలుకున్నారు! ఈవిషయంజ్ఞాపకం ఉందా? ఇప్పుడు ఆవ్యక్తి మీకేమంత పెద్దఅపరాధం చేశాడు? అదీకాక ఆపైన అప్పులూ సప్పులూ ఎన్ని తీసుకోలేదు! ఇల్లాంటికారణాలచేత నే నీవిషయంలో ఇంత సాహసంపనిచేశాను. అసలు మీరొక వేశ్యలాంటివారు! అంతే! అందుచేతనే మిమ్మల్ని నేనీవిధంగా లేవదీసుకొని వచ్చాను! దీనికి మీకు మనసులో కొంచెం కష్టపడతా రనుకున్నాను' అంతే! మీవిషయంలో నేనంతకంటె ఎక్కువఅనుకోలేదు! నేను మీతో ఒక్కమాట చెబుతున్నాను! బాగా జ్ఞాపకంఉంచుకోండి! మీరెప్పటికీ సతీ సావిత్రి కాగా! కాలేరు! ఆతేజస్సుగాని, ఆగర్వంగాని మీకు ఎంత మాత్రమూ శోభించవు! మీకు ఈవిధంగా నటించడానికి ఎంత మాత్రమూ అధికారంలేదు!" అన్నాడు.

ఇన్నిమాటలూ ఈవిధంగా అని సురేశుడు ఆపైని నిర్జీవప్రతిమలాగ నిలబడిపోయాడు. అదిచూసి అచల వెంటనే గద్గదకంఠంతో కేకలు పెడుతూ "సురేశ బాబూ! మీరు ఆపివెయ్యకండి! అనవలసినవన్నీ అనెయ్యండి! ప్రపంచకంలో ఎన్ని అవమానకరమైన మాటలున్నాయో! నీచపుమాటలున్నాయో అవన్నీ నామీద ప్రయోగించండి!" అనిచెప్పి నేలమీద ఉండచుట్టుకు పడిపోయింది. ఆపైన రోదనంవల్ల గద్గదమై పోతూన్నకంఠస్వరంతో "ఇదే నేను కోరుకుంటున్నాను! ఇంతే నాకిప్పుడు

కావలసిందికూడాను! మనఅందరికీ ఉన్న నిజమైనసంబంధం ఇదే! ఈప్రపంచకంవల్లా పరమేశ్వరుడివల్లా—చివరికి మీవల్లానాకు ఒక్కటే సంప్రాప్తించింది!" అంది.

సురేశుడు ఆమాటలువింటూ రాతిబొమ్మలాగ నిలబడిపోయాడు. ఆ సుదీర్ఘమైన అచంచకేశపాశం కిందపడి పొరలాడింది. అనలేవర్షంలో తడిసిపోయిన ఆ మెరుస్తులిప్పుడు బాగా నల్లబడిపోయాయి; కాని సురేశుడిప్పుడు ఆమెదగ్గరగా వెళ్ళలేకపోయాడు. కొత్తగా వేటాడే వాడు చచ్చిపోతూన్న పక్షి కేసి ఆశ్చర్యంగా చూస్తాడు. సురేశుడుకూడా చచ్చిపోతూన్న స్త్రీకేసి చూసినట్టు ఆమె కేసి నిశ్చలంగా చూశాడు. అంతే!

ఆతరవాత మళ్ళీ బండివడక మొదలెంచింది. బండి క్రమక్రమంగా వచ్చి ఒకస్టేషనుఎదట నిలబడింది. సురేశుడు అదిచూసి ప్రశాంతంగా "ఎవరైనా మిమ్మల్ని ఈపరిస్థితుల్లో చూస్తే ఏమన్నా అనుకుంటారు. మీరు లేచివెళ్ళి మీ సోటులో కూర్చోండి! నేను నాపెట్టిలోకి వెళ్ళిపోతాను. తెల్లవారగానే మీకు ఎక్కడ దిగాలనిఉంటే అక్కడ దిగిపోవచ్చును. మీకు ఎక్కడికి వెళ్ళాలనిఉంటే అక్కడికి పంపించి వేస్తాను. ఈలోగా మీరేమీ హంగామా చెయ్యవద్దు! అల్లాచేస్తే దానివల్ల ఉపయోగంకూడా లేదు! అని తలుపుతీసుకుని కిందికిదిగాడు. తలుపు మెల్లిగా దగ్గరగా వేశాడు. ఆపైన ఏమని ఆలోచించుకున్నాడో గాని కొంతసేపటిదాకా నిశ్శబ్దంగా నిలబడ్డాడు. అల్లాగ కొంతసేపు నిలబడి మళ్ళీ లోపలికి తొంగిచూసి "మీరు నామాటనమ్మరు కాని నేను చెప్పేది ఒక్కమాట వినండి! ఈ చిక్కుసమస్య విడదీసేభారం నేనువహిస్తాను. ఇప్పుడు మీకు వచ్చిన పెద్దఆపత్తు ఏమీలేదు. నేను మీబుణం ఒక్కచిల్లిగవ్వైనా అట్టేపెట్టకుండా తీర్చి వేస్తాను" అని మెల్లిమెల్లిగా తనపెట్టివైపు వెళ్ళిపోయాడు.

బండి ఆగబోయేసమయానికి సురేశుడిమనస్సులో కొంచెం కంగారుగా ఉన్నట్టుండేది; కాని క్రమక్రమంగా ఆకంగారు తగ్గిపోయింది. అయినా అతనికిప్పుడు కళ్లు తెరిచి చూడడానికికూడా శక్తిలేక పోయింది. బట్టలు పూర్తిగా తడిసిపోవడంచేత అతనికి బాగాచలివేస్తూంది. అతనికి బహుశః జ్వరం తగిలి ఉంటుం దనిపించింది. ఇప్పుడు జ్వరంవస్తే చాలాఇబ్బందుల్లో పడవలసివస్తుందన్న సంగతి కూడా అతనికి తెలుసును. అతనికిప్పుడు బట్టలు మార్చడానికికూడా శక్తిలేనట్టు కనిపించింది. సరీగ్గా ఇల్లాంటి సమయంలో కూలీ! అన్నపిలుపు వినిపించింది. ఆపిలుపు అతనికి బాగాపరిచితమైనదే! అతనునగంనగం మూసుకుపోయినకళ్లు తెరిచిచూశాడు. బండి మళ్లీ స్టేషనుదగ్గిర ఆగింది. వర్షం కొంచెంతగ్గింది. ఆకాశంలో మేఘాలమధ్య నుంచి కొంచెంకొంచెం వెలుతురు ఇవతలికి వస్తూన్నట్టు కనిపించింది. కొంతమందిజనం బండిలోకి ఎక్కుతున్నారు. కొంతమంది దిగుతున్నారు. సురేశుడికి ఆజనంమధ్య అతిదుఃఖితురాలైన ఒకరమణీమూర్తి కనబడింది. ఆమె ఎవరికోసమో నిరీక్షిస్తూన్నట్టుకూడా కనబడింది. ఆమె అచలేకాని ఇంకెవ్వరూ కారు! ఆమె బండిలోంచిదిగి, ఒకకూలీని పిలిచి వాడినెత్తిమీద సూటుకేసుపెట్టి మెల్లిగా గేటువైపు నడిచింది. ఈలోగా ఆకూలీనిఏమేమోకొన్ని విషయాలడిగి తెలుసుకుంది.

సురేశుడు నిశ్చేష్టుడై అల్లాగే చూస్తూనుంచున్నాడు. బహుశః అతనిదృష్టికి కొంచెంకూరంగా చూసేశక్తి తగ్గిపోయిఉండవచ్చును; కాని ఇంతలో గణగణమని గంటమోగింది. అది ప్లాటుఫారంమీద ఆమూలనించి ఈమూలదాకా ప్రతిధ్వనించింది. ఆధ్వని అతనిశరీరానికి ఒకవిద్యుదాఘాతంలాగ తగిలింది. అతనిశరీరంలోనూ మనస్సులోనూ ఇంతసేపటినించీ కమ్ముకున్న మాంద్యంఅంతా ఒక్కనిమిషంలో ఎగిరి పోయింది. ఒక్కక్షణంలో అతను తనసూటుకేసు తీసుకుని తలుపు

తెరుచుకుని క్రిందికిదిగి రాము. అచలకి టిక్కెట్టుసంగతే జ్ఞాపకం లేక పోయింది. గేటుదగ్గిర టిక్కెట్టుకలెక్టరు చూడగానే ఆమె చటుక్కుని నిలబడిపోయింది. ఇంతలో సురేశుడు తొందరగా నడిచివస్తూ స్నేహార్ద్రమైన కంఠస్వరంతో 'మీరు నిలబడక్కరలేదు! ముందుకు నడవండి! నేను టిక్కెట్టు ఇచ్చేస్తాను!'' అన్నాడు.

అచల, సురేశుడుకూడా వస్తున్నాడన్న సంగతి గుర్తించలేదు! క్షణ కాలం ఆమెకి చాలా భయం వేసింది. అందువల్ల ఆమె ఒక్కఅడుగైనా ముందుకి నడవలేక పోయింది; కాని ఆ భయం ఒక్కళ్ళకి కనబడనీయకుండా ఆమె మెల్లిమెల్లిగా గేటుదాటింది. గేటుదాటినతర్వాత వారి కిద్దరికీమధ్య ఈక్రిందిసంభాషణ నడిచింది. సురేశుడు "మీరుతిరిగి కలకత్తా వెళ్ళిపోతారనుకున్నాను. హఠాత్తుగా డెహరీలో ఎందుకు దిగారు? మీకిక్కడ ఎవరైనా పరిచయమున్నవాళ్లున్నారా?'' అన్నాడు. అచల ఇంతవరకూ ఇంకొకపక్కకి చూస్తూనుంచుంది. ఆమె ఇప్పుడుకూడా ఆపక్కకే చూస్తూ "కలకత్తాలో ఎవరిదగ్గిరికి వెళ్ళను?'' అంది.

"మరిక్కడ?''

అచల ఆమాటకేమీ సమాధానం చెప్పలేదు. సురేశుడుకూడా కొంతసేపటిదాకా మాట్లాడకూరుకుని "మీకిప్పుడు నేనన్నమాటల్లో దేనిమీదా నమ్మకంఉండదు. ఇప్పుడు దీనికోసం నేనేమీ అనను! కాని ఈచివరిసమయములో మిమ్మల్ని నేనొక భిక్షపెట్టమని మాత్రం అడుగుతున్నాను'' అన్నాడు. అచల పూర్వంమోస్తరుగానే నిలబడి ఉంది. సురేశుడు మళ్ళీ "నాకు నాసంగతి ఒకళ్ళకి నచ్చచెప్పవలిసిన అవసరంలేదు. నాకిప్పుడు ఆకోరికకూడా లేదు! నాగొడవ ఏదో నేను చూసుకుంటానులెండి! నేనింక ఇళ్ళు తగలబెట్టవలిసిన అవసరం లేక దేశం వెళ్ళిపోతాను! కాని నాకొక్క భిక్షమాత్రం పెట్టండి! మిమ్మల్ని

రెండుచేతులూ జోడించి ప్రార్థిస్తున్నాను!" అన్నాడు. ఇప్పుడుకూడా అచల ఏమీ మాట్లాడలేదు! సురేశుడు మళ్ళీ "నేను మిమ్మల్ని ఎన్నెన్నో అనరానిమాటలు అన్నాను! మీమనస్సు ఎంతో కష్ట పెట్టాను! కాని ఈతరవాత ఎవరైనా ఈతప్పంతా మీమీదకి తోసి వేస్తారేమోనని నేను భయపడుతున్నాను. నాప్రాణాలు పోయినా సరే, నేనది భరించలేను. నాకోసమని మీరింక ఏవిధమైన ఇబ్బందీ పడకూడ దని నాకోరిక! వెళ్ళిపోయేముందు నాకీమాత్రం భిక్ష పెట్టండి! చాలును!" అన్నాడు.

అతని కంఠస్వరంలో ఉన్న యాతన ఎటువంటిదో ఆపరమేశ్వరుడికే తెలియాలి! అకస్మాత్తుగా అచల కళ్ళల్లో వేడివేడికన్నీళ్లు నిలిచాయి. అచల ఎంతో ప్రయత్నంమీద ఆకన్నీళ్లు ఆపుగుని మృదుస్వరంతో "అయితే నన్నిప్పుడు ఏంచెయ్యమంటారో చెప్పండి!" అంది. సురేశుడు జేబులోనించి రైల్వేటైముటేబిలు తీసి, రైలు వచ్చేసమయం ఎప్పుడో చూశాడు. ఆపైన అచలతో "మీరు ప్రస్తుతం ఏమీ చెయ్యక్కరలేదు! అయితే సాయంత్రం పదేనాకా ఏబండీరాదు. అంతవరకూమాత్రం నన్ను కాస్త నమ్మండి! నేను కోరేదిఇంతే! మీకు నామూలాన్ని ఇంక ఏవిధమైన బాధ కలగదు. నేనీమాట మీమీద ఒట్టుపెట్టుకుని మరీచెబుతున్నాను! నమ్మండి!" అన్నాడు. ఆమాటకి అచల సమాధానం ఇవ్వలేదు. కాని ఆమె దానికి అంగీకరించినట్లే కనబడింది.

జనంఅంతా తమకేసి విచిత్రంగా చూస్తారేమో అనేభయంచేత. ఇద్దరికీకూడా వెయిటింగురూములో కూర్చోవాలని బుద్ధిపుట్టలేదు. కొంతవాకబు చేసినమీదట పెద్దబజారులో ఒకమహమ్మదీయ చక్రవర్తి పేర కట్టిన సత్రము ఉందని తెలిసింది. ఇద్దరికీకూడా అక్కడికి వెళ్ళాలని బుద్ధిపుట్టింది. తమ హృదయవిదారకమైన దుఃఖం మరిచిపోయి,

ఇద్దరూ ఒక రెండెడ్లబండి కుదుర్చుకుని దానిమీద కూర్చున్నారు. దోవలో వాళ్ళిద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు! ఇద్దరూ చెరిఒక పక్కకీ చూస్తూ కూర్చున్నారు. బండి క్రమంగా వెళ్ళి సత్రవుముందర ఆగింది. బండిదిగుతూ అచల ఒకసారి సురేశుకేసి చూసింది. ఆ ఉత్తరక్షణంలో ఆమె ఎంతో భయపడింది! అతని కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లాగ ఉన్నాయి. ముఖం అంతా నల్లబడిపోయింది. అచల అనేకకష్టాల్లో అతన్ని చూసింది; కాని ఆమెకెప్పుడూ అతనీవిధంగా కనబడలేదు! సురేశు బండివాడికి కిరాయిఇచ్చి తనమనీపర్సు అక్కడపెట్టి "ఇదిప్రస్తుతం మీదగ్గిరఉంచండి! ఏదైనా అవసరంవస్తే ఖర్చుపెట్టడానికి సందేహించకండి!" అన్నాడు.

అచలమనస్సులో "ఇల్లాగ అంటున్నారేమిటి! అసలు మీ అభిప్రాయం ఏమిటి?" అనిఅడగాలని అనుకుంది; కాని చివరికి ఆమాట అడగలేకపోయింది. సురేశు "ఈఎదురుగుండా ఉన్న గదిఒకటే ఉన్నవాటిల్లో కాస్తబాగుంది. లోపలికివెళ్ళి కొంచెంసేపు విశ్రమించండి! నేనీ పక్కగదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకుంటాను. ఈబట్టలమూలాన్నే నేనిల్లాగ పిచ్చిబికారిలా ఉన్నాను" అన్నాడు. ఆపైన ఇంక అచల సంగతి చూడడంమానేసి తనసూటుకేసు చేత్తోపుచ్చుకుని, తాగినవాడిలాగ తూలుతూతూలుతూ ఒకమూలగాఉన్న గదిలోకి వెళ్ళాడు. అతనువెళ్ళిపోయినతరవాత అచలఒక్కర్తీ ఆవీథులో నిలబడలేకపోయింది. అందుచేత తనపెద్దసూటుకేసు అతికష్టంమీద చేత్తోపట్టుకుని తనకి ఎదురుగుండాఉన్న గదిలోకి వెళ్ళింది. ఆతరవాత ఆసూటుకేసుమీద కూర్చుని ఆదారే పోయేవాళ్ళకేసి చూడడం ప్రారంభించింది.

## ౨౬

అచల ఆగదిలో ఏవేవో సుఖస్వప్నాలు కంటూ కూర్చుంది. అల్లాగ ఎంతసేపుగడిచిందో ఆమెకే తెలియదు. అప్పుడే సూర్యో

దయమయింది. శీతాకాలంలో రేగిన రోడ్డుదుమ్ము చేత ఎర్రబడి పోయిన చెట్లన్నీ వర్షంలో తడిసి స్వచ్ఛంగా కనిపించాయి. వాటి మీద ఇప్పుడు సూర్యకిరణాలు పడి తళతళ మెరుస్తున్నాయి. వర్షధారలలో తడిసి స్వచ్ఛమయిన రాజమార్గంమీద అప్పుడే జనప్రచారం ప్రారంభించింది. ఈవేళ రాజమార్గంలో నడుస్తూన్న ప్రజలముఖాలన్నీ కలకల్లాడుతున్నాయి. అప్పుడప్పుడు ఒకొక్క గుర్రపుబండి ఆజనప్రవాహం మధ్యనించి గణగణమని చప్పుడు చేస్తూ వెళ్ళిపోతూంది. మధ్యమధ్య కొంతమంది గొల్లపిల్లలు దూడలమందలు తోలుకుంటూ పెద్దపెద్ద కేకలు వేసుకుంటూ వెడుతున్నారు. అప్పుడప్పుడు ఆపక్కనేఉన్న గుడిసెలలోనించి స్త్రీలుపాటలు వినిపిస్తున్నాయి. అచలకి తనదుఃఖప్రవాహంకూడా ఆజీవితప్రవాహంలో కలిసి ప్రవహిస్తూన్నట్లే కనబడింది. కొంత సేపటివరకూ ఆమెకి తనసంగతే జ్ఞాపకంలేకపోయింది. కాని ఇంతలో ఇద్దరుపల్లెటూరిపిల్లలు ఆమెకేసి తదేకధ్యానంతో చూడడం ప్రారంభించారు. దానితో ఆమెకు తనవిషయంఅంతా ఒక్కసారిగా జ్ఞాపకంవచ్చింది. ఆకుర్రవాళ్ళిద్దరూ ఆమెకేసి ఎంతో ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఆనక్షత్రం పూర్వం ఎంతో ఉన్నత స్థితిలో ఉండేది; కాని ఆవిషయం ఆపిల్లలకెవరికీ తెలియదు. ఐనా వాళ్ళు ఆశ్చర్యపడడం చూస్తే అచలలాంటి స్త్రీనెవరూ కూడా ఇంతకుపూర్వం అక్కడికి రాలేదన్నమాట స్పష్టమయింది. వాళ్లు పొద్దున్నే లేచి తమఅలవాటుప్రకారం ఆడుకోడానికి అక్కడికి వచ్చారు. కానిప్రస్తుతం ఈవిచిత్రవ్యక్తిని చూస్తూనుంచున్నారు.

అచల ఉలిక్కిపడి చటుక్కునలేచి నుంచుంది. ఆపైన ఆపిల్లల్ని ఏదోవిషయం అడగాలని అనుకునిఉంటుంది. కాని ఆపిల్లలిద్దరూ చూస్తూండగా గబగబా ఇంకొకచోటికి పారిపోయారు. సరిగ్గా

ఇప్పుడా మెకు సురేశుడిసంగతి జ్ఞాపకంవచ్చింది. అతను బట్టలూ సూర్చుకుంటానని చెప్పి ఇంగొక గదిలోకి వెళ్ళాడు. అతను వెళ్ళి అప్పుడే రెండుగంటలు కావస్తోంది. కాని ఇంతవరకూ అతనుతిరిగిరానేలేదు. అచల అతనినంగతి కనుక్కుందామని మెల్లి మెల్లిగా అతనిగదిదగ్గిరికి వెళ్ళింది. గదితలుపువేసిఉండడంచేత కొంత సేపు అక్కడేనిలబడింది. ఆతరవాత మెల్లిగా తలుపుతోసుకుని లోపలికివెళ్ళింది. లోపలికివెళ్ళినిలబడేనరికి భయంచేత ఆమెశరీరమూ మనస్సూ గడ్డకట్టుకుపోయాయి. ఆగదిఅంతా చీకటిగావుంది. పగిలిపోయిన కిటికీలోంచి మాత్రం కొంతవెలుతురు లోపలికి ప్రవేశిస్తూంది. సురేశుడు అక్కడ ఆబట్టనేలమీద పడుకునిగాఢంగా నిద్రపోతున్నాడు. అతను కట్టుకున్నబట్టలు పాతవే! సూటుకేసు తెరచివుంది. అందులోనించి తీసినవస్తువులుకొన్ని ఆపక్కని చిందర వందరగా పడిఉన్నాయి.

అచలకి ఒక్క క్షణంలో అతను చిట్టచివర అన్నమాటలన్నీ జ్ఞాపకంవచ్చాయి. అంతేకాక అతను డాక్టరు. మనిషినిబ్రతికించడమూ చంపడమూకూడా అతనికి తెలుసును. అతనుతలుచుకుంటే ఏవనిచెయ్యలేడు? అచలికి ఈసంగతికూడా చటుక్కున జ్ఞాపకం వచ్చింది. అతను తనుచేసిన పొరబాటుపనికి ఎంతో బాధపడ్డాడు. చిట్టచివరికి ఆమెదగ్గిర సెలవుతీసుకున్నాడు. తనుచేసినదానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలనికూడా నిశ్చయించుకున్నాడు. ఆచలకి ఇవ్వన్నీ ఒకటొకటే గబాగబా జ్ఞాపకంవచ్చాయి. ఆపైన ఆమెకి నేలమీద స్పృహలేకుండా, పడిఉన్న అతనిశరీరం కనబడింది. వీటిఅన్నిటినిబట్టి ఆమెకి అతనివిషయంలో ఏర్పడిన అనుమానం స్థిరపడిపోయింది. ఆతరవాత ఆమె తలుపువట్టుకుని మెల్లి మెల్లిగా అక్కడకూర్చుంది. ఇల్లాంటి పరిస్థితుల్లోకూడా ఆమెకి లోపలికి

వెళ్ళడానికి సాహసించలేకలేదు.

ఆవిధంగా స్వప్రవాతప్పు పడిపోన్న అతను కేసి చూస్తూంటే ఎంతో బాధకలిగింది. ఆమెచెంపలమీదనించి కన్నీళ్లు జొటజొటా ప్రవహించాయి. పాపం అతను ఆమెకోసమే ఎంతో అపకీర్తి భరించాడు. చివరికి ఈవిధంగా నిరాశపొంది ప్రపంచకంలోనించి పూర్తిగా సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు. అతను చేసినఅపరాధం ఎంతపెద్దదయినా అతన్ని క్షమించని కఠినహృదయు లీప్రపంచకంలో ఎవరూ వుండరు. అతన్ని చూస్తూంటే అచలకితనుచేసిన తప్పేమిటో స్పష్టంగా బోధపడిపోయింది. ఆమెకిప్పుడు సురేశుడితో పరిచయం కలిగినదగ్గరనించీ ఇంతవరకూ జరిగినసంగతులన్నీ ఒకటొకటే జ్ఞాపకంవచ్చాయి. సురేశుడు ఈవేళ తనుచేసిన పాపాలూ తనతండ్రిచేసిన పాపాలూ ఇంకాఎంతోమందిచేసిన పాపాలూభరించి న్యాయాన్యాయాలు విచారించే పరమేశ్వరుడిసన్నిధికి వెళ్ళిపోయాడు! ఈమాట తలుచుకుంటూంటే అచలశరీరం ఆపాద మస్తకమూ ఒణికింది! ఈవేళ సురేశుడు తలఒగ్గి పరమేశ్వరుడు విధించిన శిక్షఅంతా అంగీకరిస్తాడు! లేకపోతే తనుచేసిన తప్పులన్నీ అంగీకరించి పరమేశ్వరుణ్ణి క్షమించమని అయినా ప్రార్థిస్తాడు!

సురేశుడిదగ్గిర ప్రపంచకంలో సుఖపడడానికి కావలసినభోగాలన్నీ ఉన్నాయి. అయినాగాని అతనివ్వన్నీ విడిచిపెట్టి నిరాడంబరంగా పరలోకానికి వెళ్ళిపోయాడు! ఈవిషయం తలుచుకునేసరికి అచల హృదయానికి బల్లెపుపోటు తగిలినట్లయింది! మాటిమాటికీ ఆవిషయం ఆమెమనస్సుకి బాధకలిగించింది. ఆమె నిజంగా అతన్ని హృదయ పూర్వకంగాప్రేమించింది. ఆమె ఈవేళ మృత్యువుకి ఎదురుగుండా నిలబడి "ఈమాట నిజమేనా" అని తనహృదయాన్ని ప్రశ్నించవలసిన అవసరం లేదు! మళ్ళీ ఆమె రెండుచెంపలమీదనించీ కన్నీటిధారలుప్రవహించాయి. గడిచిపోయినరాత్రి రైలులో వారిద్దరిమధ్యనా ఎన్నో వాదోపవాదాలు

జరిగాయి. దారిద్ర్యహావితో కటువుగా మాట్లాడుతున్నారు. న్యాయాన్యా యాలని గురించి ఎంతో పెద్దచర్చ జరిగింది; కాని అవ్వన్నీ ఎంత అర్థం లేనిమాటలు అచలకి అప్పుడు తెలిసొచ్చింది. ప్రేమకి జాతిలేదు. ధర్మాధర్మవిచారణ లేదు. మంచిచెడ్డలఆలోచన లేదు! ఈ విధంగా పరిణమించగలిగినవ్యక్తి సంఘనియమాలకి అతీతుడు! ఈవిధి నిషేధాలేవీ అతన్ని స్పృశించవు. ఈ వేళమృత్యువుకి ఎదురుగుండా నిలబడి ఆమె ఈవిషయాలన్నీ అంగీకరించకుండా ఉండడం ఎల్లాగ?

అచల చీరచెరగుతో కన్నీళ్ళు తుడుచుకుంది; కాని అంతట్లో ఆమె హఠాత్తుగా ఉలిక్కిపడింది. ఆమెకు ఆ మృతశరీరం కొంచెం కదిలినట్లు కనబడింది. ఆ ఉత్తరక్షణంలో సురేశుడు ఒక అస్పష్టమైన ఆర్తనాదంతో ఇంకోపక్కకి తిరిగి పడుకున్నాడు. అబ్బ! అతను చచ్చిపోలేదు! ఇంకా బతికేఉన్నాడు! అచల ఒక్కసారిగా పరిగెత్తుకువెళ్ళి అతని పాదాలమీదపడి "సురేశబాబూ!" అని పిలిచింది. ఆపిలుపువిని సురేశుడు ఓంతనిద్రల్లాఉన్న కళ్ళు తెరిచి చూశాడు. అంతేగాని ఏమీ మాట్లాడలేదు! అచలకూడా మళ్ళీ ఏమీ మాట్లాడలేకపోయింది; కాని ఆమెచెంపలమీదనించి కన్నీళ్లు ఏకధారగా ప్రవహించాయి. కాని ఇంతకిపూర్వం ప్రవహించిన కన్నీళ్లకీ ఈకన్నీళ్ళకీ ఎంతో తేడాఉంది!

అసలు అన్నిటినీమించి ఆమె నెక్కువగా బాధపెట్టినవిషయం ఇంకొకటిఉంది. ఎవళ్ళతోటీ పరిచయంలేని ఈకొత్తఊళ్ళో సురేశుడి శవదహనంచెయ్యడం ఎల్లాగ? ఆమె ఎవరినిపిలుస్తుంది? తనవిషయం అంతా ఎవరితో చెప్పుకుంటుంది? దీనిమూలాన్ని అనేకమందికి అనేక మైన అనుమానాలు కలగవచ్చును. ఆప్రశ్నలకన్నిటికీ ఆమె ఏమని సమాధానాలు చెబుతుంది? పోలీసువాళ్ళు వచ్చారంటే, అసలు ఉన్న సంగతిఅంతా కూపీతీస్తే తియ్యవచ్చును! అదిఅంతా వేవర్లలోపడి

నీకు పరాయిదాన్ని కాదుగదా! అందుచేత మాయింటికిరావడానికి నువ్వు కొంచెమైనా అనుమానించవని అనుకుంటున్నాను. రోజూ నీ కోసం ఎదురుచూస్తూ ఉంటాను. నీపాదపద్మాలకి కోటినమస్కారాలు! ఇంకొకవిషయము. నేనీఉత్తరం రాస్తూన్నసంగతి అన్నయ్యకి తెలియదు! నేనతనికి తెలియకుండా రహస్యంగా రాశాను! తెలిసిందా!"

"నీమృణాల"

ఉత్తరం పూర్తిచేసినతరవాత మృణాల "తాజాకలం" అని రాసి మళ్ళీ "నువ్వు ఒంటరిగా సురేశబాబుగారి ఇంటిదగ్గిర ఉండవని నిశ్చయించి మీనాన్నగారి చిరునామాకి ఈఉత్తరం పంపిస్తున్నాను. ఈఉత్తరం నీకు అందడంలో అట్టే ఎక్కువఆలస్యం కాదని నమ్ముతు న్నాను" అనిరాసింది.

ఆఉత్తరం కేదారబాబుచేతులోంచి జారి కిందపడిపోయింది. అతను మళ్ళీ పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ మళ్ళీ కళ్ళుమోడుతుండవ● ప్రారంభించాడు. అతనికి ఆఉత్తరం చదవడం వల్ల మహిముడు జబ్బలు పూరులో లేడనిన్నీ, స్వగ్రామంలోఉన్నాడనిన్నీ తెలిసింది ఆతరవాత అచల అపల్లెటూళ్ళో లేదన్నసంగతి కూడా తెలిసింది. అచలసంగతి ఏమయిందో మహిముడికి తెలియదన్నమాటే! ఒకవేళ తెలిసినా పైకి చెప్పడానికి అతనికి ఇష్టంలేక పోతే లేకపోవచ్చును.

కేదారబాబుకి మళ్ళీ సురేశుడిసంగతి జ్ఞాపకం వచ్చింది. అయితే అతనిసంగతి ఏమయింది? వాళ్ళిద్దరిదగ్గిరా కొన్నాళ్లు ఉంటానని చెప్పి అతనక్కడికి వెళ్ళాడు. అతను ఇంటికి తిరిగిరావటేలేదు! లేకపోతే తప్ప కుండా ఒకసారి కనబడిఉండును. ఈతరవాత కేదారబాబు హృదయంలో బల్లెం గుచ్చుకున్నట్లయింది. అతను ఆ ఆఘాతం తగిలినతరవాత ఆకుర్చీమీద సరిగ్గా కూర్చోలేకపోయాడు. చటుక్కుని ఆకుర్చీలో కూలబడి కళ్లుమూసుకున్నాడు. ఆతరవాత దాసీది సురేశుడిగారి

అయిపోయింది. ఆమె ఈవేళ తనలో ఉన్న సహనశక్తి ధైర్యమూ వినియోగించి "ఈ వేళ ఒంటిపచ్చేదాకా ఎల్లాగో అల్లాగ ఇక్కడ కాలక్షేపం చేస్తాను" అని అనుకుంది. కాని తలవని తలంపుగా ఇప్పుడు కొత్తగా వచ్చిన ఆపత్తు కొట్టి ఆమె హృదయంలో ఉన్న ఆశారేఖ కాస్తా తుడిచిపెట్టుకుపోయింది. ఈ పరిస్థితుల్లో ఆమెకు మృత్యువు ఒక్కటీ తప్ప ఇంక ఏదీ రుచించలేదు!

సురేశుణ్ణి ఇక్కడ ఒంటరిగా విడిచిపెట్టి వెడితే బాగుంటుందనే ఉపాయం ఆమె ఆలోచించనే లేకపోయింది. ఇప్పుడు సురేశు జబ్బు పూచీ అంతా వచ్చి ఆమె నెత్తిమీద విరుచుకుపడింది! ఇప్పుడు అతన్ని తీసుకుని ఈ కొత్త చోట్లో ఏమి చెయ్యాలి? ఎవరిదగ్గిరికి వెళ్ళి సహాయం చెయ్యమని అడిగితే బాగుంటుంది? ఏవిధంగా అడిగితే ఇతరులు సహాయం చేస్తారు? ఒకళ్ళ సానుభూతి సంపాదించడం ఎల్లాగ? రాత్రింబగళ్లు ఏవిధంగా నటించవలసివస్తుందో! ఈవిధమైన ఆలోచనలన్నీ ఆమె మనస్సులో ఒక్కసారిగా మెరుపుల్లాగ మెరిశాయి! కాని ఈ పరిస్థితుల్లో ఏంచేస్తే బాగుంటుందో ఆమెకేమీ పాలుపోలేదు. "ఎక్కడికైనా పోయిదాక్కుంటే—! లేకపోతే నెత్తీనోరూ బాదుకుని ఏడిస్తే—! లేకపోతే ఒక్కసారి తల బద్దలుకొట్టుకుని ఈ దురదృష్టమయమైన జీవిత నాటకం ఇంతటితో సమాప్తిచేస్తే—!" అని ఆమె ఏమేమో పరిపరి విధాల ఆలోచించుకుంది.

30

కేదారబాబు ఆవేళ స్టేషనునుంచి తిరిగివచ్చేటప్పుడు వర్షంలో బాగా తడిసిపోయాడు. అందుచేత అతను ఏడెనిమిది రోజులదాకా దగ్గుతోటీ జ్వరముతోటీ బాధపడ్డాడు. కూతురుదగ్గిరనించి ఇంకా క్షేమసమాచారం తెలియలేదు. అందుచేత అతను ఎంతో కంగారుపడుతు

నలుగురికీ తెలిస్తే ఆమె ఎంతో బాధపడిఉండును. అసలు ముందు రాబోయే కష్టాల సంగతి ఆమెకికూడా పూర్తిగా తెలియలేదు! ఇప్పుడు ఆ ఆపత్తులన్నీ తొలిగిపోయాయి అని అనుకునేసరికి ఆమెకు ఆదుఃఖం అంతా ఎక్కడికక్కడ ఎగిరిపోయింది! సురేశుడు మరణించనందుకు అతనిమొడల ఆమెకెంతో కృతజ్ఞత కలిగింది.

కొంచెంసేపు ఈవిధంగా గడిచిపోయిన తరవాత సురేశుడు మెల్లిగా "మీరు ఏడుస్తున్నారెందుకు?" అని అడిగాడు. అచల గద్గదకంఠంతో "మీరు ఇల్లాగ పడిపోయారేం? మళ్ళీ తిరిగి రాలేదేం? నన్నింతభయ పెట్టడం ఎందుకు?" అని అడిగింది. ఆమెకంఠస్వరంలో ఎంతో స్నేహం కనబడింది. ఆస్నేహంలో ఎంతమాధుర్యం వెల్లివిరిసింది! ఆమాధుర్యం వల్ల సురేశుడు ఒక్కడే ఆనందించలేదు! అచలకూడా లోలోపల ఉప్పొంగిపోయింది! ఆమెమళ్ళీ "మీకు ఇంతఎక్కువగా నిద్రవస్తూంటే నాతో ఎందుకుచెప్పలేదు! నేను ఆపక్కనున్నగది తుడిచి శుభ్రంచే మీకు పక్కవేసేదాన్నే! బండిరావడానికి ఇంకాచాలాఆలస్యం ఉందిగా!" అంది.

దానికి సురేశుడు ఏమీ సమాధానం చెప్పలేదు! అల్లాగే ఆమె ముఖంకేసి చూస్తూ, తనచెయ్యెత్తి ఆమెకుడిచెయ్యి పట్టుకుని వేడిగా ఉన్న తననుదుటిమీద పెట్టుకున్నాడు. ఆతరవాత ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు. అచల అదిరిపడి "ఇదేమిటి? ఇంతవేడిగాఉంది? మీకు జ్వరంతగిలిందా?" అని అడిగింది. సురేశుడు "జ్వరంగానే ఉంది. ఈజ్వరం ఒకపట్టాని వదిలిపెట్టేటట్టు తోచదు. బహుశః——" అని ఇంకా ఏదో అనబోయాడు.

అచల మెల్లిమెల్లిగా తనచెయ్యి తీసివేసుకుంది. అతను అన్నదానికి సమాధానంగా ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టింది. ఆమె హృదయంలో నించి పొంగిపొంగివస్తూన్న స్నేహంఅంతా ఇప్పుడు గడ్డకట్టుకుని రాయి

అయిపోయింది. ఆమె ఈవేళ తనలో ఉన్న సహనశక్తీ ధైర్యమూ వినియోగించి "ఈవేళ ఒండినచ్చేదాకా ఎల్లాగో అల్లాగ ఇక్కడ కాలక్షేపం చేస్తాను" అని అనుకుంది. కాని శీలవనిశలంపుగా ఇప్పుడు కొత్తగా వచ్చిన ఆపత్తు ఒకటి ఆమెహృదయంలో ఉన్న ఆశారేఖ కాస్తా తుడిచిపెట్టుకుపోయింది. ఈపరిస్థితుల్లో ఆమెకు మృత్యువు ఒక్కటీ తప్ప ఇంక ఏదీ రుచించలేదు !

సురేశుణ్ణి ఇక్కడ ఒంటరిగా విడిచిపెట్టివెడితే బాగుంటుందనే ఉపాయం ఆమె ఆలోచించలేకపోయింది. ఇప్పుడు సురేశుకి జబ్బు పూచీ అంతా వచ్చి ఆమెనెత్తిమీద విరుచుకుపడింది ! ఇప్పుడు అతన్ని తీసుకుని ఈకొత్తచోట్లో ఏమిచెయ్యాలి ? ఎవరిదగ్గిరికి వెళ్ళి సహాయం చెయ్యమని అడిగితేబాగుంటుంది ? ఏవిధంగా అడిగితే ఇతరులుసహాయం చేస్తారు ? ఒకళ్ళసానుభూతి సంపాదించడంఎల్లాగ ? రాత్రింబగళ్లు ఏవిధంగా నటించవలసివస్తుందో ! ఈవిధమైన ఆలోచనలన్నీ ఆమె మనస్సులో ఒక్కసారిగా మెరుపుల్లాగ మెరిశాయి! కాని ఈపరిస్థితుల్లో ఏంచేస్తే బాగుంటుందో ఆమెకేమీ పాలుపోలేదు. "ఎక్కడికైనా పోయిదాక్కుంటే——! లేకపోతే నెత్తీనోరూ బాదుకుని ఏడిస్తే——! లేకపోతే ఒక్కసారి తల బద్దలుకొట్టుకుని ఈదురదృష్టమయమైన జీవిత నాటకం ఇంతటితో సమాప్తిచేస్తే——!" అని ఆమె ఏమేమో పరిపరి విధాల ఆలోచించుకుంది.

## 30

కేదారబాబు ఆవేళ స్టేషనునించి తిరిగివచ్చేటప్పుడు వర్షంలో బాగా తడిసిపోయాడు. అందుచేత అతను ఏడెనిమిది రోజులదాకా దగ్గుతోటీ జ్వరముతోటీ బాధపడ్డాడు. కూతురుదగ్గిరనించి ఇంకా క్షేమసమాచారం తెలియలేదు. అందుచేత అతను ఎంతో కంగారుపడుతు

నీకు పరాయిదాన్ని కాదుగదా! అందుచేత మాయింటికిరావడానికి నువ్వు కొంచెమైనా అనుమానించవని అనుకుంటున్నాను. రోజూ నీ కోసం ఎదురుచూస్తూ ఉంటాను. నీపాదపద్మాలకి కోటినమస్కారాలు! ఇంకొకవిషయము. నేనీఉత్తరం రాస్తూన్న సంగతి అన్నయ్యకి తెలియదు! నేనతనికి తెలియకుండా రహస్యంగా రాశాను! తెలిసిందా!"

"నీమృణాల"

ఉత్తరం పూర్తిచేసినతరవాత మృణాల "తాజాకలం" అని రాసి మళ్ళీ "నువ్వు ఒంటరిగా సురేశబాబుగారి ఇంటిదగ్గిర ఉండవని నిశ్చయించి మీనాన్నగారి చిరునామాకి ఈఉత్తరం పంపిస్తున్నాను. ఈఉత్తరం నీకు అందడంలో అట్టే ఎక్కువఆలస్యం కాదని నమ్ముతున్నాను" అనిరాసింది.

ఆఉత్తరం కేదారబాబుచేతులోంచి జారి కిందపడిపోయింది. అతను మళ్ళీ పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ మళ్ళీ కళ్ళుతోడుతుడవ[illegible] ప్రారంభించాడు. అతనికి ఆఉత్తరం చదవడం వల్ల మహిముడు జబ్బులు పూరులో లేడనిన్నీ, స్వగ్రామంలోఉన్నాడనిన్నీ తెలిసింది. ఆతరవాత అచల ఆవల్లెటూళ్ళో లేదన్నసంగతి కూడా తెలిసింది. అచలసంగతి ఏమయిందో మహిముడికి తెలియదన్నమాటే! ఒకవేళ తెలిసినా పైకి చెప్పడానికి అతనికి ఇష్టంలేక పోతే లేకపోవచ్చును.

కేదారబాబుకి మళ్ళీ సురేశుడిసంగతి జ్ఞాపకం వచ్చింది. అయితే అతనిసంగతి ఏమయింది? వాళ్ళిద్దరిదగ్గిరా కొన్నాళ్ళు ఉంటాననిచెప్పి అతనక్కడికి వెళ్ళాడు. అతను ఇంటికి తిరిగిరానేలేదు! లేకపోతే తప్పకుండా ఒకసారి కనబడిఉండును. ఈతరవాత కేదారబాబు హృదయంలో బల్లెం గుచ్చుకున్నట్లయింది. అతను ఆ ఆఘాతం తగిలినతరవాత ఆకుర్చీమీద సరిగ్గా కూర్చోలేకపోయాడు. చటుక్కుని ఆకుర్చీలో కూలబడి కళ్ళుమూసుకున్నాడు. ఆతరవాత దానీది సురేశుడిగారి

అయిపోయింది. ఆమె ఈవేళ తనలో ఉన్న సహనశక్తి ధైర్యమూ వినియోగించి "ఈవేళ బండివచ్చేదాకా ఎల్లాగోఅల్లాగ ఇక్కడ కాలక్షేపంచేస్తాను" అని అనుకుంది. కాని తలవనితలంపుగా ఇప్పుడు కొత్తగా వచ్చిన ఆపత్తుకొట్టి ఆమెహృదయంలోఉన్న ఆశారేఖ కాస్తా తుడిచిపెట్టకుపోయింది. ఈపరిస్థితుల్లో ఆమెకు మృత్యువు ఒక్కటీ తప్ప ఇంక ఏదీ రుచించలేదు!

సురేశుణ్ణి ఇక్కడ ఒంటరిగా విడిచిపెట్టివెడితే బాగుంటుందనే ఉపాయం ఆమె ఆలోచించ నేలేకపోయింది. ఇప్పుడు సురేశుడిజబ్బు పూచీ అంతావచ్చి ఆమెనెత్తిమీద విరుచుకుపడింది? ఇప్పుడు అతన్ని తీసుకుని ఈకొత్తచోట్లో ఏమిచెయ్యాలి? ఎవరిదగ్గిరికి వెళ్ళి సహాయం చెయ్యమని అడిగితేబాగుంటుంది? ఏవిధంగాఅడిగితే ఇతరులుసహాయం చేస్తారు? ఒకళ్ళసానుభూతి సంపాదించడంఎల్లాగ? రాత్రింబగళ్లు ఏవిధంగా నటించవలిసివస్తుందో! ఈవిధమైన ఆలోచనలన్నీ ఆమె మనస్సులో ఒక్కసారిగా మెరుపుల్లాగ మెరిశాయి! కాని ఈపరిస్థితుల్లో ఏంచేస్తే బాగుంటుందో ఆమెకేమీ పాలుపోలేదు. "ఎక్కడికైనా పోయిదాక్కుంటే—! లేకపోతే నెత్తీనోరూ బాదుకుని ఏడిస్తే—! లేకపోతే ఒక్కసారి తల బద్దలుకొట్టుకుని ఈదురదృష్టమయమైన జీవిత నాటకం ఇంతటితో సమాప్తిచేస్తే—!" అని ఆమె ఏమేమో పరిపరి విధాల ఆలోచించుకుంది.

## 30

కేదారబాబు ఆవేళ స్టేషనునించి తిరిగివచ్చేటప్పుడు వర్షంలో బాగా తడిసిపోయాడు. అందుచేత అతను ఏడెనిమిది రోజులదాకా దగ్గుతోటీ జ్వరముతోటీ బాధపడ్డాడు. కూతురుదగ్గిరనించి ఇంకా క్షేమసమాచారం తెలియలేదు. అందుచేత అతను ఎంతో కంగారుపడుతు

నీకు పరాయిదాన్ని కాదుగదా! అందుచేత మాయింటికిరావడానికి నువ్వు కొంచెమైనా అనుమానించవని అనుకుంటున్నాను. రోజూ నీ కోసం ఎదురుచూస్తూ ఉంటాను. నీపాదపద్మాలకి కోటినమస్కారాలు! ఇంకొకవిషయము. నేనీఉత్తరం రాస్తూన్న సంగతి అన్నయ్యకి తెలియదు! నేనతనికి తెలియకుండా రహస్యంగా రాశాను! తెలిసిందా!"

"నీమృణాల"

ఉత్తరం పూర్తిచేసినతరవాత మృణాల "తాజాకలం" అని రాసి మళ్ళీ "నువ్వు ఒంటరిగా సురేశబాబుగారి ఇంటిదగ్గిర ఉండవని నిశ్చయించి మీనాన్నగారి చిరునామాకి ఈఉత్తరం పంపిస్తున్నాను. ఈఉత్తరం నీకు అందడంలో ఆట్టే ఎక్కువఆలస్యం కాదని నమ్ముతున్నాను" అనిరాసింది.

ఆఉత్తరం కేదారబాబుచేతులోంచి జారి కిందపడిపోయింది. అతను మళ్ళీ పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ మళ్ళీ కళ్ళజోడుతుడవడ ప్రారంభించాడు. అతనికి ఆఉత్తరం చదవడం వల్ల మహిముడు జబ్బలు పూరులో లేడనిన్నీ, స్వగ్రామంలోఉన్నాడనిన్నీ తెలిసింది ఆతరవాత అచల ఆపల్లెటూళ్ళో లేదన్నసంగతి కూడా తెలిసింది. అచలసంగతి ఏమయిందో మహిముడికి తెలియదన్నమాటే! ఒకవేళ తెలిసినా పైకి చెప్పడానికి అతనికి ఇష్టంలేక పోతే లేకపోవచ్చును.

కేదారబాబుకి మళ్ళీ సురేశుడిసంగతి జ్ఞాపకం వచ్చింది. అయితే అతనిసంగతి ఏమయింది? వాళ్ళిద్దరిదగ్గిరా కొన్నాళ్ళు ఉంటానని చెప్పి అతనక్కడికి వెళ్ళాడు. అతను ఇంటికి తిరిగిరాలేదు! లేకపోతే తప్పకుండా ఒకసారి కనబడిఉండును. ఈతరవాత కేదారబాబు హృదయంలో బల్లెం గుచ్చుకున్నట్లయింది. అతను ఆ ఆఘాతం తగిలినతరవాత ఆకుర్చీమీద సరిగ్గా కూర్చోలేకపోయాడు. చటుక్కుని ఆకుర్చీలో కూలబడి కళ్ళుమూసుకున్నాడు. ఆతరవాత దాసీది సురేశుడిగారి

ఇంటికివెళ్ళి తిరిగివచ్చి "బాబుగారూ! సురేశబాబుగారి పినతల్లిగారికి కూడా అప్పటినించీ ఉత్తరంరాలేదుటండి! ఉత్తరంరాలేదని ఆవిడకూడా చాలా కంగారు పడుతున్నారండి!" అని చెప్పింది.

కేదారబాబు రాత్రిపడినతరవాత తనపడకగదిలో ఒంటరిగాకూర్చుని, ఆఉత్తరంఅంతా మళ్ళీ ఆమూలనించి ఈమూలకి చదివాడు. ప్రతీ అక్షరమూ మళ్ళీమళ్ళీ జాగ్రత్తగా చదివాడు. తనగౌరవం రక్షించు కోడానికి ఎక్కడయినా కొంచెం ఆధారం దొరుకుతుందేమోనని అతని ఆశ! లేకపోతే అతను నలుగురికీ తనముఖం ఎల్లాగ చూపించగలడు? కేదారబాబు వంశస్థులంతా కలకత్తాలోనే ఉండేవారు. అతనుకూడా కలకత్తాలోనే పుట్టిపెరిగాడు. అసలతనికి కలకత్తా విడిచిపెడితే ఆపైన ప్రపంచకం ఉన్నదన్న సంగతికూడా తెలియదు. ఒకవేళ ఈబంధువుల్నీ ఈస్నేహితుల్నీ ఈసమాజాన్నీ విడిచిపెట్టి ఎవ్వరికీ తెలియకుండా ఒకచోటఉంటే రోజులు గడపడం ఎల్లాగ? చివరికి అతనికి ఈప్రశ్న ఆలోచించడానికి కూడాభయంవేసింది. కూతుర్ని గురించి ఈనిర్భాగ్యురాలు రోగంతో తీసుకుంటూన్న తనకింత బాధతెచ్చిపెట్టిందని అతనికెంతో కోపంవచ్చింది. ఎంతసమాధానం చెప్పుకున్నా అతనాకోపం భరించలేక పోయాడు.

రాత్రి తెల్లవార్లూ అతనికి ఒక్కసారైనా కునుకుపట్టలేదు. తెల్లవారే సరికి అతనికి బాగాపైత్యంచేసింది. అయితే, అతనికి మనస్సులోఉన్న కష్టసుఖాలు చెప్పుకోడానికి ఎవరూ కనిపించలేదు! ఆమంచంమీద పడుకోవడంకూడా అతని కిష్టంలేకపోయింది. ఈవిధంగా యమయాతన అనుభవిస్తూన్నా అతను పైకి ప్రసన్నంగానే ఉన్నాడు. సామాన్యంగా రోజూ నలుగురితో తిరిగినట్లే ఈవేళా తిరిగాడు. ఆతరవాత ఒకమనిషిని పిలిచి "స్టేషనుకి బండితీసుకునిరా" అనిచెప్పి, వంటమనిషికి సామానులూ అవీ వద్దీ సిద్ధంగాఉంచమని ఆజ్ఞాపించాడు.

మాట! ఆయనేమో పీకులోకి షికారువెళ్లారు. మీారు ఇందాకటి నించీ ఇక్కడే నుంచున్నారు." అంది. ఆపైన మళ్ళీనవ్వుతూ "ముసలాయన మాట వినబడడానికి అప్పుడు మీామనస్సు మీాస్వాధీనంలో ఉంటేగా! మీారేమి ఆలోచిస్తున్నారో నాకు తెలుసును. చెప్పనా!— అంది. అచలమళ్ళీ నిశ్శబ్దంగా నదిఅవతలితీరం చూస్తూనుంచుంది. ఈసారి ఆమెవ్యంగ్యంగా అన్నమాటకి సమాధానం చెప్పడానికికూడా ప్రయత్నించలేదు. ఇక్కడముఖ్యంగా ఒకవిషయం చెప్పవలసిఉంది. రాక్షసి అనేపేరుకీ ఆవ్యక్తికీ ఏమీా సంబంధంలేదు. అసలు ఆవిడపేరు రాక్షసి కానేకాదు ఆవిడ అసలుపేరు వీణాపాణి. ఆవిడపుట్టీపుట్టడంతోనే తల్లిచచ్చిపోయింది. అందుచేత దాదికోపంపట్టలేక ఆపిల్లకి రాక్షసి అని పేరుపెట్టింది. అప్పటినించీ ఇరుగు పొరుగు వాళ్లుకూడా ఆమెను ఆపేరుతో పిలవడం అలవాటయిపోయింది.

అచల ఆమెఅన్న మాటలువిని తెల్లబోయి నుంచుంది. అందుచేత వీణాపాణి ఎంతోసిగ్గుపడి పశ్చాత్తాపపడుతూ ఇల్లాఅంది. "ఏమిటండీ! అక్కగారూ! మీారుఒక్కమాటైనా నవ్వుతూ మాట్లాడకూడదా? నాన్నగారంటే మీాకు ఎ.తభక్తి ఉన్నదో నాకు తెలియదా? మా నాయన అన్నిసంగతులూ చెప్పేశారు. ఆయన పొద్దున్నే షికారుకి వెళ్ళివస్తున్నారట! మీారు ఈకొత్తఊళ్ళో వెతుకుస్తూ డాక్టరుకోసం వెతుక్కుంటున్నారట! అప్పుడు మానాన్నగారు మిమ్మల్ని చూసి ఆసత్రవులోంచి మీాభర్తగారిని మాయింటికి తీసుకు వచ్చారట! అక్కగారూ! ఇదిఅంతా భగవంతుడిసంకల్పం సుమండీ! లేకపోతే ఆవేళ ఆబండిలో మీాపాదధూళి మాయింట్లో పడుతుందని అనుకున్నానా! దానికేంగాని మీారు నేనన్న మాటకి సమాధానం చెప్పడంలేదు. ఇక్కడ మీాకు సుఖంగా

ఇంటికివెళ్ళి తిరిగివచ్చి "బాబుగారూ! సురేశబాబుగారి పినతల్లిగారికి కూడా అప్పటినించీ ఉత్తరంరాలేదుటండి! ఉత్తరంరాలేదని ఆవిడకూడా చాలా కంగారు పడుతున్నారండి!" అని చెప్పింది.

కేదారబాబు రాత్రిపడినతరవాత తనపడకగదిలో ఒంటరిగాకూర్చుని, ఆఉత్తరంఅంతా మళ్ళీ ఆమూలనించి ఈమూలకి చదివాడు. ప్రతీ అక్షరమూ మళ్ళీమళ్ళీ జాగ్రత్తగా చదివాడు. తనగౌరవం రక్షించుకోడానికి ఎక్కడయినా కొంచెం ఆధారం దొరుకుతుందేమోనని అతని ఆశ! లేకపోతే అతను నలుగురికీ తనముఖం ఎల్లాగ చూపించగలడు? కేదారబాబు వంశస్థులంతా కలకత్తాలోనే ఉండేవారు. అతనుకూడా కలకత్తాలోనే పుట్టిపెరిగాడు. అసలతనికి కలకత్తా విడిచిపెడితే ఆపైన ప్రపంచకం ఉన్నదన్న సంగతికూడా తెలియదు. ఒకవేళ ఈబంధువుల్నీ ఈస్నేహితుల్నీ ఈసమాజాన్నీ విడిచిపెట్టి ఎవ్వరికీ తెలియకుండా కొకచోటఉంటే రోజులు గడవడం ఎల్లాగ? చివరికి అతనికి ఈప్రశ్న ఆలోచించడానికి కూడాభయం వేసింది. కూతురైఉండీ ఈనిర్భాగ్యురాలు రోగంతో తీసుకుంటూన్న తనకింత బాధతెచ్చిపెట్టిందని అతనికెంతో కోపంవచ్చింది. ఎంతసమాధానం చెప్పుకున్నా అతనాకోపం భరించలేకపోయాడు.

రాత్రితెల్లవార్లూ అతనికి ఒక్కసారైనా కునుకుపట్టలేదు. తెల్లవారేసరికి అతనికి బాగాపైత్యించింది. అయితే, అతనికి మనస్సులోఉన్న కష్టసుఖాలు చెప్పుకోడానికి ఎవరూ కనిపించలేదు! ఆమంచంమీద పడుకోవడంకూడా అతని కిష్టంలేకపోయింది. ఈవిధంగా యమయాతన అనుభవిస్తూన్నా అతను పైకి ప్రసన్నంగానే ఉన్నాడు. సామాన్యంగా రోజూ నలుగురితో తిరిగినట్లే ఈవేళా తిరిగాడు. ఆతరవాత ఒకమనిషిని పిలిచి "స్టేషనుకి బండితీసుకునిరా" అనిచెప్పి, వంటమనిషికి సామానులూ అవీ సద్ది సిద్ధంగాఉంచమని ఆజ్ఞాపించాడు.

మాట! ఆయనేమో ఏధులోకి షికారువెళ్లారు. మీరు ఇందాకటి నించీ ఇక్కడే నుంచున్నారు." అంది. ఆపైన మళ్ళీనవ్వుతూ "ముసలాయన మాట వినబడడానికి అప్పుడు మీమనస్సు మీస్వాధీనంలో ఉంటేగా! మీరేమి ఆలోచిస్తున్నారో నాకు తెలుసును. చెప్పనా!— అంది. అచలమళ్ళీ నిశ్శబ్దంగా నదిఅవతలితీరం చూస్తూనుంచుంది. ఈసారి ఆమెవ్యంగ్యంగా అన్నమాటకి సమాధానం చెప్పడానికికూడా ప్రయత్నించలేదు. ఇక్కడముఖ్యంగా ఒకవిషయం చెప్పవలసిఉంది. రాక్షసి అనేపేరుకీ ఆవ్యక్తికీ ఏమీ సంబంధంలేదు. అసలు ఆవిడపేరు రాక్షసి కానేకాదు. ఆవిడ అసలుపేరు వీణాపాణి. ఆవిడపుట్టీపుట్టడంతోనే తల్లిచచ్చిపోయింది. అందుచేత దాదికోపంపట్టలేక ఆపిల్లకి రాక్షసి అని పేరుపెట్టింది. అప్పటినించీ ఇరుగు పొరుగు వాళ్లుకూడా ఆమెను ఆపేరుతో పిలవడం అలవాటయిపోయింది.

అచల ఆమెఅన్న మాటలువిని తెల్లబోయి నుంచుంది. అందుచేత వీణాపాణి ఎంతోసిగ్గుపడి పశ్చాత్తాపపడుతూ ఇల్లాఅంది. "ఏమిటండీ! అక్కగారూ! మీరుఒక్కమాటైనా నవ్వుతూ మాట్లాడకూడదా? నాన్నగారంటే మీకు ఎంతభక్తి ఉందోనాకు తెలియదా? మా కాయన అన్ని సంగతులూ చెప్పేశారు. ఆయన పొద్దున్నే షికారుకి వెళ్ళివస్తున్నారట! మీరు ఈకొత్తఊళ్ళో ఏడుస్తూ డాక్టరుకోసం వెతుక్కుంటున్నారట! అప్పుడు మానాన్నగారు మిమ్మల్నిచూసి ఆసత్రవులోంచి మీభర్తగారిని మాయింటికి తీసుకు వచ్చారట! అక్కగారూ! ఇదిఅంతా భగవంతుడిసంకల్పం సుమండీ! లేకపోతే ఆవేళ ఆబండిలో మీపాదధూళి మాయింట్లో పడుతుందని అనుకున్నానా? దానికేంగాని మీరు నే నన్న మాటకి సమాధానం చెప్పడంలేదు. ఇక్కడ మీకు సుఖంగా

లేదని నేననుకుంటున్నాను; కాని మీకున్న ఇబ్బంది ఏమిటో నాకు తెలియడంలేదు. ఆ సంగతిమాత్రం చెప్పండి. అంది; కాని ఎంతసేపటికీ అచల ఏమీ అనలేదు. అప్పుడు వీణాపాణి 'అచల ఏదో కారణం చేత సమాధానం చెప్పడం లేదనుకుంది' వీణాపాణి తండ్రిగారు అచల అంటే ఎంతో గౌరవంగా చూస్తున్నారు. వీణాపాణికూడా అక్కగారూ! అని పిలిచి ఆమెను ఎంతో గౌరవిస్తూంది. అందుచేత ఆమె ఇంక ఆవిషయంలో ప్రశ్నించడం బాగుండదని ఊరుకుని అచల ముఖంపట్టుకుని బలవంతంగా తనకేసి తిప్పుకుంది. అచల కళ్ళమ్మట కన్నీళ్ళు సంతత ధారగా ప్రవహిస్తున్నాయి. వీణాపాణి అది చూసి నిర్ఘాంతపోయి నిలబడింది. ఆతరవాత అచల చీరచెరగుతో కళ్ళు తుడుచుకుంది. వీణాపాణి తనకేసి చూస్తూండడము వల్ల ఆమె మళ్ళీ తనముఖం పక్కకితిప్పి కూర్చుంది.

రెండోరోజున ఇంచుమించుగా మూడుఝాములు దాటినతరువాత వీణాపాణి అప్పుడేవచ్చిన ఒకమాసపత్రికతీసి అచలకి అందులో ఒక కథ చదివి వినిపిస్తూంది. అచల ఒక బెత్తపుకుర్చీకి జేర్లబడి ఆకథ వింటూంది. అచల ఆమెచదివేది అక్కడక్కడ వింటూంది. మిగిలినవి అసలు ఆమెచెవిని పడడమేలేదు. ఇంతలో వీణాపాణి మామగారయిన రామచరణలాహిరీగారు "అమ్మా! రాక్షసీ' అనిపిలుస్తూ అక్కడికి వచ్చారు. ఆయన లోపలికి రావడంతోనే ఇద్దరూ చటుక్కుని లేచినిలబడ్డారు. వీణాపాణి ఒకకుర్చీ తీసుకువచ్చి అక్కడవేసి ఎంతోకుతూహలంతో 'ఎందుకు నాన్నగారూ!' అని అడిగింది.

ఈముసలాయన చాల్లా నియమమూ నిష్ఠా ఉన్నవారు. ఆయన నెమ్మదిగా ఆకుర్చీమీద కూర్చుని అచలకేసి ఎంతో ఆప్యాయంగా చూస్తూ "ఒకవిషయముంది అమ్మా! పురోహితుడు ఇప్పుడిప్పుడే వచ్చాడు. ఆయన మీభార్యాభర్తల ఇద్దరి పేరులతోటీ సంకల్పంచేసి

ప్రతీరోజూ నారాయణమూర్తికి తులసితీర్థం సమర్పిస్తున్నాడు. ఆపూజా పునస్కారమూ రేపటితో పూర్తి అయిపోతుంది. అందుచేత నువ్వు రేపు కాస్త రెండుఝాములు తిరిగేదాకా భోజనం చెయ్యడానికి వీలుండదు. ఆయన ఆనారాయణమూర్తి ప్రతిమని ఇక్కడికి తీసుకువచ్చి ఆపూజా అదీ పూర్తిచేస్తారు. అందుచేత నువ్వు రేపు ఎక్కడికీ వెళ్లడానికి వీల్లేదు అన్నాడు.

ఆయన అల్లాగ అనేసరికి అచలముఖం అంతా ఒక్కసారిగా నల్లబడిపోయింది. ఆ మసకమసకగా ఉన్న వెలుతురులో ముసలాయనికి అది కనబడలేదు. కాని వీణాపాణి ఆవిషయం కనిపెట్టింది. ఆమె హిందువుల ఇంట్లో పుట్టిపెరిగిన పిల్ల. భర్త ఆరోగ్యంకోసం చేసేపూజలూ పునస్కారాలూ అంటే ఆమెకి చాలాఇష్టం. హిందూ సంప్రదాయాన్ని అనుసరించి వాటిని ఆమె బాగా గౌరవిస్తూఉంటుంది. వాటివిషయంలో ఆమెకింక ఏవిధమైన అనుమానమూ లేదు. అందుచేత అచలని చూసేసరికి ఆమెకి కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు. అయినా గాని ఆమె అచలపక్షం వహించి నాన్నగారూ మీరు సురేశబాబుకి ఆరోగ్యం కలగాలని నారాయణమూర్తికి తులసీతీర్థంతో పూజ చేయిస్తున్నారు. ఆయన ఉపవాసం చెయ్యకపోతే అక్కగారు చేయటం ఎందుకు?" అని అడిగింది. ఆమాటమీద ముసలాయన నవ్వుతూ "సురేశబాబు ఒకటీ మీఅక్కగారు ఒకటీనా? సురేశబాబు ఈపరిస్థితుల్లో ఉపవాసం చెయ్యలేరు. అందుచేత మీ అక్కగారే ఉపవాసం చెయ్యాలి. శాస్త్రాలలో ఇల్లాగే చెప్పబడి ఉందమ్మా, ఇందులో మనం ఆలోచించవలసిందేమీలేదు." అన్నారు.

అచల దీనికి కావని గాని అవునని గాని ఏసమాధానమూ చెప్పలేదు. అందుచేత అచల మేలుకోరే ముసలాయనకి ఈవిషయం చిత్రంగా కనబడింది. అందుచేత ఆయన సూటిగా అచలముఖంకేసి

చూసి "సురమా? దీనికి నీకేమయినా అర్థాంతరం ఉందా?" అని అడిగి ఆమె చెప్పే సమాధానంకోసం ఎదురుచూస్తూ కూర్చొన్నారు. అచల దీనికికూడా ఏమీ సమాధానం చెప్పలేదు; కా ఒక్కనిమిషం అల్లాగ నిశ్శబ్దంగాఉండి ఆపైన మృదువుగా "ఒకవేళ ఆయనే ఉపవాసం చేస్తారేమో! ఆయనతో చెప్పి చూడండి!" అంది దీనితరవాత మళ్ళీఅందరూ నిశ్శబ్దంగాఉన్నారు. ఆ అన్నమాటలో ఉన్న కాఠిన్యమూ అనౌచిత్యమూ అచలకి తెలిసినంతగా ఇంకెవ్వరికీ తెలియలేదు. అయితే ఈమాటలో ఉన్న అంతరార్థము ఆ అంతర్యామికితప్ప ఇంకెవ్వరికీకూడా తెలియలేదు

ఆముసలాయన లేచి నిలబడి "సరే! బాగానేఉంది. పోనీతే అల్లాగేచేద్దాము!" అని కిందికిదిగి వెళ్ళిపోయారు. ఇంతలో ఒక నౌకరు వచ్చి అక్కడ దీపంపెట్టి వెళ్ళిపోయాడు. కాని వాళ్ళిద్దరూ అల్లాగే మాట్లాడకుండా కూర్చున్నారు. ఆమాసపత్రికలో కథ చదవడానికి చాలాబాగుంది కాని అది పూర్తిచెయ్యడానికిమాత్రం ఎవ్వరికీ ఉత్సాహం కలగలేదు. అప్పుడే బాగా చీకటి కమ్ముకుంటూంది. ఆనదికి అవతలివడ్డున ఉన్న ఇసుకతిన్నె సంకోచిస్తూ మౌనంగాకూర్చున్న ఆస్త్రీలిద్దరికీ ఒకవిచిత్రస్వప్నంలాగ కనిపించింది. ఈవిధంగా కొంతసేపుగడిచిపోయింది. కాని ఇంతలో వీణాపాణి తన మనస్సులో ఏమని ఆలోచించిందోగాని తనకుర్చీ మెల్లిగా అచల దగ్గిరకి లాక్కుంది. కొంచెంసేపు ఆమె దగ్గిర అల్లాగకూర్చుని మెల్లిగా "అక్కగారూ! ఆవైపున ఉన్న ఆమైదానంచూస్తే ఏమనిపిస్తూందో చెప్పనా? నాకు మీరే ఆమైదానందగ్గిర ఉన్నట్లు కనిపిస్తున్నారు!" అంది. ఆతరవాత అదేమిటి అల్లాగ ఒణుకుతున్నారు?' అని అడిగింది.

అచల ఒక్కసిమషందాకా ఏమీఅనకుండా ఊరుకుని కొంచెం అస్పష్టంగా "అదేమిటోగాని కొంచెం చలివేస్తూన్నట్టుంది" అంది. ఆమాటవినగానే వీణాపాణి చటుక్కునిలేచి లోపలికివెంచి ఒక శాలువా తీసుకునివచ్చి అచలకి కప్పింది. ఆతరవాత మళ్ళీ తనచోటులో కూర్చొని "అక్కగారూ! మిమ్మల్ని ఒక్కవిషయం అడిగాలనిఉంది. కాని అడగడానికి సిగ్గుగాఉంది. మీరు కోపపడకపోతే——" అని ఊరుకుంది. ఆమాట వినేసరికి అచలహృదయంలో ఒకవిధమైన ఒణుకుపట్టుకుంది. ఇంతభయంతో మాట్టాడితే తనసంగతి తెలిసి పోతుందని భయపడి ఆమె స్పష్టంగా "అబ్బే! దానికేమిటి" అని ఊరుకుంది. వీణాపాణి ఎంతో ఆప్యాయంగా అచల చెయ్యి తనచేత్తో పట్టుకుని మెల్లిగా కదుపుతూ "మీరు నాకిప్పుడు అక్కగారు! మీకు నేనొక చిట్టిచెల్లాయిని. ఆనాడు రైలులో కలుసు కున్నప్పుడు మనకీబంధుత్వం లేనేలేదు. అయితే, ఆనాడు మీరుమీసంగతి అంతా నాకుతిన్నగా చెప్పలేదేం. అప్పుడు ఈనురేశబాబుగారు మీభర్తగారు కారన్నారు. అసలు మీభర్త గారు జబ్బుగా ఉన్నారనీన్నీ, వారుఇంకొకపెట్టెలో ఉన్నారనీన్నీ చెప్పారు. అన్నట్టు వారిని తీసుకుని మీరు జబ్బలుపూరు వెళుతున్నామనికూడా అన్నారు! మీరు మోసగిద్దామని అను కుంటేమాత్రం నన్ను మోసగించగలరా? ఆయన ఎవరోనాకు తెలిసిపోయింది లెండి పైగా మీరు, మేము బ్రహ్మసమాజ స్థులమని నాతో చెప్పారు." అని ఒకచిన్న చిరునవ్వునవ్వి మళ్ళీ 'మీవారి జంజంచూస్తే ఆపురోహితుడుకూడా సిగ్గుపడాలి! అయితే అక్కగారూ! మీరు ఆవేళ నాతో అన్నిఅబద్ధాలెందుకుఆడారు?" అనిఅడిగింది.

అచల బలవంతంగా లేనినవ్వు తెచ్చిపెట్టుకుని "ఒకవేళ నేను

చెప్పకపోతేనో" అంది. వీణాపాణి "మీరు చెప్పకపోతే నేనే చెప్పేస్తాను! అయితే ఒక్కమాట చెప్పండి! నేను ఉన్నది ఉన్నట్లు చెబితే మీరు నాకు ఏమిఇస్తారు?" అంది. ఆమాట అడిగేనరికి అచలహృదయంలో రక్తప్రవాహం ఆగిపోయింది. ఆమె ముఖంమీద కత్తినాటువేస్తే నెత్తురుచుక్కైనా లేదు. ఈసంగతి వీణాపాణి కనిపెట్టిందో లేదో చెప్పడం కష్టము. వీణాపాణి మళ్ళీ ఒకచిరునవ్వు నవ్వి "సరేలెండి మీరిచ్చినాసరే ఇవ్వకపోయినాసరే గాని నేనుఉన్నదున్నట్లు చెబితే తిండానికి నాకుఏమి పెడతారో చెప్పండి! అక్కయ్యా!" అంది.

అచలచెవిలో అక్కయ్యా! అనేపిలుపు అగ్నిజ్వాలలాగ ప్రవేశించింది. ఆఉత్తరక్షణంలో అచలకి శరీరంమీద స్మారకం తప్పిపోతున్నట్లయింది. ఆమె సగంసగం స్మారకం తప్పిపోతూన్న అవస్థలో అల్లాగేకూర్చుండిపోయింది. వీణాపాణి మళ్ళీచెప్పడం మొదలు పెట్టి "మనఇద్దరిలోనూ తప్పులేదు! తప్పంతా మగవాళ్ళదే! ఒకాయన జ్వరతీవ్రతలో మీఅసలుపేరు బైట పెట్టేశారు. ఆరెండోఆయన ఆపేరునుబట్టి గూఢమైనసంగతి ఏమిటో కూపీతీశారు. అచల ఎంతో ప్రయత్నిస్తేనేగాని లోపల కంగారు అణుచుకోలేక పోయింది. కానిఎల్లాగో అల్లాగ లోపలకంగారు అణుచుకుని "అసలుసంగతి కూపీతీయ్యడం ఏమిటి? మీరుచెప్పేదేదో పూర్తిగా చెప్పండి! వింటాను" అంది "అక్కయ్యగారూ! ఒక్కమాట చెబుతాను వినండి! ఎంతకాదన్నా ఆయనకి కొంత స్మారకం ఉందన్న సంగతి మీరుకూడా అంగీకరించాలి. ఆయన జ్వరంతో మంచంమీదపడుకున్నట్లే పడుకుని హఠాత్తుగా ఒక రాత్రివేళలేచి నాదగ్గిరికివచ్చి "మీఅచలఅక్కగారి సంగతి ఏమిటో మీకుతెలుసునా? ఆవిడ ఇంటిదగ్గిర దెబ్బలాడి ఇక్కడికి వారి

పోయి వచ్చారు" అన్నారు. ఆమాటమీద నేను ఆయనమీద కోపపడి "వెళ్ళిపదుకోండి! మీకు ఇల్లాంటి మాటలంటే బాగుండదు. ఈమాట ఆవిడకి తెలిసిందంటే ఆవిడ ఇంక మీ ముఖం చూడదు" అన్నాను. అచల ఈమాటవిని కుర్చీచేతులు గట్టిగా పట్టుకుని మనస్సు రాయిచేసుకుని కూర్చుంది.

వీణాపాణి మళ్ళీ ఆమాటమీద, ఆయన "ఆవిడ నాముఖం చూసినా సరే! చూడకపోయినాసరే! ఈమాటనిజం. నేను ఎంతఒట్టు పెట్టుకోమంటే అంతఒట్టు పెట్టుకుంటాను. ఆవిడ ఇంట్లో అత్తగారితోనో ఆడబడుచుతోనో దెబ్బలాడి నన్ను తీసుకుని ఇంట్లోనించి లేచివచ్చింది." అని చెప్పారు. అప్పటినించీ మీరు మారుపేర్లతో తిరుగుతున్నారు, మీమామగారూ అత్తగారూ వెతుక్కుంటూ వచ్చి ఇంటికిరమ్మని మిమ్మల్ని బతిమాలుకునేదాకా మీరు వెళ్ళరు. అసలు ఇదే జరిగిఉండాలి. ఇదినిజంకాకపోతే మీరు అసలు ఏమి జరిగిందో నాతో చెప్పండి!" అంది. ఆపైన ఒక్కనిమిషం ఊరుకుని "అన్నట్టునేను చెప్పవలసింది ఇంకాపూర్తికాలేదు. ఆయన ఆవిధంగా అన్నాక నేను సురేశ బాబుగారితో "సరే! పోనీ మాటవరసకి మీరు చెప్పినట్లే జరిగిందని అనుకుందాము. అదేనిజమయితే రైల్లో నావంటి మూర్ఖురాలితో అబద్ధాలాడవలసిన అవసరంఏమిఉంది?" అన్నాను. ఆయన నామాటవిని నవ్వి మీ అక్కగారు మీకుమల్లే తెలివైనమనిషి అయితే ఈవిధంగా అబద్ధాలాడవలసిన అవసరమే లేకపోవును! కాని ఆవిడ మీఅంత తెలివైనది కాదు. అందుచేత మీరు రెండు మూడురోజుల్లో ఆవిడ తనపేరు మార్చుకుని 'సురమ' అని పేరు పెట్టుకుంది. హిందువులమని చెప్పడంమానేసి బ్రహ్మసమాజస్థులమని చెప్పింది. దేవారీ వెళుతున్నామని చెప్పడం మానేసి జబలుపూరు వెళుతున్నామని చెప్పింది. అల్లాగేకాకపోతే జబలుపూరుకి టికెట్టు

కొనుక్కున్నవాళ్లు బండి మార్చేసి చటుక్కుని ఇక్కడికి ఎందుకు వస్తారు? ఆవిడ జబ్బుతో బాధపడుతూన్న భర్తని తీసుకుని ఏ బంగాళీ వాళ్ళ ఇంటికో వెళ్లకుండా ఈ పల్లెటూళ్లో ఈ కూలిపోవడానికి సిద్ధంగా ఉన్న ఈ సత్రవుల్లో ఎందుకు దిగుతుంది? అన్నారు" అంది.

వీణాపాణి అల్లాగ మాట్లాడుతూ మాట్లాడుతూ, అచలకంఠం చటుక్కుని కౌగిలించుకుని ఎంతో ఆప్యాయంగా ఆమె చెవిదగ్గర ముఖం పెట్టి "అక్కగారూ! అసలు ఏంజరిగిందో నాతో చెప్పరూ! నేనీ మాట ఇంకెవరితోనూ చెప్పను! ఎంత ఒట్టుపెడితే అంత ఒట్టు!" అంది. వీణాపాణి అసలు సంగతి ఏమిటో తెలుసుకోవాలని చెప్పినకథనిని అచల నిర్ఘాంతపోయి కాలికత్తెఒడిలో కూలబడిపోయింది. ఆమె చెంపలమీదనించి అదేపనిగా కన్నీళ్లు ప్రవహించడం ప్రారంభించాయి. ఆ కన్నీళ్లే ప్రవహించకపోతే ఆమె మరణించినదని అనుకోవలసిందే! ఆ చలస్థితి ఒక్క నిమిషంలో ఆవిధంగా మారిపోయింది!

ఆవిధంగా కొంతసేపు గడిచిపోయింది. వీణాపాణి మాటిమాటికీ తనచీరచెరగుతో అచలకన్నీళ్లు తుడుస్తూ స్నేహార్ద్రమైన కంఠస్వరంతో "సురమ అక్కయ్యా! వయస్సులో మీరు నాకంటె పెద్దవారే! కాని ఈ చిన్న చెల్లాయి చెప్పిన మాటవిని తిన్నగా ఇంటికి వెళ్ళిపోండి! మీరు ఇంటిదగ్గిర బయలుదేరిన వేళ మంచిదికాదు. ఎన్నో కష్టాలు అనుభవించి ఎల్లాగో అల్లాగ బతికిబయటపడ్డారు. ఇంకా భీష్మించుకుని కూర్చుని ఆ ముసలివాళ్ళని బాధపెట్టడం న్యాయంకాదు! అదీగాక మామగారింటికి వెళ్ళడానికి సిగ్గెందుకు చెప్పండి! ఇందులో పెద్ద అగౌరవం ఏమీ లేదే!" అంది. ఆపైన ఒక్కనిమిషం ఊరుకుని మళ్ళీ "అల్లాగ మాట్లాడకూరుకున్నారేం? అక్కడికి వెళ్ళదలుచుకోలేదా? తల్లిదండ్రుల్ని విడిచిపెట్టి వచ్చినప్పటినించీ సురేశబాబుగారి ఆరోగ్యం పాడైపోయింది. మీ రింటికి వెడదామని అంటే ఆయన కూడా దానికి

అంగీకరిస్తారు. నేనిమాట నిశ్చయంగా చెప్పగలను" అంది.

అచల ఇప్పుడు కళ్ళు తుడుచుకుని తిన్నగా కూర్చుంది. వీణాపాణి అచలవైపు అల్లాగే ఏదో తెలుసుకోవాలనే ఉద్దేశంతో చూస్తూంది. మొట్టమొదట అచల సమాధానం చెప్పడానికి ఎంతో సిగ్గుపడింది; కాని వీణాపాణికి ఏదో ఒక సమాధానం చెప్పకపోతే ఆమెను సమాధానపరచడం కష్టం అనే అభిప్రాయంతో తన సంకోచమూ సిగ్గూ ఒక్కసారిగా విడిచిపెట్టి, మెల్లిగా "వీణాపాణీ! మేము ఇంక ఇంటికి వెళ్ళడానికి మార్గం ఏమీ లేదు!" అని సమాధానం చెప్పింది. వీణాపాణికి ఆమాటమీద నమ్మకం కలుగలేదు. అందుచేత "మార్గం ఎందుకు లేదు. మీసంగతి నాకేమీ తెలియదనుకుంటున్నారు! మీరు ఇంటికి తిరిగి వెళ్ళడానికి భయపడక్కరలేదు! అల్లాంటి అమర్యాదైనపని మీరెప్పుడూ చెయ్యరు. మీకూ నాకూ ఉన్న పరిచయం కొంచెమే అయినా నేనీమాట ధైర్యంగా చెప్పగలను! సరే! మీరిప్పుడు మీ మామగారి ఇల్లెక్కడ ఉందో చెప్పండి! మేము ఎల్లుండి పొద్దున్నే బయలుదేరి ఇంటికి వెళ్ళిపోతున్నాము. నేను మిమ్మల్ని కూడా తీసుకువెళ్ళి మీ ఇంటిదగ్గర దిగపెడతాను. ఆ ముసలివాళ్ళు ఇద్దరూ నాకేమి సమాధానం చెబుతారో చూస్తాను! మీకు వాళ్ళు ఎల్లాంటివాళ్ళో నాకూ అల్లాంటివాళ్ళే! అల్లాంటి వాళ్ళతో మాట్లాడడానికి నాకు భయం ఎందుకు?" అంది.

అచల ఆమాటమీద అదిరిపడి "మీరు ఎల్లుండి తిరిగి మీ దేశం వెళ్ళిపోతున్నారా? నాకీసంగతి తెలియనే తెలియదు. మరి ఇక్కడ ఎవరుంటారు?" అంది. వీణాపాణి "ఎవరూ ఉండరు. నౌకర్లుమాత్రం ఇల్లు కనిపెట్టుకుని ఉంటారు. మా పెద్దత్తగారికి చాలాకాలంనించి జబ్బుగా ఉంది. ఆవిడ ఇంక బతుకుతుందనే ఆశ లేదు. ఆవిణ్ణి ఒకసారి చూసిరావాలని ఉంది. అందుచేత వెడుతున్నాను" అంది. అచల "మీ అత్తవారిల్లు ఎక్కడ ఉంది?" అని అడిగింది. వీణాపాణి "కలకత్తాలో

చేటుకన్నాని పారిపోయింది. ఆమె అక్కడ ఉన్నంతసేపూ అచలకి చల్లని మలయమారుతం వీచినట్లయింది. ఆమె అన్నమాటలు అచలచెవిలో మారుమోగుతూనే ఉన్నాయి. ఆఖరిమాట చెవిని పడేసరికి అచల ఒక్క నిమిషంలో పాషాణప్రతిమగా మారి పోయింది. ఇంక ఈవేళరాత్రీ రేపుపగలూ మాత్రం మిగిలిఉన్నాయి. ఇంక ఆపైన ఏవిధమయిన బాధా ఉండదు! ఏ అడ్డూ ఉండదు. ఈ నిర్జనప్రదేశంలో ఆమెదగ్గిర ఎవ్వరూ ఉన్నట్లు కనబడలేదు. నిన్నటివరకు భవిష్యత్తులోకూడా తనసమీపంలో ఎవ్వరైనా ఉన్నారేమో అని ఆమె చూసింది. ఆమెకు ఒక్క సురేశుడు తప్ప ఇంకెవ్వరూ కనబడలేదు.

## 31

మనుష్యులూ ఎవ్వరూ లేని ప్రదేశంలో ఒక్క సురేశుడితో కలసి ఉండవలసిన అవస్థ ఏర్పడింది. ఆ అవస్థ క్రమక్రమంగా సమీపము నకు కూడా వస్తూంది. ఇక్కడ ఏవిధమయిన బాధా లేదు. ఇంక ఆలస్యం చెయ్యడానికి వ్యవధికూడా లేదు. పోనీ "ఈవేళ కాదు రేపు" అని కాలక్షేపము చెయ్యడానికికూడా వీల్లేదు. వీణాపాణి ఇన్నాళ్ళనించీ "మామగారి ఇల్లు స్వగృహంలాంటిదే! అక్కడికి వెళ్ళడానికి సిగ్గుపడవలసిన అవసరమేమీ లేదు!" అని అంటూనే ఉంది. పాపము! ఆమెకు ఎవరుబంధువులో ఎవరుకారో నిర్ణయించు కోవడం చాలా కష్టము! ఆ సంగతి అంతర్యామియైన ఆ పరమేశ్వరు డికి ఒక్కడికే తెలుసును. అయితే, ఆమెభర్త జీవించేఉన్నాడు! చెప్పుకోవడానికి ఆ కాలిపోయిన ఇల్లుఒకటి ఉంది. ఆ ఇంటి గోడలింకా పూర్తిగా పడిపోలేదు! కావలిస్తే ఆమె ఈవాళవెళ్ళి కొంతసేపు ఆ గోడలమధ్యన నిలబడవచ్చును.

ఒకపశువుని కట్టివేసినప్పుడు దానికి ఎదురుగుండా విశాలమైన మైదానం కనబడుతూ ఉన్నంతవరకూకూడా అది తలవిదిలిస్తూ అరుస్తూనే ఉంటుంది. సరిగ్గా అవిధంగా ఆమె హృదయంలో కూడా ఒకబ్రహ్మాండమైనకాంక్ష బయలుదేరింది. దానికోసం ఇప్పుడామె హృదయం రాత్రింబగళ్లు ఆవేదన పడుతూంది. ఆపక్కగదిలో సురేశుడు పడుకుని నిద్రపోతున్నాడు. చాలారోజులనించి వీణాపాణీ అచలా ఒక్కమంచంమీదే పడుకుని నిద్రపోయేవారు. కాని ఈవేళ వీణాపాణిభర్త వచ్చాడు. అందుచేత ఆమె తనపక్కగదిలో పడుకోడానికి వెళ్ళిపోయింది. తను ఒంటరిగా ఉండిపోవలసివచ్చినందుకు అచల ఎంతో యమయాతన అనుభవించింది.

పక్కగదిలో ఉన్న గడియారం రెండుగంటలు కొట్టింది. అచల శాలువాముసుగు తీసివేసి లేచికూర్చుంది. అల్లాంటి చలిలోకూడా అచలకి కొంచెం చెమటపట్టింది. అందుచేత ఆమె మంచంమీదనించి లేచి తలవైపునున్నకిటికీ తెరిచింది. ఆమెకి ఎదురుగుండా కృష్ణపక్షపు అష్టమిచంద్రుడు ప్రకాశిస్తున్నాడు. అతిమృదువైన ఆచంద్రకిరణాలు పడడంచేత శోణానదిలో నీళ్ళు చాలదూరం దాకా తళతళ మెరుస్తున్నాయి. ఆ అర్ధరాత్రివేళ చల్లనిగాలి వీచింది. ఆగాలి తగిలేసరికి ఆమె నుదుటిమీద ఎవరో ఎంతో ఆప్యాయంగా చెయ్యివేసినట్లయింది. ఆమె అక్కడే ఆకిటికీదగ్గిర కూర్చుని తనఅదృష్టం అటోఇటో తేల్చివేసే భావిసమస్యని గురించి ఆలోచించడం మొదలుపెట్టింది.

తనజీవితంలో ఉన్న యథార్థవిషయాలన్నీ రాస్తే ప్రపంచానికి అవన్నీ ఒకఅద్భుతమైన నవలలాగ చదువుకుంటుందని ఆమె గట్టిగా విశ్వసించింది. ఆమెకు జీవితంలో కథాప్రారంభం అయినప్పటి నించీ ఎన్నో అసత్యాలు సత్యస్వరూపంలో ప్రత్యక్షమైనాయి.

అప్పటికీ తలచుకుంటూంటే ఆమెకు భరించరాని వేదన కలిగింది. మెల్లిమెల్లిగా ఆమె చెంపలమీదనించి కన్నీటిధారలు ప్రవహించాయి. యౌవనప్రాదుర్భావంలో పరమేశ్వరుడు ఆమెజీవితంలో సంతోషంలేకుండా చేసివేశాడు. ఆమెజీవితం అంతా ఇప్పుడు నవ్వులపాలైపోయింది. పరమేశ్వరుడికి ఆమెజీవితం ఈవిధంగా నలుగురిలోనూ నవ్వులపాలు చెయ్యడానికి ఏవిధమైన సంకోచమూ కలగలేదు. అల్లాంటి కఠినుడైన పరమేశ్వరుణ్ణి ఆమె చిన్నప్పటించీ ఎంతో భక్తితో ప్రార్థించింది. ఆమె జ్ఞానంవచ్చినప్పటినించీ పరమేశ్వరుణ్ణిగురించి ఎన్నోవిషయాలు నేర్చుకుంది; కాని అవన్నీ ఇప్పుడు కేవలం వ్యర్థమైపోయినట్టు కనిపించాయి. ఆమెచీరచెరగుతో కన్నీళ్ళు తుడుచుకుని "పరమేశ్వరా! ఈ విశాలప్రపంచకంలో నీకు ఈదురదృష్టవంతురాలి జీవితంతప్ప మరి ఏ ఆటవస్తువ్వూ కనబడలేదా?" అని మాటిమాటికీ అనుకోవడం మొదలుపెట్టింది.

ఆతరవాత ఒక్కనిమిషం ఊరుకుని, ఆమె మనస్సులో మళ్ళీ "నేనెక్కడ? సురేశబాబెక్కడ! ఆయన బ్రహ్మసమాజస్థుల నీడతగిలితే కూడా అసహ్యించుకొనేవారు! అల్లాంటిమనిషికి ఇప్పుడు బ్రహ్మసమాజస్థులంటే ఉన్న ఆసక్తికి అంతూదరీలేదు! ఎప్పుడూ ప్రేమించని వ్యక్తి ఇప్పుడు ప్రాణాధికురాలైంది. ఇదిఅంతా విధివిధానం కాకపోతే మరిఏమిటి; ఇల్లాంటిదురదృష్టం ప్రపంచకంలో ఇంకెవరికయినా వచ్చిందా?" అని అనుకుంది. ఎన్నోకష్టాలనుభవించి మహిముణ్ణి వివాహం చేసుకోగలిగింది. కాని భగవంతుడది చూసి సహించలేకపోయాడు. సురేశుడు ఒకరోజున పెద్దతుపానులాగ వాళ్ళింటికి వచ్చాడు. అతను రావడంతోనే ఆమె నిర్మించుకున్న ఆసుఖసౌధంకాస్తా దగ్ధమైపోయింది. దానితో ఆమె అదృష్టరేఖకూడా మాయమైపోయింది. ఇన్నీ తెలిసి ఆమె ఆజబ్బుతో

ఆమె భర్తని మళ్ళీ సురేశుడిన్నాటికి ఎందుకు తీసుకువెళ్ళింది? నన్ను ఒకటిరించుకోవాలని ప్రయత్నించినా మళ్ళీ ఆతనే సిద్ధమవుతాడా? ఇది విధివిధానమా? ఈ యాతనలోనించీ, ఈ అవమానంలోనించీ తప్పించుకోడానికి ఇంక మార్గంలేదా?

ఆ పైన అచల రెండుచేతులూ జోడించి గద్గదస్వరంతోటి ఈ విధంగా ప్రార్థించింది. "జగదీశ్వరా! ఒకనాడు జబ్బుబారిగా నిమ్మళించినతరవాత నాభర్తగారు ఎంతో ఆప్యాయంగా నన్నాశీర్వదించారు. దానితోటి నాలో ఉన్న అపరాధాలకన్నింటికీ ప్రాయశ్చిత్తం అయిపోయిందనేనమ్మకం నాకు కలిగింది. ఆరోజుల్లో నీవు నన్నావిధంగా సంరక్షించావు. అల్లాంటప్పుడు మళ్ళీ నన్ని నరక కూపంలో ఎందుకు పడవేశావు! ఇంత జరిగినా సురేశబాబుని నేను మళ్ళీ నాతో రమ్మని ఆహ్వానించాను. నేనుచేసినది తప్పైనా? నాకీ కళంకం పూర్తిగా తొలగిపోదా? ప్రభూ! నా దురదృష్టంచేత నువ్వు కూడా నా హృదయం పూర్తిగా గ్రహించలేకపోయావు! నా హృదయంలో నిత్యమూ ఏమి జరుగుతూ ఉందో నీకు తెలియదా!"

తండ్రిసంగతీ భర్తసంగతీ ఆమె మరిచిపోగలిగింది. చాలాకాలంనించి ఆమె వాళ్ళవిషయం ఆలోచించడమేలేదు! ఆమె ఈ వేళకూడా వాళ్ళ సంగతి జ్ఞాపకంరాకుండా చేసుకోగలిగింది. కాని ఆమె మృణాలసంగతీ, సురేశుడిపినతల్లిసంగతీ మాత్రం మరచిపోలేకపోయింది. సురేశుడిపినతల్లి అచలబయలుదేరే సమయాన్ని ఎన్నోవిధాల ఆశీర్వదించి సదుపదేశం చేసింది. ఇప్పుడామెకు ఆసంగతులన్నీ జ్ఞాపకం రావడం మొదలుపెట్టాయి. ఈ వేళ తనగురించి ఆవిడ ఏమనుకుంటుందో అని అనుకునేసరికి ఆమె హృదయంలో ఎంతో బాధకలిగింది. దేహమూ మనస్సూ ఆమెస్వాధీనంలోనించి తప్పిపోయాయి. ఆమె కిటికీఊచలమీదనుదురు మోపి అల్లాగే నిలబడిపోయింది. ఆమె చెంపలమీదనించి కన్నీళ్లు ఏకధారగా

ప్రవహిస్తున్నాయి. ఇంతలో వెనక నుంచి మెల్లిగా అడుగులచప్పుడయింది. ఆమె వెనక్కి తిరిగి చూసింది. ఒంటిమీద ఏమీ కప్పుకోకుండా సురేశుడక్కడ నిలబడి ఉన్నాడు. ఆమెకు క్షణకాలం ఆవేశం కలిగింది. ఆ ఆవేశంలో ఆమె ఏమేమో మాట్లాడబోయింది; కాని కన్నీళ్ళచేత ఒక్కమాటయినా మాట్లాడలేకపోయింది. బహుశః ఆమెకు ఆకన్నీళ్లు బలవంతంగా ఆపుకొని మాట్లాడాలనే కోరిక లేకపోయిఉండవచ్చును. అందుచేత ఆకన్నీళ్ళు పూర్వంమాదిరిగా ఆకిటికీఊచలమీద నుదురు మోపి ఏదో ఆలోచిస్తూ నుంచుంది. ఇంతవరకూ బిందువులు బిందువులుగా ప్రవహిస్తూన్న కన్నీళ్లు ఇప్పుడు ఏకధారగా ప్రవహించడం మొదలు పెట్టాయి.

అంతటా నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడా ఏవిధమైనధ్వనీలేదు. సురేశుడు ఆమెవెనకాల రాతివిగ్రహంలాగ నిలబడ్డాడు. అతనిశరీరం అంతా ఒక్కసారిగా వెదురుఆకులా ఒణికింది. ఒక్కక్షణంలో అతనుచేతులుచాపి, అచలశిరస్సు తనహృదయానికి గట్టిగాహత్తుకున్నాడు. అచల చటుక్కని అతనిపట్టు విడిపించుకునిచీర చెరగుతో కన్నీళ్ళు తుడుచుకుంది. ఇక్కడ ఒక విచిత్రం జరిగింది. ఆమెదుఃఖాలకన్నిటికిని సురేశుడే మూలకారణము. అయినాగాని అతన్ని చూస్తే ఆమెకెక్కువ ఈసడింపు కలగలేదు. పైగా. అతన్ని మృదువుగా "మీరీగదిలోకి ఎందుకువచ్చారు?" అని అడిగింది. దానికి సురేశుడు ఏమీసమాధానం చెప్పలేదు. బహుశః కంఠం స్వాధీనం కాకపోవడంవల్ల అతను మాట్లాడలేకపోయి ఉండవచ్చును. అచల మెల్లిగా కిటికీమూసివేసి "చలిమూలాన్ని మీచేతులు బాగా ఒణుకుతున్నాయి. తలమీద ఏమీలేకుండా ఈవిధంగా నిలబడడం మంచిదికాదు, మీగదిలోకివెళ్లి పడుకోండి!" అంది.

సురేశుడికళ్లు ఎర్రగా చింతనిప్పుల్లాగ ఉన్నాయి. అతని కంఠస్వరంకూడా ఒణికింది. అతను అచలచెయ్యి చేత్తోపట్టుకుని అస్పష్ట

స్వరంతో "ఎవరక్కడా నా గదిలోకి వచ్చి?" అన్నాడు. అతని కంఠంలో ఆశ్చర్యం కలిగింది. అతను కొంతసేపు అతని కేసి విస్మయంగా చూసి "అబ్బే! ఈ వేళకాదు!" అని తలచెయ్యి విడిచిపెట్టాడు. సురేశుడికి ఇల్లాగ ప్రశాంతంగా తిరస్కరించడానికి [illegible] పడలేదు. అందుచేత అతను అల్లాగే నిలబడి చూశాడు. అచల అతని కేసి తిరక్కుండానే "నేను మేలుకున్నానని తెలిసిఉండే మీరు నా గదిలోకి వచ్చారా?" అని అడిగింది. సురేశుడికి ఆ మాటలతో కమ్చీతో కొట్టినట్టయింది. అతను "లేదు. అయితే, మీరు నిద్రపోతున్నారని తెలుసుకుని మీ గదిలోకి వచ్చానని అనుకుంటున్నారా?" అన్నాడు.

ఆ మాటమీద అచల ముఖం తిప్పేసి ఒక్క నవ్వు నవ్వింది. అక్కడ దీపపు వెలుతురు చాలా తక్కువగానే ఉంది. అయినా కాని ఆమె నవ్వు అతనికి కనబడిపోయింది. ఆ నవ్వువల్ల అచల "ఓరి దురాత్ముడా! స్త్రీ నిద్రపోతూంటే పురుషుడు ఆమె గదిలోకి దొంగతనంగా ప్రవేశించకూడదనే నీతి ఉందని నువ్వెరుగుదువా? ఆ జ్ఞానం నీకు మాత్రం ఉందని నమ్మమంటున్నావా?" అని అడిగినట్లు కనబడింది; కాని ఆమె పైకి ఒక్క మాటైనా అనలేదు. ఒక నిమిషం ఉన్న తరవాత ఆమె కిటికీ విడిచిపెట్టి ఇవతలికి వచ్చి నిలబడి మెల్లిగా "మా ఒంట్లో ఆరోగ్యంగా లేదు. మీరింక మేలుకోకండి! వెళ్లి నిద్రపోండి" అని మెల్లిగా తన పరుపు మీదికి వెళ్లి శరీరం ఆపాదమస్తకమూ కప్పుకుని నిద్రపోయింది. సురేశుడు కొంతసేపటిదాకా అక్కడ ఒక స్తంభంలాగ నిలబడి, ఆ మైన నిశ్శబ్దంగా తనగదిలోకి వెళ్లి పడుకున్నాడు.

ఒకళ్లిద్దరు నౌకర్లూ, దాసీ వాళ్లూ తప్ప మిగిలినవాళ్ళంతా కలకత్తా వెళ్ళిపోయారు. ఒక్క రామచరణబాబుమాత్రం వెళ్ళలేదు. ఇంట్లోఉన్న వాళ్లు వెళ్ళి అప్పుడే అయిదారోజులయింది. హటాత్తుగా ఏదో తొందరపని తగలడం మూలాన్ని రామచరణబాబు ప్రయా

ణాము మూసివెయ్యవలసివచ్చింది. రెండుమూడురోజులనించి ఆయన తన పనితొందరలో మునిగున్నాడు. ఇంట్లో ఎక్కువగా కనబడటమే లేదు. ఆయన ఈవేళ పెందరాళే తెల్లవారుఝామున లేచి అచల గది దగ్గిరికివచ్చి "సుగుణా! సుగుణా!" అని పిలవడం ప్రారంభించాడు. అసలే శీతాకాలము. ఆపైన ఇంకా నాలుగుగంటలైనా కాలేదు. ఆ ఇంట్లో అంతవరకూ ఎవ్వరూ లేవలేదు. పిలుపువిని, అచల కంగారుపడుతూ లేచి, చటుక్కున తలుపుతీసి ఆవరలికివచ్చి నుంచుంది. ఇది జరిగిన కొంతసేపటికి సురేశుడుకూడా తలుపుతీసి కళ్ళు నులుముకుంటూ ఆవరలికివచ్చాడు. ఈసమయంలో దంపతులిద్దరూ చెరిఒకగదిలోనించీ రావడంచూసేసరికి రామచరణబాబుకి ఎంతో ఆశ్చర్యంవేసింది. ఆసంగతి సురేశుడు కనిపెట్టలేదు; కాని అచల చటుక్కుని గ్రహించింది.

రామచరణబాబు సురేశుడికేసి తిరిగి కొంత పశ్చాత్తాపపడుతూ "సురేశబాబూ! నాతప్పు క్షమించాలి! వేళగానివేళ ఇంత పెద్దగోడవచేసి మీకు నిద్రాభంగం కలిగించాను" అన్నాడు. ఆమాటమీద సురేశుడు నవ్వుతూ "ఆ! మ్మరేమీ ఇబ్బందిలేదు! అదీగాక నేను మేలుకునేఉన్నాను. లేకపోతే వీథిలోనించి కేకలుపెట్టి లేపడంమాట అల్లాగ ఉండనీయండి. చెవులదగ్గిర రామడోళ్లు వాయించినా నన్ను లేపడం కష్టం! అయితే, ఇంత తెల్లవారగట్లే లేచి మీరెక్కడికి వెడుతున్నారు!" అన్నాడు.

ఆపైన ఆవృద్ధుడు అచలని ఉద్దేశించి, "ఈవేళ కొంత మా సుగుణని లేపవలసిన అవసరం వచ్చింది" అన్నాడు. ఆపైని అచలకేసి తిరిగి నవ్వుతూ "ఇప్పుడు సవారీ సిద్ధంగా ఉంది. నేనిప్పుడే వెళ్ళిపోవాలి. బహుశః రెండుమూడుగంటలకిగాని తిరిగిరాలేను. అందుచేత ఈవేళ ఈ ముసలిప్రాణానికి కొంచెం వంటచేసిపెట్టాలి. లేకపోతే ఆలస్యంగా పొయ్యి అంటించవలసివస్తుంది" అన్నాడు. ఈ మాన

చాలా నైష్ఠికుడు. తన భార్యా కోడలూ తప్ప ఇంక ఎవరు వండినా ఈయన భోజనం చెయ్యరు. అసలు ఆయన వంటఇల్లే వేరు! ప్రతివాళ్లూ ఆ ఇంట్లోకి వెళ్ళడానికి వీల్లేదు! అప్పుడప్పుడు ఆయన స్వయం పాకం చేసుకుంటూ ఉంటారు. అందుచేత ఆడవాళ్ళు పని ఏమీ లేక పుట్టింటికి వెళ్ళి వస్తూంటారు. ఆయన ఈ మధ్యన స్వయం పాకమే చేసుకుంటున్నారు; కాని ఆయన ఈవేళ హఠాత్తుగా అచలని వంట చెయ్యమన్నారు. అచల మొట్టమొదట ఆశ్చర్యపడింది; కాని తరవాత ఆమెకెంతో భయం వేసింది.

రామబాబు ఆమె తెల్ల తెల్లబోవడం చూసి స్నేహపూర్వకంగా "అమ్మా! నువ్వు "ఇదేమిటి? ఈయనిల్లా అంటున్నారేమి" టని ఆశ్చర్యపడుతున్నావులా ఉంది. రాక్షసి వండినవంట భోజనం చెయ్యడానికి అభ్యంతరం లేనప్పుడు నువ్వు వండినవంట భోజనం చెయ్యడానికి మాత్రం అభ్యంతరం ఏముంటుంది! ఏమయినా నాకేగాని అంతపొద్దెక్కి తిరిగి వచ్చి పొయ్యి ఊదుతూ కూర్చోవడం చాలా కష్టం!" అన్నారు. ఆపైన అల్లాగే ఏమీ మాట్లాడకుండా కూర్చోవడం చూసి మళ్ళీ ఒకనవ్వునవ్వి, "అమ్మా! నువ్వు మనస్సులో "ఆచారవ్యవహారాల్లో ఇంత ఔదార్యం ఉంటే ఈయన వంటబ్రాహ్మడిచేత వంటచేయించుకోరాదా?" అని అనుకుంటున్నావేమో! నేను అల్లాంటిదానికి ఒప్పుకునే వాణ్ణిగాను! నా ఆచారవ్యవహారాలు ఎప్పటికీ మారవు! ఆవంటబ్రాహ్మడు ఎప్పుడూ సంధ్యావందనం చెయ్యడు ఆయనవండిన అన్నం నాగొంతుకు దిగదు. నిన్ను చూస్తూన్నప్పుడు కాశీఅన్నపూర్ణలాగ కనిపిస్తూంటావు. అందుచేత నీచేతి అన్నం ఒకసారి తినాలని ఉందమ్మా! ఇంక నేను ఆలస్యం చెయ్యడానికి వీల్లేదమ్మా! ఇంకా ఎన్నో మాటలు చెప్పాలి; కాని అవన్నీ భోజనంచేసేటప్పుడు చెబుతాను" అన్నారు. ఆపైన ఒక్క నిమిషం ఉండి ఆయన వీధిలోకి బయలుదేరారు. అదిచూసేసరికి అచలకి కంగారుపట్టుకుంది. ఆమెకి ఏమనడానికీ ఏమీ తోచిందికాదు. అందు

చేత ఆసమయానికి స్ఫురించినట్టు "నాకు వంటచెయ్యడం అట్టే బాగా రాదు. నేను వండితే మీకు బాగుండదు" అంది. ఆమాటమీద ఆ ముసలాయన ఒకనవ్వు నవ్వి "అమ్మా నువ్వు ఈమాటచెబితే నేను నమ్ముతానని అనుకుంటున్నావా!" అన్నారు. అచల "వంటచెయ్యడం అందరికీ వస్తుందా?" అంది. రామబాబు "అందరికీ వస్తుందని నేను మాత్రం అంటున్నానా!" అన్నారు.

అచల ఈమాటకి చటుక్కుని ఏసమాధానమూ చెప్పలేకపోయింది. అందుచేత ఆమె అల్లాగే నిలబడిపోయింది; కాని సురేశుడికోసం ఇంకా అక్కడనిలబడడం ఆమెకు చాలాకష్టమయింది. సురేశుడు ఆమెకేసి క్రీగంటితో చూశాడు. దానితో అతనికి ఆమె మనస్సులో ఉన్న వేదనఅంతా బోధపడిపోయింది. రామబాబు ఆచారవ్యవహారాలు మంచివయినా కాకపోయినా అతనికి తను వంటచేసిపెట్టడం మంచిదికాదని అచలకి తెలుసును. అయితే, అచల ఇందులోనించి తప్పించుకోడానికి మరిఒకమార్గం ఏమీలేదు! సురేశుడు అచలముఖంచూసి ఇదంతా గ్రహించాడు. ఆపైన కాళ్ళూచేతులూ కడుక్కోవాలని వంకపెట్టి అక్కడినించి గబాగబా కిందికివెళ్ళిపోయాడు.

రామబాబు "సరే! నేనూ వెడతాను" అనిచెప్పి సురేశుడివెనకాల తనుకూడా కిందకిదిగబోయారు. ఒక్కక్షణకాలం అచల మతిపోయినట్లు నిలబడింది; కాని వెంటనే మళ్ళీ తెలివితెచ్చుకుని "నేను చెప్పేద కొంచెంవిని—" అని ఇంకాఏదో అనబోయి ఊరుకుంది. ముసలాయన వెనక్కితిరిగి ఆమెకేసిచూశారు. ఆమెచెప్పవలసినమాట పూర్తిచెయ్యకుండా ఆపివేసి కిందికిచూస్తూ నుంచుంది. అందుచేత ఆయనకొంచెం దగ్గిరగావచ్చి" అన్నట్టు నేను నీతో ఒకమాటచెప్పాలని అనుకుంటున్నానమ్మా! నాతో మాట్లాడడానికి నీకు కొంచెం సంకోచం ఉన్నట్టుగాఉంది. బహుశః వయస్సులో నేను మీనాన్నగారి

కంటె పెద్దవాణ్ణే అనుకుంటాను. అందుచేత నన్ను పెదనాన్నగారూ! అనిపిలుస్తూ ఉండమ్మా!" అన్నారు.

అచలకి రామబాబుకి తనంటే ఎంతో ఆప్యాయతం అన్నసంగతి తెలుసును. రామబాబు అన్నమాటలు వినేసరికి అచలకి కళ్ళమ్మట నీళ్లు వచ్చాయి. అందుచేత ఆమె ఏమీమాట్లాడకుండా ఊకొట్టి తన అంగీకారం తెలియజేసింది. రామబాబు "నువ్వు ఇంకా చెప్పవలసింది ఏమైనా ఉందా అమ్మా!" అని అడిగారు. అచల అల్లాగే ఏమీమాట్లాడకుండా నుంచుందికాని కొంతసేపటికి తనకి ఉన్నబలం అంతా వినియోగించి "మరి మానాన్నగారు బ్రహ్మసమాజస్థులు అందుచేత సందేహిస్తున్నాను." అంది. రామచరణబాబు ఆమాట విని చటుక్కుని ఉలిక్కిపడి "కలకత్తాలో ఒకతరహా బ్రహ్మసమాజస్థులుంటారు. వాళ్ళు బ్రహ్మసమాజస్థుల్లో కలిసి హిందువుల్ని నానా తిట్లూతిడతారు. అల్లాంటి తిట్లు అసలైన బ్రహ్మసమాజస్థులుకూడా తిట్టరు! ఆపైన ఇళ్లకివెళ్లి బ్రహ్మసమాజస్థుల్నిగురించి అనరాని మాటలు అంటూంటారు. అల్లాంటిమాటలు హిందువులైనా అంటారో అనరో సందేహమే! అయితే మీనాన్నగారు అల్లాంటివారు కారనుకుంటాను! అల్లాగ అయితే నాకు ఏఅభ్యంతరమూఉండదు" అన్నారు.

అచల ముఖం సిగ్గుచేత బాగాఎర్రబడింది. ఆమె "ఆయన అల్లాంటివారు కారు! సజమైన బ్రహ్మసమాజస్థులే" అంది. ఆజవాబు విన్నాక రామచరణబాబు మళ్ళీ కొంతఅనుమానంలో పడ్డారు. కాని ఒక్కనిమిషంఉన్నాక ఆయనముఖం మళ్ళీ ప్రసన్నమయింది. ఆయన ఒక్కనిమిషం ఊరుకుని "సరే ఆయనబ్రహ్మసమాజస్థులయితే కావచ్చును. అంతమాత్రంచేత కుమార్తె కేమీ ఇబ్బంది లేదు. అదీగాక నువ్వు వివాహంచేసుకున్న వ్యక్తి హిందువుడేకదా! ఆయన మెడలో యజ్ఞోపవీతం ఉంది. ఆయన ఇంకా యజ్ఞోప

-పీతం తీసెయ్యలేదు. అందుచేత మీ తండ్రిగారు ఏమిచేసినా నిన్నంటడు. సరదా! ఈ వేళనువ్వు ఎన్నితమాషాలుచేసినా నేను నీమాయలో పడదలుచుకోలేదు. ఈవేళనువ్వు నాకు వంటచేసిపెట్టి తీరాలి! ఇందుచేతనేలాఉండు. నువ్వు ఆవేళ ఉపవాసంచెయ్యడానికి ఇష్టపడలేదు, అవునా? నేనీవేళ దానిసంగతి ఏదో కనుక్కుంటాను' అని మళ్ళీ వెళ్ళబోయారు. అదిచూసి అచల మళ్ళీ కొంతధైర్యం తెచ్చుకుని 'పెదనాన్నగారూ! నేనొకవేళబ్రహ్మసమాజస్థురాలినయితే మీరు నాచేతిఅన్నం తినరా?'' అని అడిగింది. రామబాబు "తినను. మనకిప్పుడు ఆగొడవ లేనేలేదు. అందుచేత నువ్వు బ్రహ్మసమాజస్థురాలివి కానేకావు'' అన్నారు.

అచల ''ఒకవేళ నేను బ్రహ్మసమాజస్థురాలినే అనుకోండి. నామతం వేరైనంతమాత్రాన్నే నేను అస్పృశ్యురాలినై పోతానా'' అంది. రామబాబు "నువ్వు అస్పృశ్యురాలివి ఎందుకవుతావమ్మా! అస్పృశ్యురాలివి కావు! కాని నీచేతిఅన్నంమాత్రం తినడానికి వీల్లేదు'' అన్నారు. అచల ఈవిషయంలో అనేకవిషయాలు తెలుసుకోవాలని అనుకుంది. అందుచేత ఆమె ఊరుకోలేక "ఎందుకు తినడానికివీల్లేదు? నాచేతిఅన్నం తింటే మీకు అసహ్యం వేస్తుందా?'' అని అడిగింది. ముసలాయన ఆమాటకి చటుక్కుని సమాధానం చెప్పలేకపోయారు. ఊరికే అచలముఖంకేసి చూస్తూనుంచున్నారు.

అచల తనసంకోచం అంతా విడిచిపెట్టి "మీవంటివారు ఇల్లాగ మాట్లాడడంచూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. మీకు బ్రహ్మసమాజస్థులంటే ఇంత అసహ్యం కలగడానికి కారణంఏమిటి?'' అంది. ఆమాటవిని రామబాబు ఉలిక్కిపడి "నాకు బ్రహ్మసమాజస్థులంటే అసహ్యమా? నీకీమాట ఎవరు చెప్పారు'' అన్నారు. అచల మీరు ఎవరిచేతిఅన్నం తినరో వాళ్ళంతా

మాకు అస్పృశ్యతా! ఎంతలేదన్నా మాకు కొంతవరకు శాస్త్రీయ అసహ్యమన్న మాటే! చాలాకాలంనించి ఇది మాకు అలవాటు అయిపోయింది. అందుచేత మాకీవిషయమే తెలియకుండాలేదు. సరే మా నౌకర్ల విషయం అల్లాగ ఉంచండి. మీ వంటబ్రాహ్మడు వండిన అన్నమే మీకు కంఠం దిగదన్నారు. దీనివల్ల ఈ దేశానికి ఎంతహాని—ఎంత అవమానం—జరుగుతూఉందో మీరేమైనా—" అని ఇంకా ఏదో చెప్ప బోయింది.

రామచరణబాబు మాట్లాడకూరుకున్నారు. మధ్య మధ్య అచలకి కలుగుతూన్న ఆవేశంకూడా ఆయన పరీక్షిస్తూనే ఉన్నారు. అచల మాట్లాడడం పూర్తికాగానే ఆయన ఒకచిన్ననవ్వు నవ్వి "అమ్మా! మేము ఎవ్వరినీ ద్వేషించము. నువ్వుచేసిన నిందారోపణ పాశ్చాత్యులుకూడా చేస్తూంటారు. మీనాయనగారు ఈమాటలు వాళ్ళదగ్గిర నేర్చుకున్నారు. ఆయనదగ్గిరనించి నువ్వు నేర్చుకున్నావు. మనిషి భగవంతుడితో సమానుడన్న సంగతి వాళ్ళొక్కళ్ళకే తెలుసు నని నువ్వు అనుకుంటున్నావులా ఉంది. ఈవిషయం మనవాళ్ళందరికీ తెలుసును" అన్నారు. సరిగ్గా ఈ సమయానికి కిందనించి ఒక అస్పష్టమైన కోలాహలం వినబడడం మొదలుపెట్టింది. రామ బాబు కొంచెంసేపు ఆకోలాహలం విని "సురమా! భోగపరాయణత్వమే వాళ్ళప్రధానలక్ష్యము. వాళ్ళకీ మనకీ సరిపడదు. వాళ్లు అన్న పానాలవిషయంలో ఎంతో శ్రద్ధపుచ్చుకుంటారు. మనం ఆవిషయా లలో అట్టే ఎక్కువశ్రద్ధ చూపించము. ఈవేళ ఎల్లాగయినా నీకు వంటచెయ్యడం తప్పదు. మాకు ఎవరిమీదా అసహ్య భావంలేదు. దేశం అధోగతి పాలవడానికి కారణాలు వేరే ఉన్నాయి. కావలిస్తే ఆవిషయాలన్నీ మనం భోజనాలవేళ మాట్లాడుకుందాము. ఆపక్కని ఎందుచేతనోగాని పెద్దగొడవ అవుతూంది. నేనింకఉండ

దానికి వీల్లేదు. వెళ్ళిపోతున్నాను" అని గబగబా నడుచుకు వీధిలోకి వెళ్ళిపోయాడు.

## ౩౪

అప్పుడే ఇంచుమించుగా మూడుఝాములయింది. రామబాబు భోజనంచేసి హుల్లిగా లేస్తూంటే అచల అతికష్టంమీద ఒక నవ్వు నవ్వి "బాబుగారూ! చెప్పవలసినమాట నేను ఇప్పుడేచెబుతున్నాను. ఒకనాడు మీకు మాకులంఅంతా పాడైపోయిందని తెలుస్తుందనుకోండి. ఇప్పుడుమీకు కోపంరాదూ?" అంది. రామబాబు స్నేహపూర్వకంగా ఒకచిరునవ్వు నవ్వి "అవునమ్మా! కోపంవస్తుంది." అనిచెప్పి చెయ్యికడుక్కోడానికి వీధిలోకి వెళ్ళారు. ఆయన వీధిలోకి వెడుతూంటే ఆయనతొడుక్కున్న పాంకోళ్లు టకటకమని చప్పుడు చేశాయి. అచల ఎంతో ఆసక్తితో ఆచప్పుడు వింటూనుంచుంది. కొంతసేపటికి ఆచప్పుడు క్రమక్రమంగా అంతరించిపోయింది. కాని ఆమెపరధ్యానంగా అల్లాగే నుంచుండిపోయింది. అచలకి ఇల్లాగ జరిగినసంగతి జ్ఞాపకమే లేదు. ఆఇంట్లో చాలాకాలాన్నించి పని చేస్తూన్న ఒక దాసీమనిషి ఉంది. దానికి బంగాళీభాషా, బంగాళీ వాళ్ళ ఆచారవ్యవహారాలూకూడా తెలుసును. అది ఏదోపని మీద ఇప్పుడిక్కడికివచ్చి, అచలకూర్చున్న విధంచూసి ఎంతో ఆశ్చర్యపడింది. అది వయస్సులో అచలకంటె బాగాపెద్దది. అందుచేత తనపెద్దతనం కనబరుచుకుంటూ "ఏమిటమ్మా! ఇల్లాగ కూర్చున్నారు! ఈవేళ భోజనంచెయ్యడం మానేస్తారా! ఏమిటి!" అనిఅడిగింది.

ఆమాటవిని అచల ఉలిక్కిపడి దానికేసి కళ్ళెత్తిచూసింది. ఇంక అట్టేపొద్దులేదు. శీతాకాలంపొద్దు గబగబా తిరిగిపోతూన్నట్లుంది.

ఆకాశంవంకా శాంతివిహీనమై బాగా అలసిపోయినట్లు కనిపించింది. అచల సిగ్గుపడి చటుక్కున లేచి నుంచొని నవ్వి "నేను చీకటి పడ్డాక భోజనం చేస్తాను. ఈవేళ రాత్రిగా ఆకలివేసి" అంది. జానకి ఆశ్చర్యపడి "పెద్దబాబుగారు భోజనం చేసిన తరవాత భోజనం చేస్తానని ఇప్పటివరకూ అన్నారు కదమ్మా!" అంది. అచల "అత్తా ఇంకమీదట భోజనం చెయ్యను. ఏకంగా రాత్రిభోజనం చేస్తాను" అని చెప్పి చటుక్కున అక్కడినించి వెళ్ళిపోయింది. ఏమైనా కొంచెము అవకాశం దొరికితే అచల మేడమీదవరండాలో కుర్చీవేసుకొని కూర్చుని శోణానదికేసి చూస్తూఉంటుంది. ఆమె ఈవేళ రాత్రికూడా అల్లాగే కూర్చుని ఆనదికేసి రెప్పవాల్చకుండా చూస్తూంది. ఇంతలో ఎవరోవస్తూన్నట్లు చప్పుడైంది. అచల అలికిడివచ్చినవైపు వెనక్కితిరిగి చూసింది. రామబాబు అప్పుడే బాగాదగ్గిరికి వచ్చేశారు. ఆపైన ఆయనవచ్చాక గోడదగ్గిరగావేసిన ఒకకుర్చీలాక్కొని కూర్చున్నారు. ఆతరవాత ఒక్కనిమిషం ఊరుకుని ఒకచిన్నినవ్వు నవ్వి "సురమా! మనస్వాకం అటోఇటో తేలిపోవాలి! నేను ఆ మాటనే ప్రత్యేకంగా పనికట్టుకుని ఇక్కడికివచ్చాను. ఈవేళ ఇదిఏదోవిధంగా తేల్చుకుంటేగాని నేను కిందకి దిగదలుచుకోలేను" అన్నారు.

అచల ఇది జాతిభేదానికి సంబంధించిన ప్రశ్న అయిఉంటుందని ఊహించింది. అందుకని "పెదనాన్నగారూ! వాదించడం ఎల్లాగో నాకేం తెలుసును!" అంది. రామబాబు కాదన్నట్లు తలఅడ్డంగాతిప్పుతూ "అమ్మయ్యో! నువ్వేం సామాన్యురాలవా ఏమిటి? మీనాన్నగారూ సామాన్యులు కాదు, నువ్వాయనకూతురువు కాదా! కొంచెం తప్పిపోయిందిగాని లేకపోతే నేనావేళ ఓడిపోవలసినవాణ్ణే!" అన్నారు. అచల మనస్సిప్పుడు ఆలోచించేపరిస్థితిలో లేదు. అందుచేత ఈవాదోపవాదాల్లోప్రవేశించడం ఆమెకిష్టంలేక "అయితే పెదనాన్నగారూ!

మళ్ళీ ఇప్పుడు వాదం ఎందుకు చెప్పండి! మీరింతకుపూర్వం ఎల్లాగా జయించారు! ఓడిపోయినవాళ్ళని మళ్ళీ ఓడిస్తే అందులో మీగొప్ప ఏముంది?" అంది.

రామబాబు ఆమాటకి ఏమీసమాధానం చెప్పలేదు. ఆయనకి అప్పుడే నాలాపనకున్ను చెల్లిపోయింది. ప్రపంచకంలో ఆయన అనేక విషయాలు చూశారు. అచల కంఠస్వరంలో ఉన్న సంకోచం ఆయన గమనించలేకపోలేదు. ఆయనకి అచలజీవితంలో సుఖంలేదనిన్నీ, ఆమె హృదయంలో ఏదో ఒక భయానకవేదన అహర్నిశలు అగ్నిహోత్రంలాగ ప్రజ్వలిస్తోందనిన్నీ తెలిసిపోయింది. ఆపైన ఆయన కొంచెంసేపు మౌనంగా ఉండి, ఎంతో స్నేహపూర్వకంగా "అబ్బే! నువ్వు ఏదో తప్పించుకుపోవాలని చూస్తున్నావు! నేనేదో పెద్దవాణ్ణి అయిపోయాను గదా! అమ్మా! సాయంత్రంవేళ ఒంటరిగా కూర్చుంటే నాకు ఏమీ తోచడంలేదమ్మా! అందుచేత ఏదో ఒకటివాగుతూఉంటే నాకు కొంచెం కాలక్షేపం అవుతుంది అందుకని "ఏవో రెండుమాటలు చెప్పి నీకు కోపం తెప్పించి వాదం పెంచితే ఈసాయంత్రం కాలక్షేపం అయిపోతుంది గదా!" అని ఇక్కడకివచ్చాను; కాని నేనువచ్చిన పన్నాగం నువ్వు కనిపెట్టేశావు" అని చెప్పి హుక్కా తియ్యడానికి చెయ్యిచాపారు.

అచల "ఆయన తిరిగివెళ్ళిపోవడానికి ప్రయత్నంమీద ఆహుక్కా తీసుకుని వెళ్ళిపోతున్నా"రని గ్రహించింది. కిందకి వెళ్ళిపోతే ఆయనకి కాలక్షేపం కావడంకష్టం అన్న సంగతికూడా ఆమెకు తెలుసును. అందుచేత ఆమె లోలోపల ఎంతో బాధపడింది. ఆపైన చటుక్కుని లేచి, ఆయనచేతికిహుక్కా అందిస్తూ "మీకు కులాసాగా ఉన్నంతసేపూ ఇక్కడకూర్చుని హుక్కాపీల్చండి. మీరీపడంగా వెళ్ళిపోతే నేను ఒప్పుకోను!" అంది. రామబాబు మళ్ళీ హుక్కా చేత్తోపుచ్చుకుని నవ్వుతూ "ఏమమ్మాయ్! నువ్వు నన్ను అట్టే బలవంతపెట్టకు! నేను

హుక్కా తాగడం మొదలుపెట్టానంటే మళ్ళీ మానిపించడం కష్టం! నేనెల్లా హుక్కా తాగుతానో నువ్వెరగవు! అంతేకాకుండా రెండుకబుర్లు చెబితేనేముంది. దానివల్ల ———" అని సగంచెప్పి, ఇంకాఏదో చెప్పబోయి మాట్లాడకూరుకున్నారు.

"మాట్లాడక ఊరుకుంటే పొగ విడిచిపెట్టడం కష్టంఅవుతుంది. అవునా? అయితే పోనీ మాట్లాడండి అయితే మీరేవిషయముమీద మాట్లాడుతున్నారో కాస్త చెప్పండి"

రామబాబు నోటితో బాగా పొగవిడిచిపెడుతూ "మొత్తంమీద గట్టిప్రశ్నే వేశావు! ఇల్లాంటిప్రశ్న వేస్తే ఎల్లాంటి మహావక్తఅయినా సమాధానం చెప్పడం కష్టం! నేనొకలెఖ్ఖా!" అన్నారు. అచల "పెదనాన్నగారూ! నేనొకమాట చెబుతున్నాను వినండి! ఈవేళ మీరు నా చేతివంట తినితీరతానని పట్టుపడుతున్నారు. ఒకవేళ రేపు మీకు నేను ప్రపంచకంలో అందరికంటేకూడా నీచురాలినని తెలుస్తుందనుకోండి! అప్పుడేం జేస్తారు? ప్రాయశ్చిత్తంచేసుకుంటారా? ఒకవేళ శాస్త్రాల్లో దానికి ప్రాయశ్చిత్తం ఉండదనుకోండి! అప్పుడు?" అంది. రామబాబు "అయితే తగాదాయేం లేదమ్మా! ఇంక ప్రాయశ్చిత్తంగొడవ లేనే లేదు." అన్నారు.

"కాని అప్పుడుమీకు నాపేరుచెబితే అసహ్యంవేస్తుంది. అవునా? కాదా?"

"ఎప్పుడమ్మా!"

"నాకు కులం ఏదీలేదని తెలిసినప్పుడు" రామబాబు హుక్కా తాగడం మానేసి ఒక్కక్షణంకాలం ఆహుక్కావెలుతురులో అచల ముఖంకేసి చూస్తూకూర్చున్నారు. అల్లాగ నాలుగైదునిమిషాలసేపు ఊరుకుని మెల్లిగా "నువ్వు ఇల్లాగ అంటున్నావుగాని ఈమాటకి అర్థంఏమిటో నాకు బోధపడడం లేదమ్మా! ఒక్కనువ్వన్నమాటేమి

టమ్మా! మాఅమ్మాయికూడా ఇల్లాంటి మాటలే అంటూఉంటుంది. అది "ఈభోజనప్రతిభోజనాల విషయంలో ఉండే పట్టుదలలవల్లే దేశంఅంతా అధోగతిపాలై పోతోం" దని అనేకసార్లు అంది.

అచల ఈమాటవిని లోలోపల ఎంతో ఆశ్చర్యపడింది. ఈ ఇంట్లోకూడా ఇల్లాంటి వాదోపవాదాలు జరుగుతూఉంటాయని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. ఆమె ఒకనిమిషం ఊరుకుని "అయితే ఈమాట అబద్ధం అంటారా?" అంది. రామబాబు ఒకచిన్న నవ్వునవ్వి "ఈమాట అబద్ధమో కాదో నేను చెప్పలేనమ్మా! నామట్టుకి ఈమాటనిజం అనిపించడం లేదు! నేను సామాన్యంగా శాస్త్రాల్లోఉన్నట్టే నడుచుకుంటూ ఉంటానమ్మా! అంతే! ఆచారవ్యవహారాల్లో ఇంకా నియమం ఉన్నవాళ్ళున్నారు! మాగురువుగారు అల్లాంటివారే! ఆయన స్వహస్తపాకం చేసుకుని భోజనంచేస్తూంటారు. ఆయనకి కుమార్తెవండినా పనికిరాదు. దీన్నిబట్టి ఆయనకి కూతురుమీద మంచిఅభిప్రాయం లేదనడం న్యాయమా? పోనీ నువ్వే ఆలోచించు!" అన్నారు. అచల దానికేమీ సమాధానం చెప్పలేకపోయింది. అందుచేత ఏమీ అనలేక మాట్లాడకూరుకుంది.

రామబాబు ఆపైన నాలుగైదు పేల్పులు పీల్చి "అమ్మా! నేను వయస్సులో ఉన్నప్పుడు చాలాదేశాలు చూశాను. అనేకరకాలైన ఆచారవ్యవహారాలుకూడా చూశాను. కొన్నిచోట్ల ఈభోజనాల విషయంలో పట్టింపులున్నాయి. కొన్నిచోట్ల ఆపట్టింపులు లేనేలేవు! కొంతమందికి అసలు ఈగొడవలే తెలియవు! కాని నాకు ఆచారాలు లేనివాళ్ళంతా చాలా అసభ్యంగా కనిపించారు" అన్నారు. ఆతరవాత మూడునాలుగైదుపేల్పులుపీల్చి ఆహుక్కాగొట్టం ఒకమూల ఉంచారు. అచల పూర్వంమోస్తరుగా అల్లాగే నిశ్శబ్దంగా కూర్చుంది. రామబాబుకూడా కొంతసేపు ఏమీ మాట్లాడకుండా కూర్చున్నారు.

కాని ఆపైనమళ్ళీ తిన్నగాకూర్చుని "సురమా! నేను అసలుసంగతి ఏమిటో చెప్పనా? మీరంతా అంగ్లేయులదగ్గిర పాఠాలు చదువు కున్నారు. వాళ్ళిప్పుడు అందరికంటే గొప్పవాళ్ళు. వాళ్ళే మనకిప్పుడు ప్రభువులు వాళ్ళదగ్గిర బాగా డబ్బుకూడా ఉంది. వాళ్లుకాళ్లుపైకెత్తి చేతులతోనడిస్తే మీరుకూడా అల్లాగే నడవాలంటారు అల్లాగచెయ్యక పోతే గొప్పతనం రాదంటారు!" అన్నారు.

అచల ఈవిధమైన వాదోపవాదాలు పత్రికల్లో ఇదివరకు చదివింది. అందుచేత ఆమాటలకి ఏమీసమాధానం చెప్పలేను. ఊరికే నవ్వి ఉరుకుంది. రామబాబు ఆమెనవ్వడం చూశారు; కాని చూడనట్టుగా నటించి తనుచెప్పిన మాట సమర్థించుకుంటూ "నేను ఒకసారి జగన్నాథం వెళ్లాను. అక్కడ ఉన్నప్పుడు నాకు అనేకమందితో పరిచయము కలిగింది. అక్కడ మడీ, ముట్టుకోకపోవడమూ అనే మాటలే లేవు. అసలు చాలామందికి ఈవిషయాలు తెలియనే తెలియవని చెప్పవచ్చును. ఒకళ్ళని అసహ్యించుకోవడంవల్ల ఈ ఆచారవ్యవహారాలు బయలుదేరుతాయని అంటే నేనంగీకరించను! అల్లాఅయితే నేను మాత్రం ఆచారవ్యవహారాలు అవలంబిస్తానా? దరిద్రుల్ని చూస్తే నాకు మాత్రం జాలికలగడంలేదూ?" అన్నారు.

అచల ఆమాటకి ఎంతోబాధపడి కంగారుపడుతూ "పెదనాన్నగారూ! మీసంగతి నాకుమాత్రం తెలియదూ! మీరు ప్రత్యేకంగా చెప్పాలా? మీకున్నంతదయ ప్రపంచకంలో ఇంకెవరికుంది?" అంది.

"అది దయకాదమ్మా! అది ప్రేమ! నాకు దీనులన్నా దరిద్రులన్నా ఎంతోప్రేమ! ఒకమనిషిగాని, ఒకజాతిగాని—" అని ఇంకా ఏదోచెప్పబోయారు; కాని ఆయన ఆమాట పూర్తిచెయ్యడానికి వీలే లేకపోయింది.

ఇంతలో వెనకభాగంలో జోళ్ళచప్పుడయింది. రామబాబు చటు

కున్నాని వెనక్కితిరిగి చూశారు. సురేశుడు ఎదురుగుండా వచ్చి నిలబడ్డాడు. రామబాబు అతన్ని చూస్తూ "అయితే సురేశబాబూ! మీరు హిందువులేకదా! మీరుజాతిభేదం పాటిస్తారా?" అన్నారు. సురేశుడాప్రశ్నవిని కంగారుపడ్డాడు. అతను ఏమిమాట్లాడితే ఏమివస్తుందో అనేభయంచేత ఎంతో జాగ్రత్తగా ఉంటున్నాడు. అయితే రామబాబు వేసినప్రశ్నకి అర్థమేమిటి? తీరాచటుక్కుని ఆలోచించకుండా సమాధానంచెబితే ఏమివస్తుందో! ప్రతీదీ జాగర్తగా ఆలోచించి మరీమాట్లాడాలి. అందుచేత అతను ఝుడుస్తూఝుడుస్తూ అచలదగ్గిరికి వచ్చినుంచున్నాడు. ఆతరవాత రామబాబువేసిన ప్రశ్నకి అర్థంఏమిటో తెలుసుకోవాలనే ఊహతో అచలకేసి ఒకసారిచూశాడు; కాని ఆమె అభిప్రాయం అతనికి బోధపడలేదు. అప్పుడు కొంత లేనినవ్వు తెచ్చుకుని గోడమీద పిల్లివాటంగా "మేము ఎల్లాంటివాళ్ళమో మీకు తెలియదేమిటి!" అన్నాడు.

ఆసమాధానంవిని రామబాబు "నాకు తెలియకపోలేదు! నాకు తెలుసును; కాని మీభార్యమాత్రం మొదటినించి చివరదాకా తల్లకిందులుగా మాట్లాడుతూంది. ఆమె ఈజాతిభేదాలు ఉండడం చాలాఅన్యాయం అంటుంది. ఎల్లాంటి పరిస్థితుల్లోనైనాసరే వీటిని అంగీకరించకూడదని ఆమెఅభిప్రాయము. మేచ్ఛులచేతిఅన్నం తిన్నా తప్పులేదని ఆమెవాదం. ఈవిషయాలన్నీ ఆమె చిన్నప్పటినించీ తనతండ్రిగారివల్ల నేర్చుకుంది. ఆమెచేతిఅన్నం తింటే నాకులం పోతుందా పోదా! కులంపోయినప్పుడు తిరిగి ప్రాయశ్చిత్తం చేసుకుంటే సరిపోతుందా సరిపోదా! ఈమొదలైన విషయాలని గురించి మేము చర్చించుకుంటున్నాము. ఈవిషయంలో మీఅభిప్రాయం ఏమిటి?" అన్నారు.

సురేశుడు ఆప్రశ్నవిని నిర్ఘాంతపోయి నుంచున్నాడు. అంతేనేగాని

ఏ సమాధానమూ చెప్పలేదు. అచలముఖంపైకి పట్టిచూస్తే ఆమె రాత్రింబగళ్లు ఏదోవిషయాన్ని గురించి కలవరపడుతూన్నట్టు కనబడింది. ఆమె ఈవిధంగా కలవరపడుతూండడం ఒకకొత్తవిషయము కాదు. కాని అతనికి ఆమె ఎంతఎక్కువగా బాధపడుతూందో తెలియలేదు. అతను తెలుసుకోడానికి ప్రయత్నించాడుగాని ఏమీ ఉపయోగం లేకపోయింది. అందుచేత అతను మొట్టమొదట బాగానిరుత్సాహం తెచ్చుకొని లేనినవ్వు తెచ్చిపెట్టుకోడానికి ప్రయత్నించాడు. ఆప్రయత్నంవల్ల నవ్వు రాలేదు. పైగా ముఖంఅంతా వికారంగా తయారైంది.

సురేశుడు "ఆవిడ మీతో వేళాకోళం ఆడుతూంది." అన్నాడు. ఆమాటమీద రామబాబు గంభీరభావం వహించి "ఈవిషయాల్ని గురించి చర్చించడంవల్ల ఉపయోగంలేకపోయినా ఏదో నాకు తోచినవి రెండుమాటలు చెప్పాను. అయితే ఒకవిషయంమాత్రం చెప్పాలి. మీకు తులసితీర్థం ఇవ్వవలసి వచ్చినప్పుడు సురమతో నేను ఉపవాసం ఉండమని చెప్పాను. సురమ ఉపవాసం ఉండలేదు. ఇదివేళాకోళం అని ఊరుకోడానికివీల్లేదు. వేళాకోళమే అయితే చాలా కఠినమైన వేళాకోళం అన్నమాట అయితే సురేశబాబూ! మీవివాహం హిందువుల సంప్రదాయం ప్రకారమే జరిగిందా?" అన్నారు. సురేశుడు 'అవును' అన్నాడు.

రామబాబు మళ్ళీ చిరునవ్వునవ్వి "అవును! ఈసంగతి నాకు తెలుసును." అన్నారు. ఆపైన అచలకేసి చూసి "నీతోనేను ఎన్నో విషయాలు చెప్పాలనిఅనుకుంటున్నానమ్మా! మీనాన్నగారు బ్రహ్మసమాజస్థులే అనుకో! దీనివల్ల నేనేమీ బాధపడడం లేదు. ఆయనలాంటి బ్రహ్మసమాజస్థుల్ని నేను చాలామందిని ఎరుగుదును. వాళ్ళంతా సమాజంలోకివెళ్ళి కళ్లుతుడుచుకుంటూ ప్రార్థిస్తూ ఉంటారు.

ఏవేవో అనాచారపు పనులుకూడా చేస్తూంటారు. కాని కూతుళ్ల పెళ్లిళ్లు వస్తేమాత్రం తమజాగ్రత్తలో తామరుంటారు. పోనీలే! అగౌడవంతా ఇప్పుడెందుకు?" అన్నారు. ఆమాటలు వినడంవల్ల సురేశుడికికూడా కొంతఉత్సాహం కలిగింది. అందుచేత అతను తత్క్షణం రామబాబుమాటల్లో మాటకలిపి "మీరు చెప్పింది అక్షరాలా నిజం. ఈరోజుల్లో ఇల్లాంటి బ్రహ్మసమాజస్థులసంఖ్య నానాటికీ హెచ్చిపోతూంది. వాళ్లు—"అని ఇంకాఏదో అనబోయాడు.

కాని రామబాబూ సురేశుడూ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు. అతనిమాటమధ్యలో అచలకంఠస్వరం ఒక పెద్దఉరుములా వినిపించింది. అచల సురేశుడివైపుకి తీవ్రంగాచూసి "ఇన్నితప్పుపనులు చేసిన తరవాత మళ్ళీఒక తప్పుపని చెయ్యడానికి మీకు సిగ్గువెయ్యడం లేదూ! ఈమాట నాముఖంఎదురుగుండానే అంటున్నారా! మీరు చెప్పేమాటలన్నీ అబద్ధాలని మీకు తెలుసును. మానాన్నగారు ఒట్టి డాంబికం మనిషి కాదన్నసంగతి మీకు తెలియదా? ఆయన త్రికరణ శుద్ధిగా బ్రహ్మమతం అవలంబిస్తున్నారు. ఆమాట మీకు మాత్రం తెలియదా?" అని చటుక్కుని కుర్చీలోంచి లేచినుంచుంది.

సురేశుడు మొట్టమొదట అచలఅన్నమాటలను విని కంగారు పడ్డాడు; కాని ఆశ్చర్యపడుతూన్న రామబాబుకేసి చూసేసరికి అతనికి కోపంఆగిందికాదు. అందుచేత "నే నన్నమాటలు అబద్ధమా? మీనాన్నగారు కూతుర్ని హిందువుకిచ్చి వివాహం చెయ్యడానికి అంగీకరించలేదా?" అన్నాడు. అచల ఈమాటకి ఏమీ జవాబులు చెప్ప లేదు. ఒక్కక్షణకాలం కొంచెంతమాయించి మళ్ళీమెల్లిగా "ఈమాట మీరు నన్నెందుకడుగుతారు? దీనికంతకీ కారణంమీరే అయినప్పుడు ఆకారణంమాత్రం మీకు తెలియదా? నేనిల్లాంటిదాన్నో మా నాన్నగా

రెల్లాంటివారో • మీకు తెలియదా! ఈవిషయంలో ఇప్పుడు నాతో వాదిస్తూ కూర్చోవడం నాకిష్టంలేదు. ఇంతేగాదు, ఈమాట తల పెట్టడానికికూడా నాకు సిగ్గుగాఉంది. మీయిష్టంవచ్చినట్లు చేస్తూ మీరు మాట్లాడుతూకూర్చోండి. మీమాటలుమాత్రం నేను వినదలచుకోలేదు. ఇదిగో నేను వెళ్ళిపోతున్నాను." అని చెప్పి ఆమె గదిలోంచి బయలుదేరి గబగబా ఆపక్కనున్న గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోయింది గాని అక్కడ మిగిలిఉన్న స్నేహితులిద్దరూ మాత్రం కొంచెం సేపటిదాకా నిర్ఘాంతపోయికూర్చున్నారు.

రామబాబు చుట్టకోసం ఒకసారి పరధ్యానంగా చెయ్యి జాపారు. కాని చేతికి ఏమీ తగలకపోవడంమూలాన్ని మళ్ళీ యథా ప్రకారంగా కూర్చుని మెల్లిగా గొంతుకు సవరించుకుని "సురేశ్ బాబూ! ఈవేళ మీఇంట్లో ఎల్లాఉంది" అని అడిగారు. సురేశుడుకూడా కొంచెం పరధ్యానంగాఉన్నాడు. కాని ఈప్రశ్న వినగానే చటుక్కుని ఉలిక్కిపడి "ఆఁ బాగానేఉందండి" అన్నాడు. ఆతరవాత అతనికి తనఇంట్లోఉన్న బాధ జ్ఞాపకంవచ్చింది. అందుచేత "గుండెల్లో మాత్రం కొంచెం నెప్పిగాఉంది. మళ్ళీ నిన్నటినించి కొంచెం ఎక్కువైనట్లు కనిపిస్తూంది" అన్నాడు. రామబాబు "పోనీ మీరే ఆలోచించండి. ఇంతరాత్రిదాకా ఈచలిలోతిరగడం బాగుందా! ఇల్లాచేస్తే నెప్పి రాకేంచేస్తుంది!" అన్నారు.

"అబ్బే! నేను వీధులమ్మట ఊరికే తిరగడంలేదండీ! ఆ ఇల్లు కొనడానికి రెండువేలరూపాయలు బజానాఇచ్చివచ్చాను"

ఆమాట విని రామబాబు ఎంతో ఆశ్చర్యపడి "ఆవడిబిడ్డున ఉన్న ఇల్లు చాలామంచిదే! కాని నన్నడిగితే ఆయిల్లు కొనవద్దని సలహా ఇస్తాను, ఆవేళ మాటలధోరణినిబట్టి సురమకి ఇక్కడఉండడం బొత్తిగా ఇష్టంలేదని నేననుకున్నాను" అని మళ్ళీఒకచిరునవ్వునవ్వి "ఈవిషయంలో

సురమ అభిప్రాయం ఏమిటో కనుక్కున్నారా? లేకపోతే కేవలం మీరొక్కరూ ఆలోచించుకుని కొన్నారా?" అన్నారు. సురేశుడు ఈప్రశ్నకి సూటిగా సమాధానంచెప్పకుండా "ఇక్కడ ఉండకపోవడానికి అట్టే పెద్ద కారణాం కనపడదు. అదీగాక సంసారానికి సంబంధించిన సామానులన్నిటికీ కలకత్తాలో ఉన్న ఒకకంపెనీకి ఆర్డరిచ్చాను. ఈవేళో రేపో ఆసామానులన్నీ వచ్చేస్తున్నాయికూడాను" అన్నాడు.

ఆమాట విని రామబాబు కొంతసేపటిదాకా మాట్లాడకూరుకున్నారు. ఆపైన మళ్ళీ ఏమని ఆలోచించుకున్నారో గాని గట్టిగా "అమ్మా! సురమా!" అని కేకవేశారు. అచల ఆమాటకి సమాధానమేమీ చెప్పలేదు, గాని గదిలోనించి చటుక్కున ఇవతలికివచ్చి కుర్చీమీద కూర్చుంది. రామబాబు ఆమెకేసి చూస్తూ ఎంతో ఆప్యాయంగా "మీఆయన మాం దేశంలో ఒక పెద్దఇల్లుకొన్నారు! కాని నువ్వుమాత్రం మీ పెదనాన్న గారినివిడిచిపెట్టి ఎక్కడికీ వెళ్ళడానికివల్లగాదు!" అన్నారు. అచల ఆమాటవిని మాట్లాడకూరుకుంది.

రామబాబు మళ్ళీ "ఒట్టిఇల్లూ, సామానులూ మాత్రమే అని అనుకుంటున్నావేమో! అంతేకాదు. గుర్రపుబగ్గీ గుర్రమూకూడా వస్తున్నాయని తెలిసింది. ఇవన్నీ నీకోసమే అనికూడా నాకు తెలిసింది" అని నవ్వుతూ ఒకసారి సురేశుడికేసీ, ఒకసారి అచలకేసీ చూశారు. అచల ముఖం గంభీరంగానే ఉంది. ఆమె పెదవులమీద హాస లేశమైనా కనబడలేదు. అక్కడ కొంచెంచీకటిగా ఉండడంచేత ఈసంగతి ఎవ్వరూ కని పెట్టలేకపోయారు. రామబాబు నిశితదృష్టికిమాత్రం ఆవిషయం చటుక్కుని కనబడిపోయింది. అయినాగాని ఆయన అసలుసంగతి ఏమిటో కనుక్కోవాలనే ఉద్దేశంతో "అమ్మా! సురమా! అయితే నీ అభిప్రాయం ఏమిటో కనుక్కోకుండా—" అని సగం సగం అడిగి ఊరు

ఈమాటకి మాత్రం అచల "పెదనాన్నగారూ! ఇందులో

నాఅభిప్రాయం కనుక్కోవలసిన జరూరు ఏమీలేదండి!" అంది.

ఆమాట విని రామబాబు చటుక్కుని "అదేమిటమ్మా! అల్లాగ అంటావు. ఆయనకి నీకంటె ఎవరున్నారు! అంతా నీఇష్టప్రకారమే—" అని ఇంకా ఏదో అనబోయారు; కాని ఇంతలో అచల చటుక్కుని లేచినుంచుని "కాదు పెదనాన్నగారూ! ఇందులో నాఇష్టం ఒక్కటీలేదు! మీకు సంగతులన్నీ తెలీదు! నేనుఇప్పుడు అవన్నీ చెప్పడానికి సిద్ధంగాలేను. ఇంక ఇక్కడ నాఅవసరం ఏమీలేకపోతే నేను వెళ్ళిపోతాను!" అంది. ఆపైన రామబాబు ఏమీమాట్లాడలేదు. ఆతరవాత ఆయన మాట్లాడడానికి అవసరం మాత్రం ఏముంది. ఇంతలో ఒకదాసీది గరిటనిండా నిప్పులువేసుకుని చటుక్కుని అక్కడకి వచ్చింది. అప్పుడు అక్కడఉన్న వాళ్ళఅందరిదృష్టీ దానిమీదపడింది. సురేశుడు అదిచూసి నిర్ఘాంతపడి "నేను వంటమనిషిని నిప్పులుతీసుకుని రమ్మన్నాను. వాడాపని ఈదాసీ దాని నెత్తిమీద పడవేసి వెళ్ళిపోయినట్టు కనిపిస్తూంది ఈవేళ నాకు మళ్ళీ నెప్పి ఎక్కువైనట్టు —" అని ఏదో చెప్పబోయాడు; కాని అతను ఆవిధంగా వివరించిచెప్పవలసిన అవసరం లేకపోయింది. అయితే సురేశుడికి ఇంకొక మనిషి సహాయంకూడా కావలసివచ్చింది. అది కని పెట్టి రామబాబు అచలకేసి చూశారు. వెంటనే అచలముఖం ఇంకొక పక్కకి తిప్పి "నేను వెడుతున్నాను" అని సమాధానంకోసం ఎదురు చూడకుండా చటుక్కుని అక్కడనించి వెళ్ళిపోయింది. ఆఉత్తరక్షణంలో ఆపక్కనున్న గదితలుపు గడియవేసిన చప్పుడయింది.

రామబాబు మెల్లిగా కుర్చీలోనించి లేచి నుంచుని దాసీదాని చేతులోఉన్న నిప్పులగరిటె చేత్తోఅందుకుని "అయితే నడవండి సురేశ బాబూ!" అన్నారు.

"మీరు కాస్తారా?"

రామబాబు "అవును; నేను కాస్తాగా. నాకు కొత్తగాని అనేది ఏదీ లేదు ఈపని నేను అనేకసారులు చేశాను" అని సురేశుడి చెయ్యి పట్టుకుని కొంచెం ఇంచుమించుగా బలవంతంగా ఒకగదిలోకి తీసుకువెళ్లారు. ఆపైన నిప్పులగరిటె కింద పెట్టి, శుభ్రపరచిన సూది సురేశుడి ముఖం కేసి ఒక క్షణకాలం చూశారు. ఆతరవాత అతనిచెయ్యిపట్టుకుని గద్గదస్వరంతో "సురేశబాబూ! ఇల్లాగ ఎప్పటికీ జరగడానికివీల్లేదు. ఏమైనా సరే! తప్పకుండా ఏదో జరిగిఉండాలని నేననుకుంటున్నాను. మీ ఇద్దరికీ మధ్యని ఏదో జరిగిఉండాలి! అదేమిటో నాతో చెప్పండి! —అవసరం అయితే నేనుకూడా ఒకసారి—" అని ఏదోచెప్పబోయి చటుక్కుని మాట్లాడక ఊరుకున్నారు. సురేశుడు ఉలకకుండా పలకకుండా ఊరుకున్నాడు. కాని చిన్నపిల్లవాడి పెదవుల్లాగ అతనిపెదవులు వణకడం ప్రారంభించాయి. ఆపైన అతనికళ్లల్లో రెండుకన్నీటిబిందువులు కనిపించాయి. అవి కనబడిపోతాయేమో అనే భయంచేత అతను చటుక్కుని ముఖం తిప్పివేసుకున్నాడు.

## ౩౮

సురేశుడు ఒకమంచంమీద పడుకునిఉన్నాడు. రామబాబు అతనిపక్కని ఒకకుర్చీమీద కూర్చుని మెల్లిగా అతనిగుండెమీద కాపడం పెడుతున్నారు. ఇంతలో చటుక్కుని తలుపుతెరచిన చప్పుడయింది. ఇద్దరూ ఒక్కసారిగా ఆవైపుచూశారు. అచల చటుక్కుని తలుపుతెరుచుకుని అక్కడనిలబడింది! ఆమె ఒక్కనిమిషం ఆవిధంగా నిలబడి "పెదనాన్నగారూ! చాలారాత్రిఅయింది. మీరింక వెళ్ళిపడుకోండి" అంది. రామబాబు "ఇందాకటినించీ నేను నీకోసమే ఎదురుచూస్తున్నానమ్మా!" అని చటుక్కుని లేచినుంచుని సురేశుణ్ణి ఉద్దేశించి "ఇంతవరకూ మనం నానాఇబ్బందీ పడ్డాము. ఇల్లాంటిపనులు మీరూ నేనూ చెయ్య

వలసినవా?" అన్నారు. ఆ పైన కుర్చీ అచలకి దగ్గరగా లాక్కుని ఇదివరకు చెయ్యవలసిన పనో వాళ్ళే చెయ్యాలిగాని, ఇతరులవల్ల ఏమవుతుంది? "ఇదుగో నమ్మా! ఇల్లా రా! ఇక్కడకూర్చో! నేను వెళ్ళి కొంచెం సేపు సుఖముగా నిద్రపోతాను" అన్నారు. ఆ పైన ఒక పెద్ద ఆవలింత ఆవలించి గబగబా చిటికెలు వేసి వాలుకాళ్ళ చెప్పులు తొడుక్కుని మెల్లిగా గది గుమ్మం దాటి, తలుపులు రెండూ దగ్గరగా వేశారు. ఆ తరవాత తలుపు సందులలోనుంచి సురేశుడికేసి చూస్తూ "సురేశబాబూ! నేను కునికిపాట్లు పడుతూపడుతూ కాలో చెయ్యో కాల్చుకుంటానేమో అని భయపడ్డాను! అంతపని జరగలేదు. అదృష్టవంతుణ్ణి" అన్నారు.

సురేశుడు ఆమాటకి ఏమీ సమాధానం చెప్పలేదు. మూతలు పడిపోతూన్న కళ్ళమీద రెండుచేతులూ జోడించి ఒక్కనమస్కారం పెట్టాడు అంతే! ఆతరవాత అచల రామబాబు ఇంతవరకూ కూర్చున్న కుర్చీమీద కూర్చుని ప్లానలు వెచ్చచేస్తూ మెల్లిగా "మళ్ళీ నెప్పి వస్తోందా? ఎక్కడ నెప్పిగా ఉంది?" అనిఅడిగింది. సురేశుడు కళ్ళు తెరవనూలేదు. సమాధానంచెప్పనూలేదు. చేతితో "ఎడమచేతి పక్కన" అన్నట్టు సంజ్ఞచేశాడు. ఆ పైన గదిఅంతా నిశ్శబ్దమే! అచలకి అతను చివరదాకా ఇల్లాగే మౌనంగా ఉంటాడేమోనని అనిపించింది. కాని చివరకి ఆమె అనుకున్నట్టు సాగలేదు. ఆమె ప్లానలుతో గుండెమీద కాస్తూంటే సురేశుడు చటుక్కుని ఆమె చెయ్యి పట్టుకుని గుండెకి అద్దుకున్నాడు. అచలముఖంమీద ఏవిధమైన ఉద్వేగమూ కనబడలేదు. బహుశః పైకి అల్లాగే కనబడాలని ఆమె అనుకుని ఉండవచ్చును. ఆ పైన అచల మళ్ళీ "ఇంకా వేడిగా ఉండవచ్చునా!" అని మాత్రం అడిగింది.

సురేశుడు ఆమెచెయ్యి విడిచిపెట్టివేశాడు. కాని ఆతరవాత లేచికూర్చుని అచలని కుర్చీమీదనించి తనదగ్గిరికి లాక్కుని రెండు

చేతులతోటీ గట్టిగా కౌగలించుకున్నాడు. ఆపైన ఊపిరివిడవడాని కైనా ఖాళీతీకుండా ఆమెమీద ముద్దులవర్షం కురిపించాడు. ఇంతకుపూర్వం ఆమె వ్యవహారంఅంతా మౌనంగానడచిపోతుందని అనుకుంది; కాని ఆమెఅనుకున్నట్టు జరగలేదు. అల్లాగ కొంతసేపు గడిచేసరికి అతనిధోరణిచూస్తే అతనింక ఈజన్మంలో విడిచిపెట్టే టట్టు కనబడలేదు. పైగా మతిపోయినవాడిలాగ అదేపనిగా ముద్దులు కురిపించడం మొదలుపెట్టాడు.

అచల అతనిముద్దుల కన్నిటికీ సహించి ఊరుకుంది. ఆమె వీటికికూడా సిద్ధపడి అక్కడికి వచ్చిందేమోనని అనుకోవడం అంతగా అతిశయోక్తి కాదు. కాని ప్రశాంతంగాఉన్న ఆమెముఖం మాత్రం నల్లరాయిలాగ మొద్దుబారిపోయింది. సురేశుడికి ఒంటిమీద స్పృహలేదు. ప్రపంచసృష్టికి అంతర్భూతమయిన ఒకమహాంధకారం అతనికళ్లు కప్పివేసింది. లేకపోతే అతనికికూడా తనుచేసేపనిలో ఉండే అనౌచిత్యం బోధపడిఉండును. కాని ఎంతసేపటికీ అతనికి ఆవిషయం బోధపడలేదు. చివరికి అలిసిపోయి అతను ఆమెను ముద్దుపెట్టుకోవడం మానేశాడు. అచలకూడా మెల్లిగా అతని కౌగలింతలోంచి విడిపించుకుని తనకుర్చీలో కూర్చుంది.

ఆపైన సురేశుడు ఒక్కక్షణకాలం నిశ్శబ్దంగా ఉండి ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టి చటుక్కుని "ఈ విధంగా ఎంతకాలం ఇక్కడ ఉండడం!" అన్నాడు. ఆతరవాత దానికి ఆమెచెప్పే సమాధానం కోసం ఎదురుచూడకుండా "మీఇబ్బందులు నాకు తెలుసును! కాని నాకష్టసుఖాల సంగతికూడా కొంచెం ఆలోచించాలి!" అన్నాడు. అచల దీనికిసమాధానం చెప్పకుండా "మీరిక్కడ ఇల్లుకొన్నారా?" అంది. సురేశుడు ఆవేశంతో "అదీ మీకోసమే!" అన్నాడు. అచల దీనికికూడా ఏమీ సమాధానంచెప్పక "స్వామీనుల్లా

గుర్రపుబగ్గీకూడా కొన్నారా?" అనిఅడిగింది. ఆ పైన ఏమిఆలోచించిందో కాని మళ్ళీ మాట్లాడలేదు. "ఇవన్నీ ఎవరికి కావాలి! వీటి నన్నిటిని ఎవరు కొనమన్నారు ?" అని అడగగలిగితే బాగానే ఉండును. కాని అచలమాత్రం మరి ఆప్రశ్నలు అడగలేకపోయింది. కాని అల్లాగ ఒక్కనిమిషం ఊరుకుని "మీరు రామబాబుగారికి మానాన్నగారి పేరు చెప్పారా? మా ఇల్లెక్కడ ఉందో కూడా చెప్పేశారా?" అనిఅడిగింది. సురేశుడు "అన్నీ చెప్పలేదే!" అన్నాడు.

"ఇంకా కాచడం అవసరముందా?"

"లేదు"

అచల "అయితే నేను వెళ్ళిపోతున్నాను. నాకు కళ్లు కూరుకుపోతున్నాయి" అంది. ఆపైన నిప్పులగరిటె ఒకమూలపెట్టి తలుపుదగ్గరగాపెట్టి వెళ్లబోయింది. కాని అంతలో సురేశుడు కంగారుపడుతూ చటుక్కునలేచి కూర్చుని "నేను మిమ్మల్ని ఒక్కమాట అడుగుతాను. దానికి సమాధానం చెప్పి మరీ వెళ్లండి. "మీకు ఈ ఊరు విడిచి ఇంకా వేరే ఎక్కడికైనా వెళ్ళాలని ఉందా ? నిజం చెప్పండి!" అన్నాడు. అచల "ఇంకా ఎక్కడికి?" అంది, సురేశుడు "ఎక్కడికయినా సరే! కావలిస్తే మనల్ని ఎవరూ గుర్తుపట్టడానికి వీల్లేనిదేశం వెళదాము! ఏదేశమైనా సరే!" అన్నాడు. పెద్దఆవేశం చేత సురేశుడికంఠస్వరం కంపించింది. అచల ఆసంగతి గ్రహించింది; కాని ఆమెమాత్రం ఏమీ ఆవేశంలేకుండా సహజమైన కంఠస్వరంతో "ఈ దేశంలో మనలని ఎవరూ గుర్తుపట్టలేదు. ఇంతవరకూ ఎవరికీ ఏవిధమైన అనుమానమూ కలగలేదు!" అంది.

ఆమాటమీద సురేశుడికి కొంచెం ఉత్సాహంకలిగింది; కాని అతను కొంతతమాయించి "కాని కొంతకాలానికి ఎవరైనా—"అని సగంసగం అన్నాడు. అచల అంతలో చటుక్కుని అందుకుని

"కొంతకాలానికి ఎవళ్ళైనా కనుక్కుంటారా? కనుక్కుంటే కనుక్కుంటారు. అసలిది ఎక్కడికి వెళ్ళినా తప్పదు.'' అంది. సురేశుడు లోలోపలినించి పొంగిపొంగి వస్తూన్న ఆనందం పట్టలేక "అయితే ఇదే నిశ్చయమన్నమాట. మీ అభిప్రాయముకూడా ఇదేనా? నాతో దాచకుండా ఉన్నదేదో ఉన్నట్టు— " అని సగంసగం చెప్పి మళ్ళీ ఏ కారణంచేతనో చెప్పడం మానేసి ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఇంతలో దభాలుని తలుపు వేసిన చప్పుడయింది. సురేశుడు నిర్ఘాంత పడి పక్కకి చూశాడు. అచల పక్కనున్న తలుపులుతీసికుని చటుక్కుని మాయమైపోయింది.

కొన్నిరోజులనించి ఆకాశం అంతటా మేఘాలు కమ్ముకుంటున్నాయి. ఒక పెద్ద గాలివాన పడితే పట్టవచ్చునన్న సూచనలు కనిపిస్తున్నాయి. సురేశుడు కొన్నకొత్తభవనంలో సామానులూ అవీ సర్దడం పూర్తి అయిపోయింది. కాని వాటిమంచిచెడ్డలు చూసేవాళ్ళెవళ్ళూ కనబడ లేదు. మంచిజాతి గుర్రాలు రెండువచ్చాయి. పెద్దఖరీదుపెట్టి కొన్న గుర్రపుబగ్గీకూడా ఒకటి వచ్చింది. వాటికేసి చూసేనౌకరు సంగతి అడిగేవాళ్ళే లేరక్కడ! మొత్తంమీద ఇల్లాగే రోజులు గడిచి పోతున్నాయి. ఇల్లాగ ఉండగా ఒకనాడు రామబాబు హుక్కాచేత్తో పట్టుకుని అక్కడికివచ్చారు. ఆయన రెండోచేతిలో ఒక ఉత్తరంకూడా ఉంది. ఆయన వచ్చేసరికి అచల ఒక బెత్తపుకుర్చీలో జేలబడి కూర్చుంది. కాని ఆయన్నిచూడగానే చటుక్కుని లేచికూర్చుంది. రామబాబు తనచేతిలోఉన్న ఉత్తరం ఆమెకందిస్తూ "సురమా! ఇదుగోనమ్మా! ఉత్తరం ఇదినీకు. రాక్షసి పంపించింది. అది ఇన్నాళ్ళనించి నీకుఉత్తరం రాయాలని అనుకుందిగాని ఏదోపని తొందరచేత రాయలేకపోయింది. తనని క్షమించమని నిన్నడిగింది. నీకు నమస్కారాలనికూడా చెప్పమంది. నువ్వు దాన్ని తప్ప

కుండా తమిరించాలి!" అన్నారు. ఆతరవాత ఆపక్కనున్న ఒక కుర్చీ లాక్కుని దానిమీద కూర్చుని నడికేసి చూస్తూ గబ గబా హుక్కా తాగడం మొదలుపెట్టారు. కొంతసేపటికి ఆ ప్రదేశం అంతా హుక్కాపొగతో నిండిపోయింది.

అచల ఆఉత్తరం మొదటినించి చివరదాకా రెండుసార్లు చదివి ముఖంఎత్తి రామబాబుకేసి చూసి "అయితే ఎల్లుండి పొద్దున్నే వచ్చేబండిలో వీళ్ళంతా దిగుతున్నారన్న మాట! అయితే పెదనాన్నగారూ! ఈఉత్తరంలో ఉన్న అత్తయ్య ఎవరు? ఆతరవాత ఆరాజపుత్రస్త్రీ, ఆరాజపుత్రుడూ, ఆటుర్యాటరూ వాళ్ళంతా ఎవరు!", అనిఅడిగింది.

ఆమాటమీద రామబాబు నవ్వుతూ "నాలుగుసార్లు వేళా కోళం చెయ్యడానికి ఎంతమాత్రం అవకాశందొరికినా విడిచిపెట్టడు. "మేనత్త అంటే మరివ్వరూకాదు. నాకు వితంతువైన చెల్లెలా ఒకర్తెఉంది. అదే మేనత్త. రాజపుత్రస్త్రీ అంటే దానికూతు రన్నమాట. భండారపురంలోఉన్న భవానీచౌదరి దానిభర్త. అమ్మాయిఉత్తరంలో ఎల్లాగా వ్రాసిందిగాని మొత్తంమీద వాళ్ళఇల్లు చూడ్డానికి మహారాజులఇల్లులాగే ఉంటుంది. రాజపుత్రుడంటే మాచెల్లిలి మనమడన్నమాట. వాడికి ఇంచుమించుగా పదేళ్ళ వయస్సుంటుంది. ఇంక ఆచిట్టచివర వాళ్లెవళ్ళో చూస్తేనేగాని చెప్పడానికి వీల్లేదు. అయితే వాళ్ళంతా నౌకర్లయిఉంటారు. సరే వాళ్లగొడవకేంగాని నేనాలోచించేది వాళ్లుఉండడానికి వీలయిన ఇల్లు సంగతి. మాయిల్లు చాలాచిన్నది ఇదిరాజులకోసం కట్టించిన ఇల్లుకాదు. అసలు ఈసింహద్వారం చూస్తేనే వాళ్ళదగ్గాకి తక్కు వవుతుందేమోనని భయంవేస్తూంది. ఆపైన నౌకర్లూ చాకర్లూ నాలుగురెట్లు ఎక్కువగా ఉంటారుగదా! అందుచేత నేనుశాస్త్ర

మీరాయిల్లుచూరు-" అని ఇంకా ఏదో చెప్పబోయిఊరుకున్నారు

ఆమాటమీద అచల కంగారుపడుతూ "అయితే ఇంట్లో ప్రత్యేకంగా నాళ్లుండడానికి ఏర్పాటు చేయించడానికి వ్యవధిఏదీ! అదీగాక ఇంతదూరంగా ఉంటే వాళ్ళకి సుఖంఏమిఉంటుంది!" అంది. రామబాబు "వ్యవధిలేకేం వ్యవధిఉంది. కాని దానికోసం ఇప్పటినించీ ప్రయత్నించవలసిఉంటుంది. అసలు చోటంటూ ఉంటే ఆపైన ఎవర్ని ఎక్కడ ప్రవేశపెడితే బాగుంటుందో ఆలోచించుకోవచ్చును! ఈసంగతి తెలియగానే సురేశబాబు ఒకబండి కట్టించుకుని తొందరగా అక్కడికి వెళ్ళిపోయారు. ఈపాటికి మీబండి కూడా వచ్చిఉంటుంది. నువ్వోకొంచెం తొందరగా తెమలాలి; ఈలోగా నేనుకూడా శాలువాఅదీ తెచ్చుకుని సిద్ధంగాఉంటాను. సిఇంటివ్యవహారమూ అదీ నువ్వే చక్కబెట్టుకోవాలిగాని మేము చక్కబెట్టలేమమ్మా!" అన్నారు.

అచల ఆమాటవిని కొంచెంసేపు మౌనంగాఉండి మళ్ళీ చటుక్కునిలేచి నిలబడి "నేను చీరకట్టుకుని ఇప్పుడేవస్తాను." అని మెల్లిమెల్లిగా లోపలికివెళ్ళి పోయింది. రామబాబు చెప్పినదానిలో అస్పష్టంగా ఉన్నదిగాని, అసంగతంగా ఉన్నదిగాని ఏదీ కనబడలేదు. ఇప్పుడు ఆవచ్చే బంధువులకోసం ఇల్లు విడిచిపెట్టితను ఇంకో ఇంట్లోకి వెళ్ళవలసినఆవసరం ఏర్పడిందని ఆమెగ్రహించింది. గ్రహించిన తక్షణమాత్రాన్ని ఆమెమనస్సులో ఉన్న బాధ ఎక్కడికిపోతుంది. ఈకొత్తపరిస్థితులన్నీ తలుచుకొంటూంటే ఆమెమనస్సు గానుగులో పెట్టి ఆడినట్టు బాధపడింది.

[illegible]నించీ ఆమె ఎప్పుడూవీధులోకి వెళ్ళలేదు. ఈవేళ [illegible] నిమిషాల్లో వీధులోకి వెళ్ళడానికి తగిన వేషం [illegible] మేడమెట్లు దిగి కిందకివచ్చింది. ఆమెకి ఈ ప్రపంచమంతా

ఏదో చిత్రవిచిత్రంగా ఉన్నట్టు కనిపించింది. చివరికి తన ఆకారం కూడా మారిపోయినట్టే కనబడింది. ద్వారంఅవతల జోడుగుర్రాల బగ్గీ నిలబడిఉంది. ఆబండితోలేవాడు సరికొత్తదుస్తులు వేసుకుని ఆబండికి ముందుకూర్చున్నాడు. అచల బండిఎక్కబోతూంటే వాడు చటుక్కున సమస్కారంచేశాడు. సైసువాడు బండితలుపు తెరచి ఒకపక్కగా నిలబడ్డాడు. రామబాబు మెల్లిగా బండిఎక్కి ముందు సీటులోకూర్చున్నారు. అచలకి ఇదిఅంతా ఒకవిచిత్రమైన స్వప్నం లాగ కనబడింది. ఆమెబండిఅంతా జాగ్రత్తగా పరిశీలించింది. ఆమె కది చాలాఖరీదైన బండిలాగ కనబడింది. దానిలో డాబూదర్పమూ ఏమీకనబడలేదు! అల్లాగ ఆబండికేసి చూస్తూఉంటే ఆమెకళ్ళకది ప్రేమతో బంగారుమలామాచేసినట్టు తళతళలాడుతూ మెరిసింది!

చప్టాచేసినరోడ్డుమీద బండి పరుగెత్తడంమొదలుపెట్టింది. రెండు గుర్రాల డెక్కలూ టకటకలాడుతూ చాలాదూరందాకా ప్రతిధ్వనించాయి ;కాని అచలచెవిలోమాత్రం ఆధ్వని అస్పష్టంగానే ప్రతిధ్వనించింది. ఆమె మనస్సంతాఒక్కసారిగా చెదిరిపోయినట్లయిపోయింది; కాని ఆఉత్తరక్షణంలో రామబాబు కంఠస్వరంవిని ఆమెఉలిక్కిపడింది. ఆయన ముందుకి వేలుపెట్టి చూపిస్తూ "అమ్మా! అదుగో ఆ కనబడుతూన్న భవనంచూశావా? అదే మీఇల్లు. నౌకర్లూ చాకర్లూ అందరూ తమ తమపనుల్లో మునిగిఉన్నారు. సామానులు సర్దడంఅదీ అంతాపూర్తి అయిపోయింది. ఒకటీపడకగది సర్దడంమాత్రం పూర్తికాలేదు. నేను నౌకర్లతో ఆగదిఒకటీమాత్రం సర్దవద్దని చెప్పాను. సురేశబాబు ఇక్కడికి వస్తూంటే, నేను ఆయనతో "సామానులు ఏగదిలో ఎల్లాగ సర్దినా నా కభ్యంతరంలేదు. మా అమ్మాయి పడకగది సర్దడంలో మాత్రం మీరెవ్వరూ కలగజేసుకోవద్దు." అని చెప్పాను" అన్నారు. ఆపైన ఆయన సిగ్గుపడుతూన్న అచల ముఖంకేసి చూడాలని ఆమెకేసి

చూశారు. అల్లాచూసిన ఉత్తరక్షణంలో ఆయన మనస్సులో బయలు దేరిన ఉత్సాహంఅంతా ఒక్కక్షణంలో అంతరించిపోయింది.

అచల రామబాబుముఖంలో కనబడిన నిరుత్సాహానికి కారణంఏదో కనిపెట్టేసింది. అందుచేత బండి భవనందగ్గిరికి వచ్చి ఆగేదాకా ఆమె తన ముఖం రామబాబుకి కనబడకుండా ఇంకోపక్కకి తిప్పికూర్చుంది. బండి వచ్చిన చప్పుడు విని సురేశుడు వీధులోకి వచ్చాడు. అక్కడ పని చేస్తూన్న నౌకర్లూచాకర్లూ తమతమపనులు మానేసి తమ యజమాను రాలికేసి చూడడం మొదలుపెట్టారు; కాని అచల ముఖం చూస్తే ఎవళ్ళకీ ఉత్సాహం కలగలేదు.

రామబాబు దిగిన తరవాత అచలకూడా వెంటనే దిగింది. ఆమె ముఖంఎత్తి ఒక్కసారైనా సురేశుడికేసి చూడలేదు. ఆ తరవాత ఆముగ్గురూ మెల్లిమెల్లిగా ఆఇంటిలోపలికి వెళ్ళారు; కాని ఆభవనంలో వాళ్ళెవళ్ళకీ కొంచమైనా ఆనందం కనబడలేదు!

## ౩౬

అచలకికూడా క్రమంగా తను చేసినదానిలో ఎంతపొరబాటుందో తెలిసిపోయింది; కాని అన్నిటికంటె ఒక్కవిషయంమాత్రం ఆమె నెక్కువగా బాధించింది. చేతిలో బాగాడబ్బున్నవాడు తనఇష్టంవచ్చినట్టు ఖర్చు పెట్టుకుంటాడన్నమాట అందరకీ తెలిసిందే! కాని ఇందులో ఇంకొక విశేషముంది. ఒకవ్యక్తిని సంతోష పెట్టడంకోసం ఇంకొకవ్యక్తి అనేక బాధలు అనుభవించి ఈ అమూల్యవస్తువులన్నీ ఇక్కడ సేకరించాడు. సురేశుడు మాటలతో చెప్పకపోయినా అతను చేసినదానిని బట్టి చూస్తే ఈ విషయం స్ఫురించడంలేదూ?

ఆభవనం తుడిచి శుభ్రంచెయ్యడం అదీ ఇంకా పూర్తి కాలేదు. అందుచేత ఆభవనం శుభ్రంచేయించడంలో ఇంచుమించుగా రోజల్లా

గడిచిపోతుంది. ఆ మొగ్గరూ పనులూ అన్నీ చేయించడంవల్ల బాగా అలిసిపోయారు. వాళ్లు ఆ ఇంటిపనులన్నీ పూర్తిచేసుకుని బండిలో వచ్చికూర్చునేసరికి ఇంచుమించుగా మూడు రాత్రిఅయింది. అప్పుడు క్రమంగా గాలి జోరుగా విసరడం మొదలుపెట్టింది. ఆ గాలివల్ల ఎదురుగుండా ఉన్న మేఘాలన్నీ క్రమక్రమంగా ఎగిరిపోయాయి. అక్కడక్కడ మిగిలిపోయిన బూడిదరంగు మేఘాలుమాత్రం ఒకదిక్కునించి మరిఒకదిక్కుకి ప్రయాణం చేస్తున్నాయి. అవి అడ్డువచ్చి వెళ్ళిపోతూండడంవల్ల సప్తమిచంద్రుడు దాగుడుమూత లాడుతూ తనకాంతి నాలుగువైపులా ప్రసరింపచేస్తున్నాడు. ఆ కాంతి ఒకప్పుడు సముజ్జ్వలంగా ప్రకాశించింది. ఇంకొకప్పుడు మసకమసకగా కనబడింది. రామబాబు ఆప్రకృతిసౌందర్యం ఆస్వాదించడంకోసం ఆబండి కిటికీలోంచి ఇవతలికి చూస్తున్నారు. ఆప్రకృతిసౌందర్యంచూసి ఆనందించడంలో నిజంగా అచలకే ఎక్కువ శక్తిఉంది. అదీగాక ఆమె మంచి నడివయస్సులోకూడా ఉంది. అయినాగాని ఆబండిలో ఆమె కళ్లుమూసుకుని ఒకమూలగా కూర్చుంది.

ఇంతకుపూర్వం ఆమె హృదయంలో ఒకవిషయం ఎప్పుడూ మసకమసకగా జ్ఞాపకంవస్తూఉండేది. ఆ విషయం ఇది. ఆమె ఒకనాడు కలకత్తాలో సురేశుడు ఇంటిదగ్గిరనించి బండిఎక్కి వస్తూంది. ఆనాడు ఆమె సురేశుడి సిరీసంపత్తూ చూసి ఎంతో ముచ్చటపడింది! ఆకారణంచేత ఆమెకి మహిముడిమీద తాత్కాలికంగా కొంతఅయిష్టం కూడా కలిగింది. అప్పుడు ఆమెకి సురేశుడికి తనజీవితం అర్పించడం అంటే ఎక్కువకష్టం అనిపించలేదు. "ఇన్నాళ్ళతరవాత ఆ విషయం మళ్ళీ తనకెందుకు జ్ఞాపకంవచ్చింది" అని ఆమె తనఅంతరాత్మని ప్రశ్నించుకుంది. అప్పుడామెకి తన హృదయంలో అణిగిఉన్న విషయా

లెన్నో గోచరించాయి. అవ్వన్నీ తలుచుకుంటూంటే ఆమె కెంతో సిగ్గేసింది.

సిగ్గు! సిగ్గు! ఈగుఱ్ఱపుబగ్గీ ఈగుఱ్ఱాలూ ఈభవనమూ ఇవ్వన్నీ చూసి లోకం ఈఐశ్వర్యంఅంతా ఆమెభర్తదే అని అనుకుంటారు. కొన్నాళ్లు గడిచేసరికి లోకానికి అసలు విషయం ఏమిటో తెలిసి పోతుంది. ఈలోకం అప్పుడు ఆమెకి వీటిమీద అణువంతైనా అధి కారంలేదని అనుకుంటారు. అప్పుడు ఇదంతా కేవలం మిథ్య అయి ఊరుకుంటుంది. అప్పుడు ఆమె తనముఖం ఎక్కడ దాచుకుంటుంది? అయితే ఒక్కవిషయంమాత్రం నిజం. సురేశుడు ఈవస్తువులన్నీ కేవలం ఆమెమీదఉన్న ప్రేమచేత కొన్నాడనడంలో సందేహం ఏమీలేదు. ఆయింటిలో ఉన్నప్రతీవస్తువూ మొదటినించి చివరదాకా ప్రేమప్రకాశం లోనే తళతళలాడుతూ ఉంది. సంతోషతరంగం లాగ తేలిపోతూన్న ఆగుఱ్ఱపుబండీ, అందులో కూర్చున్నప్పుడు కలిగిన అమృదువైన స్పర్శసుఖమూ—అవ్వన్నీ ఆమెకోసం ఏర్పరచ బడినవే! ముహూర్తానికి ఆమెకోసం ఏర్పరచబడినవే! ఈవేళ ఆమె ముఖంకేసి తదేకదృష్టితో చూస్తూ ఆమెకనుసన్నలలో మెలిగే ఈదాన దాసీ జనంఅంతా ఎవరికోసం? కేవలం ఒక్క ఆమెఆనందంకోసమే!

అల్లాగ ఆలోచిస్తూంటే ఆమెహృదయంలో సిగ్గూ—మర్యాదా, లోభమూ—త్యాగమూకలిసి గంగాయమునాసంగమంలాగ ప్రవహిస్తూ న్నట్టు కనిపించాయి. ఒకక్షణందాకా, ఆమెవీటిల్లో దేనినీస్థిరంగా అంగీకరించలేకపోయింది. ఆభవనందగ్గిరికి వచ్చినతరువాత రామబాబు సంధ్యావందనం చేసికోవాలనిచెప్పి లోపలికివెళ్ళిపోయారు. అచల తలనొప్పిగాఉందని వంకపెట్టి తనగదిలోకివెళ్ళి తలుపులు బిగించుకుని

అవమానం అంతా ఏకమై ఆమెఎదురుగుండా మూర్తీభవించి నుంచుండి నట్లయింది. అన్ని బాధలకంటే కూడా అదే ఆమెకెక్కువ శూలలాగ కనిపించింది. ఈసంఘటనఅంతా ఎప్పుడో ఒకప్పుడు తెలియక తప్పదు! అప్పు డామె తనముఖం నలుగురికీ ఎల్లాగ చూపిస్తుంది ?

ఇందులో ఒకచిత్రమైన విషయముంది. ఆమె చిన్నప్పటినుంచీ పెరిగిన సంఘంలో వైరాగ్యం అనేమాట ఎప్పుడూ వినలేదు. సమాజంలో ఉండేవాళ్ళంతా ఆచారవ్యవహారాల్లో సామాన్యంగా కులానాపురుషులు లాగ ప్రవర్తించేవారు. ఆమెకు వాళ్ళలో ఆరోజుకంటె ఆరోజు భోగాసక్తే కనిపించిందిగాని విరక్తిభావం ఎప్పుడూ కనబడలేదు. సమాజంలోఉన్న ప్పుడు హిందూమత ఆదర్శాలతో వేటితోనూ ఆమెకు పరిచయంకలగ లేదు. పరలోకభయంచేత ఇహలోకసుఖాలు విడిచిపెట్టడం అనే కఠిన నియమంకూడా ఆమెకెక్కడా కనబడలేదు. సమాజంలో ఉండే వాళ్ళంతా సాధ్యమైనంతవరకు నిత్యమూ భోగాసక్తిలో మునుగుతూ ఉండడం ఒకటే ఆమెకి కనిపించింది. అంచేత ఆమె "ఈఐశ్వర్య మంతా కేవలం మాయ" అని సంతృప్తిపడి ఊరుకోలేక పోయింది. చిన్నప్పటినించీ అలవాటైన సంస్కారాలవల్ల ఆమెకి ఇటువంటిఅభిప్రాయం కలగడం అసంభవము! ఆమెపాదాలదగ్గిర ఇప్పుడు అనేక భోగ్యవస్తువులు పడిఉన్నాయి.ఎంతో మహదైశ్వర్యం ఆమె కోసం వేచిఉంది! ఆమెహృదయంలోనించి బయలుదేరిన ఒకవిధమైన అని వార్యమైన మోహం ఇప్పు డామెను ఆవేశించింది. ఆ మోహంమే ఆమె నాభోగ్యవస్తువులవైపు బరబరా ఈడ్చుకుపోయింది. మళ్ళీ ఆమోహమే కదలడానికి వీల్లేదని ఆమెను అటకాయించింది !

ఎక్కువ దుఃఖం కలిగినప్పుడు హృదయం ఎల్లాగో అల్లాగ ఆ దుఃఖంలోనించి తప్పించుకొని పోవాలని ప్రయత్నిస్తుంది. అల్లాగే ఆమె హృదయంలో అణిగిఉన్న వివేకంకూడా ఆమె నావరించిన

అజ్ఞానాన్ని ఛేదించుకుని అప్పుడప్పుడు పైకివచ్చింది. ఆమె "ఈవేళ తను అందర్నీ నమ్మించినా ఎప్పుడో ఒకప్పుడు ఈ విషయం నలుగురికీ తెలియకపోదు" అని అనుకుంది. సురేశుడు ఈ వేళ తనకిభర్తే కావచ్చును. కాని కొన్నాళ్లు గడిచినతరవాత ఆ విషయం తలపెట్టడానికికూడా వీల్లేకుండా పోతుందని ఆమె భయపడింది. అయితే కొన్నాళ్ళతరవాత ఇది అందరకీ తెలిసితీరుతుందనే నిశ్చయంమాత్రం ఏమిఉంది?

బ్రహ్మసమాజంలాంటి మతాలన్నిటిలోనూ విధవావివాహం జరుగుతూంది. హిందూస్త్రీకి ఇహలోకంలోనూ పరలోకంలోనూ కూడా భర్తఒక్కడే! కాని ఈధర్మం ఋగిలినమతా లంగీకరించడం లేదు. అందుచేత హిందూధర్మంవంటి పవిత్రం, నియమం ఆమెకు తెలియదనే చెప్పాలి. ఆమెహృదయం ఎప్పుడూ ఆవిధంగా ఆలోచించనేలేదు. అయితే ఒకభర్త జీవించిఉండగా ఇంకొకవ్యక్తిని భర్తగా స్వీకరించడం ఆమెను పీడిస్తూనేఉంది. ఆ సంగతి తలుచుకున్నప్పుడు సిగ్గూ సంకోచమూ ఆమెహృదయాన్ని కలచివేస్తూనే ఉన్నాయి. కాని ధర్మంగాని పరలోకంగాని ఆమెమనస్సుని అటకాయించు నిలబెట్టలేకపోయాయి.

గడియబిగించిన తలుపు ఎవరో తట్టుతూన్నట్టు చప్పుడయింది. రామబాబు "అమ్మా! బొత్తిగా రెండు మెతుకులైనా నోట్లో వేసుకోకుండా నిద్రపోయావు! ఏం ఒంట్లో బాగుండలేదా ఏమిటి?" అన్నారు. అచల ఆలోచనలన్నీ చటుక్కుని ఆగిపోయాయి. ఆమెకు అది "కేదారబాబు పిలిచిన పిలుపేమో" అని అనిపించింది. ఆమె అప్పుడప్పుడు కోపంవచ్చి తలుపులుబిగించుకుని పడుకుంటూఉండడమూ, కేదారబాబువచ్చి ఆమెను లేపుతూఉండడమూ అలవాటే! రామబాబువచ్చి అంత ఆప్యాయంగా పిలుస్తూ ఉన్నప్పుడు ఆమె సమాధానంచెప్పకుండా ఉండలేకపోయింది. ఒక్కక్షణంలో ఆమెకి కళ్ళ

కన్నుల నీళ్ళు గిర్రున తిరిగాయి. ఆమె చటుక్కున ఆ కన్నీళ్ళు తుడుచుకుంటూ కంఠం సవరించుకుని రామబాబుకి సమాధానం చెప్పింది. ఆ తరవాత వెంటనే తలుపు తెరిచి ఆయన ఎదురుగుండా నిలబడింది.

రామబాబుకీ అచలకీ ఎంతో చనువు ఏర్పడిపోవటం సహజం. అయినా ఆయన కొంత దూరదూరంగానే ఉండేవాడు. కాని వాళ్ళు ఈ ఇంట్లోకి వచ్చినప్పటినించీ ఆయన బాగా చనువుగా ఉంటున్నాడు. ఆయన ఒక చెయ్యి అచలభుజంమీద ఉంచాడు. రెండో చేత్తో ఆమె గెడ్డం పుణికిస్తూ ఒక చిన్న నవ్వు నవ్వి "పెదనాన్నగారు ముసలివారు అయ్యారుగదా అని నువ్వు వేళాకోళం చెయ్యడం మొదలుపెట్టావా? చాల్లే నడు!" అని ఆమె చెయ్యిపట్టుకుని గబగబా వరండాలోకి తీసుకువెళ్ళారు.

సురేశుడు ఆపక్కనే ఒక కుర్చీమీద కూర్చుని ఉన్నాడు. అతను ముఖం ఎత్తి అచలకేసి ఒకసారి చూశాడు. కాని మళ్ళీ ఆ ఉత్తర క్షణంలో తల వంచుకుని కూర్చున్నాడు. రాత్రి సావకాశంగా కూర్చుంటే తెల్లవారినతరవాత చెయ్యవలసిన పనులగురించి ఆలోచించుకోవచ్చునని అనుకుని అతను రామబాబుకోసం ఎదురుచూస్తున్నాడు. రామబాబు సురేశుణ్ణిచూడగానే నవ్వుతూ "సురేశబాబూ! మా గృహలక్ష్మి ఒక దొరగారిబిడ్డ. ఆవిడకి ముహూర్తాలూ అవీ అంటే నమ్మకంలేదు. మీకు ముహూర్తాలమీద గౌరవం ఉన్నా లేకపోయినా నాకేమీ ఇబ్బందిలేదు. కాని చిన్నప్పటినించి ముసలితనందాకా అలవాటయిన అలవాట్లన్నీ ఒక్కసారిగా పోవడం కష్టం. రేపు తెల్లవారినతరవాత ఝామున్నర పొద్దెక్కేసరికి ఒక మంచి ముహూర్తం ఉంది.—" అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

సురేశుడికి ఆయన అభిప్రాయం ఏమిటో బోధపడిందికాదు. "అందుచేత మంచిముహూర్తం ఎందుకు?" అన్నాడు. రామబాబు దీనికి

తిన్నగా సమాధానం చెప్పలేకపోయారు. అందుకని కొంతకొంత సంశయిస్తూ "పంచాంగంలో ఒకవారంలోపుగా మంచిముహూర్తం ఏదీకనబడడంలేదు అందుచేత నేను చెప్పేది ఏమిటంటే—" అని సగంసగం చెప్పి ఊరుకున్నారు. సురేశుడికి ఇప్పుడు అసలుసంగతి ఏమిటో బోధపడిపోయింది. కాని అతనుదీనికి అవునని కాని కాదని గాని సమాధానం చెప్పలేకపోయాడు. అందుచేత భయపడుతూ భయపడుతూ ఒకసారి అచలకేసిచూశాడు. అచల అతనికేసి రెప్ప వాల్చకుండా చూస్తూ కూర్చుంది. సురేశుడుకూడా కొంచెంసేపు ఆమెకేసి అల్లాగే చూస్తూకూర్చున్నాడు.

అచల ప్రశాంతమైనకంఠస్వరంతో "మనం రేపుపొద్దున్నే బయలుదేరి కొత్తఇంట్లోకి వెళ్ళవచ్చునా!" అని అడిగింది. సురేశుడు ఈ ప్రశ్నవిని నిర్ఘాంతపడిపోయాడు. ఆశ్చర్యంవల్ల అతనినోటినించి మాటే ఊడిపడ లేదు. అల్లాగ కొంతసేపుండి అతను మళ్ళీ కొంత కొంత సందేహిస్తూ "ఆఇంటి బాగుచేత ఇంకాపూర్తికాలేదు. నేల ఇంకా చెమ్మగానేఉంది. అందులోకి వెడితే అచలకి జ్వరంగాని ఇంకేదయినాగాని—" అని ఇంకా ఏదోఏదో చెప్పబోయాడు. కాని అచల అంతలో చటుక్కుని అందుకుని చిరునవ్వు నవ్వుతూ "సరే వీటికేంలెండి. ఆవేళ బయలుదేరేటప్పుడు మంచీ చెడ్డా ఆలోచించకుండా బయలు దేరాను. చివరికి నన్ని అడివిలోకి తీసుకువచ్చి పడేశారు. ఇప్పుడు నేల చెమ్మగాఉందని మీరు నాకోసం ప్రయాణం మానక్కరలేదు. పదండి వెడదాము! ఇంతవరకూ బతికిఉన్నదాన్ని—ఇకముందు మాత్రం బతకనా!" అంది. ఆ తర్వాత మళ్ళీ రామబాబుకేసి తిరిగి "పెదనాన్నగారూ! మీరు ఈ విషయంలో ఏమీ సందేహ పడనక్కరలేదు. మేము రేపుపొద్దున్నే బయలుదేరి అక్కడికి వెళ్ళిపోతాములెండి! మీ ఋణం నేను వెయ్యిజన్మలెత్తినా తీర్చుకో

లేను పెదనాన్నగారూ! మేము మరి రేపొద్దున్నే సెలవుతీసుకుంటాము." అని చెప్పి ఆమె ఏడవడం మొదలుపెట్టింది. ఆ తరవాత చటుక్కుని అక్కడనించి లేచి తనగదిలోకి వెళ్ళి గెలుపులు బిగించుకుని లోపలపడుకుంది.

రామబాబు అదిచూసి పిడుగుమీదపడ్డట్టు నిర్ఘాంతపడిపోయారు. ఆపైన కంగారుపడుతూ ఒకసారి తలవంచుకుని కూర్చున్న సురేశుడికేసీ, ఇంకొకసారి అచలకేసీ చూశారు. ఆయన అచల ఇల్లాగ వెళ్ళిపోయిం దేమిటని ఏంతో ఆశ్చర్యపడ్డారు. కాని ఆ అంతర్యామికి తప్ప ఆమెకి కలిగిన ఆ అభిమానానికి అర్థం ఎవరికి తెలుస్తుంది.

## 32

ఆమరునాడు తెల్లవారేసరికి ఆకాశంఅంతా మేఘాలు అలుముకున్నాయి. ఆకాశంఅంతా మేఘాలుకమ్ముకోవడంచేత ప్రపంచకం అంతా ఏదో ఉదాసీనంగా ఉన్నట్టు కనబడింది. బండి గుమ్మందగ్గిర సిద్ధంగా నిలబడింది.. నౌకర్లు దానిలో సామానులు ఎక్కిస్తున్నారు. సరీగ్గా శుభముహూర్తసమయానికి అచల మేడమీదనించి దిగి కిందకి వచ్చింది. ఆపైన బండి ఎక్కడానికిముందుగా రామబాబు పాదాలకి నమస్కరించబోయింది. ఆయన బలవంతంగా లేనినవ్వు తెచ్చుకుని "అమ్మో! ముసలాయన పెదనాన్నగారయితే చాలా ఇబ్బందులు ఉన్నాయమ్మా! ఏదోవిధంగా పాదాలకి నమస్కారంచేసి రెండు మూడుమైళ్ళదూరం పారిపోగానే పీడవదిలిపోతుందని అనుకుంటున్నావేమో! అల్లాగ ఎప్పటికీ అనుకోకు!" అన్నారు.

అచల కన్నీళ్ళతో నిండిన కళ్ళు పైకెత్తి రామబాబుకేసి చూస్తూ "నేనిల్లా అనుకోవడం లేదండి పెదనాన్నగారూ!" అంది. ఈమాటలు వినేసరికి ముసలాయనకి కళ్ళమ్మట నీళ్ళు గిర్రున తిరిగాయి. ఆయన

"ఇంతకాలంనించీ ఎంతో చనువుగా మసులుతూన్న ఈపిల్ల చాలా దూరం వెళ్ళిపోతుందని" అనుకున్నారు. ఆవిషయం తలుచుకునే సరికి ఆయన కంఠం గద్గదమయింది. ఆయన ఒక్కనిమిషం ఊరుకుని "ఆవిషయం నాకుమాత్రం తెలియదా? అమ్మా! నువ్వు మీఆయనతో కలసి మీఇంటికి వెడుతున్నావు! ఇల్లాంటప్పుడు నేను ఎంతో సంతోషంగా ఉండాలన్నమాట! ఏమిటో మరి నాకళ్ళమ్మట నీళ్లు ఎంత ప్రయత్నించినా ఆగడంలేదు." అన్నారు. ఆయన అన్నట్టు ఎంతప్రయత్నించినా ఆగకుండా ఆయనకళ్ళమ్మట కన్నీళ్ళు ప్రవహించాయి. ఆపైన ఆయనచేత్తో కన్నీళ్ళుతుడుచుకుని ఒక్క నవ్వు నవ్వి "దగ్గిరగా ఉండేదానవుకాబట్టి అస్తమానమూ నిన్ను అయినదానికీ కానిదానికీ ఇబ్బందిపెడుతూ ఉండేవాణ్ణి. ఇప్పుడు నీకు ఇంక ఆబాధ లేదు. కాని ఎప్పుడో ఒకప్పుడు వచ్చి మళ్ళీ అదంతా వడ్డీతో సహా వసూలుచేస్తానులే!" అన్నారు.

సురేశుడు వెనకాల నిలబడిఉన్నాడు. అతను ఈవేళ హృదయపూర్వకమైన భక్తితో ముసలాయన పాదాలకి నమస్కరించాడు. అతను నమస్కరించడం అయిపోయినతరవాత రామబాబు మెల్లిగా "సురేశబాబూ! మీరు మాఇంట్లో అనేకమైన ఇబ్బందులు పడ్డారు. ఇంక మీఇంటికి మీరువెళ్ళి సుఖంగా ఉండాలని నా కోరిక. నేనీ విషయంలో పరమేశ్వరుణ్ణి ఎప్పుడూ త్రికరణశుద్ధిగా ప్రార్థిస్తూ ఉంటాను!" అన్నారు. సురేశుడు ఆమాటలకి ఏమీ సమాధానం చెప్పలేదు. మళ్లీ ఇంకోసారి ఒంగి రామబాబుపాదాలకి నమస్కరించాడు. ఆపైన వెళ్ళి బండిలోకూర్చున్నాడు. రామబాబు మళ్ళీ ఒకసారి ఆశీర్వదించి "నేను నాళుయితో ఇప్పుడే బండి తీసుకురమ్మనమని చెప్పాను. ఇంచుమించుగా సూర్యాస్తమానం అయ్యేసరికి నేనుకూడా అక్కడికి చేరుకుంటాను. కాని అప్పుడుకూడా ఈ మోస్తరుగా

మూతిబిగించుకుని కూర్చుంటేకాస్త మాటపెక్కును!" అని వేళాకోళంగా మాట్లాడదామని అనుకున్నారు. కాని చివరికి ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి మాట్లాడకూరుకున్నారు.

బండివెళ్ళిపోయింది. రామబాబు ఒకనిట్టూర్పు విడిచిపెట్టి మనస్సులో "ఈసమయంలో వీళ్ళువెళ్ళిపోవడం మంచిదే !" అని అనుకున్నారు. ఇక్కడికి నలుగురుబంధువులూ వస్తే ఇబ్బందిగానేఉంటుంది. ఇంతేకాదు. అసలు ఇంకొక ఇబ్బందికూడా ఉంది. ఆయనకి ఆధీనం తప్పినచెల్లెలు సంగతి బాగా తెలుసును. ఆవిడకి ఎదటివాళ్ళ రహస్యాలు తెలుసుకోవాలని ఉండే కుతూహలం ఇంతాఅంతా కాదు ! ఆవిడ వచ్చి సురమరహస్యాలన్నీ తెలుసుకోడానికి ప్రయత్నిస్తుంది. అల్లాగ తెలుసుకోవాలని అత్యాసక్తిచూపించడంవల్ల సురమమనస్సుకి కష్టంగా ఉండవచ్చును. రామబాబుకి సురమపూర్వచరిత్ర అట్టేఎక్కువ తెలియదు. అయినాగాని ఆమెచాలా యోగ్యురాలని ఆయన అనుకున్నారు. ఆమె సామాన్యంగా అబద్ధంచెప్పదనికూడా ఆయనఅభిప్రాయము. ఆమెతండ్రి బ్రహ్మసమాజం అవలంబించినవాడు. ఆమెకు ఆచారం అన్నా దేవతలన్నా ఏమీ నమ్మకంలేదు. అయినాగాని, ఏమి అపచారం జరిగిపోతుందో అనే భయంచేత. ఆమె తనసంగతిఅంతా స్పష్టంగా చెప్పివేసింది. ఇంతేకాదు. ఇంకొకవిషయంకూడా ఉంది. ఆయనకి ఆడపిల్లలు ఎవరూలేరు. ఆయనకి మొట్టమొదట స్త్రీసంతానమే కలిగింది. కాని ఆశిశువు చాలా కాలంజీవించలేదు. ఆపిల్ల ఇప్పటిదాకా బతికిఉంటే అచలకి తల్లి కావడానికి తగిన వయస్సు కలిగిఉండును. ఆ శిశువు సంగతి ఆయన పూర్తిగా మరిచిపోయారు గాని, ఆవేళ అచల వైద్యుడికోసం వెతుక్కుంటూ ఏడుస్తూంటే ఆయనకి చటుక్కుని ఆశిశువుసంగతిజ్ఞాపకం వచ్చింది. ఆయన చాలాకాలంకిందట చనిపోయిన ఆశిశువు మళ్ళీ బతికి వచ్చిందని అనుకున్నారు. ఆయనకి అప్పటినించీ అచలమీద మమకారం

ఎక్కువయింది. ఆయన లోలోపల అచలవిషయంలో ఏదో నిగూఢ రహస్యం ఉందని అనుకునేవారు. కాని ఆ రహస్యం ఏమిటో ఆయనకి తెలిసిందికాదు. ఆ రహస్యంసంగతి మనకెందుకని అనుకుని ఆయన మన స్సుకి సమాధానం చెప్పుకునేవారు.

ఒకనాడు రాత్రుసి ఏదో గృహాకలహంవల్ల వాళ్ళిద్దరూ ఇక్కడికివచ్చి ఉంటారని అంది. సురేశుడు ఇంటిదగ్గిర దెబ్బలాడి భార్యనుతీసికుని వచ్చేసిఉంటాడని అనుకోవడంలో ఆమెకేమీ అభ్యంతరం కనబడలేదు. మొట్టమొదటినాడు అచల తను బ్రహ్మసమాజస్థురాలినని చెప్పింది; కాని సురేశుడి మెడలో జంధ్యం కనబడింది. ఆ జంధ్యం చూసి రామబాబు ఎంతో ఆశ్చర్యపడ్డారు; కాని ఆయన అనుకున్న దానికి ఒకసమాధానం దొరికింది. ఆయన సురేశుడు తప్పకుండా హిందువు అయిఉంటాడనిన్నీ, ఏదో కారణంచేత బ్రహ్మసమాజస్థులపిల్లని వివాహం చేసుకొని ఉంటా డనిన్నీ నిశ్చయించుకున్నారు. క్రమంగా ఆనమ్మకం ఆయన మనస్సులో వేళ్లుపాతుకుపోయింది.

రామబాబు నిజమైనహిందువు. అందులో ఒకవిశేషం ఉంది. ఆయన హిందూమతధర్మానికి సంబంధించిన నిష్ఠ అంతా అలవరుచుకున్నారు; కాని అందులో ఉండే కాఠిన్యం మాత్రం ఆయనకబ్బలేదు. సద్బ్రాహ్మణవంశంలో పుట్టిన సురేశుడు ఇటువంటి పని చేసిఉండకపోతే ఆయన చాలా సంతో షించిఉండేవారు. కాని ఈ ప్రేమించి చేసుకున్న వివాహమూ, ఈ ఇంట్లో వాళ్ళతో దెబ్బలాడి రావడమూ, దానిమూలాన్ని దేశాలుపట్టి పోవ డమూ—ఇవన్నీ చూస్తే ఆయనకి ఎంతో సంతోషం కలిగింది. ఆయన వీళ్ళల్లో ఉండే సౌందర్యమూ మాధుర్యమూ ఆస్వాదించకుండా ఉండ లేకపోయారు. అందులోనూ ఈసంగతులేవీ తెలుసుకోకుండా వాళ్ళకి ఆశ్రయం ఇవ్వడం మూలాన్ని ఆయనకి మరింతసంతోషం కలిగింది. కాని [illegible] అచల అప్పుడప్పుడు మూలిబిగించుకుని కూర్చుంటూండడం

ఆయనకంటపడేది. అది చూసి ఆయన మనస్సులో ఎంతో బాధపడుతూ ఉండేవారు. పరాయింట్లో ఉన్నప్పుడు కులాసాగా కాలుసుకుని మాట్లాడు కోడానికి వీలులేకపోవడంవల్లనే వాళ్లు బాధపడుతున్నారేమో నని ఆయన అనుకున్నారు. అందుచేత వాళ్ళింటికి వాళ్లు వెళ్ళిఉంటే సుఖ పడతారని ఆయన నిశ్చయించారు.

క్రమంగా ఆయన స్నానంచేసేవేళఅయింది. అంగోస్త్రం బుజంమీద వేసుకుని నదిలో స్నానంచెయ్యడానికి వెళుతూ ఆయన లోలోపల నవ్వు కుని "ఎందుచేతనోగాని అమ్మాయి వెళ్ళేటప్పుడు నామీద కోపగించింది. పెదనాన్నగారు తనవాళ్ళకోసం మమ్మల్ని ఇంట్లోనుంచి పంపించివేశారని అనుకునిఉంటుంది. సరేకాని రెండుమూడురోజులదాకా ఇల్లాగే మూతి ముడుచుకుని కూర్చుంటే అప్పుడు తగినసమాధానం చెబుతాను! మెల్లిగా దగ్గిరకి పిలిచి "అమ్మాయీ! అయితే ఈమూతి బిగించుకుని కూర్చోవడం ఇంకా ఎంతకాలం!" అని అడుగుతాను. అప్పుడు ఆమాటకి ఏమని సమాధానం చెబుతుందో చూస్తాను!" అని అనుకున్నారు.

ఇల్లాగ అనుకుంటూంటే ఆయనముఖంమీద ప్రశాంతమైన హాస్యం నృత్యంచేసింది. ఆయనభావనలో సురమ విసురునవ్వునవ్వి వెళ్ళి పోయినట్లూ ఆతరవాత మళ్ళీపళ్ళెంలో మిఠాయిపట్టుకువచ్చినట్లూ కనబడింది. ఆపైన పెద్దగంభీరంగా ఉన్నట్లునటించి "పెదనాన్నగారూ ఈవేళ మీరు నేనుచేసిన మిఠాయితినకపోతే మీకూనాకూ ఒక పెద్దయుద్ధం జరుగుతుంది." అని అన్నట్లుకూడా కనిపించింది. ఆయన స్నానంచెయ్యడం పూర్తిఅయిపోయింది. ఆసమయాన్ని ఆయనకి సురమబలవంతంగా నవ్వుఆపుగోవడం జ్ఞాపకంవచ్చింది. అదితలుచు కుంటూంటే ఆయనకికూడా పెద్ద నవ్వువచ్చింది. ఆయన నిన్నరాత్రి నించీ మనస్సులో బాధఅంతా ఈభావనాచిత్రాలవల్ల క్రమక్రమంగా ఉపశమించింది.

రేపుఉదయం అందరూబయలుదేరి వచ్చేస్తున్నారని టెలిగ్రాము వచ్చింది. వచ్చేవాళ్ళని బట్టి వాళ్ళనొకర్లూ చాకర్లూకూడా ఎక్కువగానే ఉండవచ్చును. ఆయనకి ఈవేళఇంట్లో పనులూఅవీ చాలా ఎక్కువగాఉన్నాయి. పైన ఆకాశంధోరణిచూస్తే ఏమీబాగాలేదు. ఒకవేళ వర్షంకురిస్తే ఇంకవెళ్ళడం పడదేమో అనేభయంచేత రామబాబు చీకటిపడకుండానే ఇంటిదగ్గిర బయలుదేరారు. ఒకబండి కట్టించుకుని గబగబా తీసుకువెడితే ఎక్కువడబ్బిస్తానిచెప్పి బండి గబగబా తోలించారు. దారిలోనే కొంచెం వర్షంపడేసూచనలు కనిపించాయి. అక్కడికి వెళ్ళివెళ్ళడంతో వర్షంప్రారంభించింది.

అచల తలుపుతీసుకుని ఇవతలికివచ్చి "వర్షంలో బయలుదేరారేమిటి? పెదనాన్నగారూ! కొంచెం ఆలస్యంఅయితే వర్షంలో బాగాతడిసిపోయేవారే!" అంది. అచల ముఖంలోగాని కంఠస్వరంలోగాని ఏమీ సంతోషసూచన కనబడలేదు. అదిచూసి రామబాబు నిర్ఘాంతపడిపోయారు. ఆయన సురమఇల్లాగ అంటుందని ఎప్పుడూ అనుకోలేదు! ఆయన భావనాసౌధం అంతా ఎవరో ఒక్కసారిగా కూలద్రోసినట్లయింది. అయినాగాని ఆయన పైకిఉత్సాహంగా ఉన్నట్టు నటించి "అయితే మరీమంచిది! నేను వానలో తడవడానికైనా ఒప్పుకుంటానుగాని నిన్నువిడిచిపెట్టి ఉండలేనమ్మా!" అన్నారు.

రామబాబుకి అచలసంగతి మొట్టమొదటిని చీ తిన్నగాబోధపడలేదు. అందుకోనూ నిన్నరాత్రిజరిగినసంగతిచూసి ఆయన మరీ ఆశ్చర్యపడ్డారు. సరే! ఈవేళ జరిగినదాన్నిగురించి చెప్పనేఅక్కర్లేదు! సురమ ఇల్లాగఅంటుందని ఆయనస్వప్నంలోకూడా అనుకోలేదు. ఆయనకీసురమకీ జరిగినసంభాషణ ఇంతే; కాని సురమ ఒక్కపరుగునవచ్చి లుంగచుట్టుకుని ఆయనగుండెమీదపడి వెక్కివెక్కి

ఏడవడం మొదలుపెట్టింది. అల్లాగ కొంచెం సేపు ఏడ్చి "మైన నాన్నగారూ! మీరు నేనంటే ఎంతో ఆప్యాయంగా చూసుకుంటున్నారు కాని నేను మాత్రం సిగ్గుచేత పాతాళలోకంలోకి కుంగిపోతున్నాను" అంది.

కొంతసేపటిదాకా రామబాబు ఏమీమాట్లాడలేక పోయారు; కేవలం ఒకచేత్తో ఆమెనుదగ్గిరగా తీసుకుని రెండో చేత్తో ఆమె జుట్టు నిమురుతూ కూర్చున్నారు. స్నేహార్ద్రమైన ఆయన మనస్సు ఆమె సంఘం ఆమోదించని వివాహం చేసుకున్నందుకే. అందుచేత తల్లిదండ్రులకీ ఆమెకీ వచ్చిన విరోధంసంగతి మాత్రం ఆలోచించింది. అంతేగాని అంతకంటె కొత్తవిధంగా ఆలోచించలేకపోయింది. కొంతసేపటిదాకా ఆఇద్దరూ అల్లాగేకూర్చుండిపోయారు. ఆపైన రామబాబు మెల్లిగా "ఇందులో సిగ్గుపడవలసిన విషయం ఏమి ఉందమ్మా! నువ్వు నాకుమారైవు! చాలాకాలంకిందట నా కొక పిల్ల పుట్టిపోయిందమ్మా! నిన్ను చూసి నువ్వేఆపిల్లవని అనుకుంటున్నా నమ్మా! ఆపిల్ల నన్ను విడిచిపెట్టి ఉండలేక నీరూపంగా మళ్ళీ నాదగ్గిరికి వచ్చిందిలాఉంది. నిన్ను చూసేనరికి అదేమిటోగాని నాకు అల్లాగ అనిపించిందమ్మా!" అన్నారు. ఆపైన ఆమెను వేరే ఒక కుర్చీమీద కూర్చోబెట్టి ఇందులో సిగ్గుపడవలసింది ఏమీలేదని చెప్పి అనేకవిధాల ఓదార్చారు. ఆతరవాత "ఇందులో సిగ్గుపడడానికి ఏమిఉందమ్మా! ప్రాచీనకాలంనించీ ఇల్లాగే జరుగుతూందమ్మా! సాక్షాత్తూ ఆసతీదేవి ఉందిచూడు! ఆవిడకూడా ఒకసారి తల్లిదండ్రులతో దెబ్బలాడి భర్తదగ్గిరికి వచ్చేసింది. ఇప్పుడేదో ఈవిధంగా జరిగిందిగాని ఇంకొక్క నాలుగురోజులువెడితే మళ్ళీ అందరూ కలుసుకుంటారమ్మా! ఈవేళ విముఖంగా ఉన్నవాళ్ళంతా రేపువచ్చి మళ్ళీ కలుసుకుంటారు. ఆముసలివాళ్లు మాత్రం మిమ్మల్ని

విడిచిపెట్టి ఉండగలరా! నాలుగురోజులు వెళ్ళేసరికి మళ్ళీ మిమ్మల్ని ఇద్దర్నీ ఇంటికి రావలసిందని బతిమాలుకుంటారు. నేనన్నమాట ఊరికే పోదనుకున్నా! కొద్దిరోజుల్లో ఈసంగతి నీకే తెలుస్తుంది.” అన్నారు.

ఈవిధంగా పెద్దఆవేశం తెచ్చుకుని ఆమనవేమేమో మాట్లాడారు. ఆమాటల్లో సారం ఉన్నా లేకపోయినా అచలకిమాత్రం ఆమాటలువింటూంటే తలబరువెక్కి క్రమక్రమంగా కుంగిపోతూన్నట్టనిపించిలది. వర్షం బాగాజోరుగా కురుస్తూంది. ఈసమయంలో అచల వీధివైపుచూసింది. సురేశుడు వర్షంలో తడుస్తూ గబగబా ఇంటికివస్తున్నాడు. అతన్నిచూసి అచల చటుక్కుని కళ్లుతుడుచుకుంది. ఆపైన వర్షపునీటితో ముఖం శుభ్రంగాకడుక్కుని తను ఇంతకుపూర్వం కూర్చున్నచోట కూర్చుంది. రామబాబు అది చూసి నరమకి తనవిచారంసంగతి భర్తకి తెలియనివ్వడం ఇష్టం లేదని అనుకున్నారు. సురేశుడు లోపలికివచ్చాడు. ఆపైన రామబాబునిచూసి ఆశ్చర్యపడ్డాడు. అతను రామబాబుతో ఏదోమాట్లాడబోయాడు. అంతలో రామబాబు కొంచెంకంగారుపడి “సురేశబాబూ! మనం సావకాశంగా తరవాత మాట్లాడుకోవచ్చునులెండి. నేనెక్కడికీ పారిపోను! మీరువెళ్ళి బట్టలుమార్చుకోండి” అన్నారు.

సురేశుడు ఆమాటమీద ఒకనవ్వునవ్వి “ ఈ పారేం భయంలేదు లెండి!” అని ఆపక్కనున్న కుర్చీలాక్కుని దానిమీద కూర్చో

ఆశ్చర్యపడ్డారు. ఈఆశ్చర్యం ఇద్దరిలోనూ చెరొకవిధంగానూ పరిణమించింది. సురేశుడు అచలఅన్నమాటకి ఏమీసమాధానం చెప్పకుండా వీధులోకివెళ్ళిపోయాడు. రామబాబు పరధ్యానంగా వీధికేసి చూస్తూకూర్చున్నారు. వీధులో బాగా వర్షంకురుస్తూంది. క్రమంగా రాత్రిపడినకొద్దీ వర్షం ఎక్కువకావడం మొదలుపెట్టింది. చాలారోజులనించి వర్షంలేక భూమిఅంతా బాగా కాలిఉంది. సృష్టికర్త ఈవేళ భూమికి కావలసినవర్షంఅంతా ఒక్కసారిగా కురిపించాలని పట్టుపట్టినట్టు కనబడింది.

అచల రామబాబు లోలోపల కంగారుపడుతూండడము చూసి "ఇప్పుడు ఇంటికి వెళ్ళడం చాలా కష్టం పెదనాన్నగారూ! పోనీ ఈవేళ రాత్రికి ఇంటికివెళ్ళడం మానేస్తే ఏంపోయింది?" అంది. ఆమాటవిని రామబాబు నవ్వి "ఇంతమాత్రానికి నాకేమీ ఇబ్బందిలేదు గాని, ఈగాలివానలో మిమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళాలనిలేదు. కాని రేపు తెల్లవారేసరికి వాళ్ళందరూ వస్తారు. రాత్రి నేను ఇంటికి వెళ్ళకపోతే కుదరదు. కాని వర్షం రాత్రి తెల్లవార్లూ కురువదనుకుంటాను. ఒక గంటసేపటిలో వర్షంఅంతా తగ్గిపోతుంది. అందుచేత అంతవరకూ ఇక్కడఉంటాను" అన్నారు.

ఆ తరవాత వాళ్ళిద్దరూకలిసి రేపు రాబోయే బంధువుల్ని గురించి మాట్లాడుకున్నారు. ఆపైన వాళ్ళప్రసంగం క్రమంగా అనేక విషయాల్లోకి తిరిగింది. వాళ్ళు సంసారధర్మమూ, సంఘమూ, ధర్మాధర్మాలూ, పాపపుణ్యాలూ, పరలోకమూ మొదలైనవాటిని గురించి చర్చించుకున్నారు. ఇద్దరూకలిసి ఆవిషయాలన్నీ ఎంతో శ్రద్ధగా చర్చించారు. అందుచేత ఇద్దరికీకూడా రాత్రి ఎంతగడిచిందో తెలియలేదు. పైన పెద్దఉరుములు వినిపిస్తున్నాయి. గాలివానా, చీకటీ క్రమక్రమంగా ఎక్కువయ్యాయి. కాని ఆయిద్దరిలో ఒకరూకూడా ఈవిషయం

గమనించలేదు. రామబాబు ఆవేళ ఎన్నో విషయాలనిగురించి ఎంతో వినసొంపుగా మాట్లాడారు. అచల ఆయన చెప్పే విషయాలని ఎంతో తన్మయత్వంతో వింటూకూర్చుంది.

ఇంతలో ఎవరో అక్కడికివచ్చినట్లు చప్పుడయింది. ఇద్దరూ వెనక్కితిరిగి చూశారు. ఒకనౌఖరు అక్కడికివచ్చి దూరంగా నిలబడ్డాడు. వాడు "అమ్మా! అప్పుడే చాలారాత్రిఅయిందండి. ఇంచుమించుగా పదకొండుగంట లవుతుందండి. తమరు భోజనానికి లేస్తా రాండి!" అన్నాడు. అచల ఉలిక్కిపడి "అప్పుడే పదకొండు గంట అయిందా? బాబుగారు——" అని సగం ప్రశ్నించి ఊరుకుంది.

"ఆయన అప్పుడే భోజనంచేసి పడుకోడానికి వెళ్లారండి"

సురేశుడు అప్పుడు వెళ్ళాడు. ఇప్పటిదాకా తిరిగిరాలేదు. ఈసంగతి అచలకి ఇప్పుడే జ్ఞాపకంవచ్చింది. సురేశుడి గదికి ఎగువగా ఒక తెర వేళ్లాడుతూంది. లోపలికాంతి ఆ తెరలోనించి తళతళలాడుతూ మెరిసింది. రామబాబు ఈప్రసంగంవిని ఎంతో బాధపడ్డారు. ఆతర వాత మాటిమాటికీ "అయ్యయ్యో! నేనీవేళ ఎంతపొరబాటుపనిచేశాను. కబుర్లుపెట్టి నిన్నిక్కడ ఆపేశాను. అందుచేత నువ్వు ఆయన భోజనం సంగతీ అదీ కనుక్కోడానికి వీల్లేకపోయింది. ఇంక నువ్విక్కడ ఆలస్యంచెయ్యకమ్మా! వెళ్ళి భోజనంచెయ్యి!" అన్నారు.

అచల ఈమాటలకి సమాధానం చెప్పలేదు. నౌకరుకేసి తిరిగి గుర్రపుబండి సరియైనసమయానికి ఎందుకు తీసుకురాలేదు!" అని అడిగింది. నౌకరు "గుర్రాలు కొత్తవండమ్మా! ఈగాలిలోనూ వానలోనూ బండికడితే ఏమవుతుందో' అని భయపడ్డానమ్మా!" అన్నాడు.

"అయితే మరొకబండి ఎందుకు తీసుకురాలేదు."

ఈమాటకి నౌకరు మాట్లాడకూరుకున్నాడు. ఏమీఅనలేదు. ఆంత

ఆనాకరు తను వేసినతప్పు ఒప్పుగున్నాడని కాదు. వాడు "తమరు ఈమాటనాతో చెప్పలేదమ్మా!" అని సమాధానం చెప్పాలని అనుకున్నాడు, కాని పైకి ఆమాట అనలేకపోయాడు. అంతే!

రామబాబు వెళ్ళిపోవాలని తొందరపడడానికి బదులు ఎంతో సిగ్గుపడుతూ "అబ్బే ఇప్పుడు బండితీసుకురావలసినంత తొందరపని ఏమీలేదమ్మా! కాస్త పొద్దున్నే లేచి స్టేషనుకి వెళ్లానంటే చాలు. నేను రాత్రి ఏమీ తిననమ్మా! అందుచేత దానికోసం నువ్వేమీ కంగారుపడక్కరలేదు. నువ్వు రెండు మెతుకులు నోట్లోవేసుకుని పడుకో అమ్మా! కబుర్లుచెబుతూ కూర్చోవడంమూలాన్ని ఎంత రాత్రిఅయిందో తెలిసిందికాదు. నావల్ల పెద్దపొరబాటు జరిగిపోయింది" అన్నారు. ఆ తరవాత ఆయన ఎంతో బలవంతపెట్టి అచలని భోజనం చెయ్యడానికి కిందకిపంపించివేశారు. అచల వెళ్ళిపోయినతరవాత ఒక పదిహేను నిమిషాలు గడిచిపోయాయి. ఆ తరవాత అచల మళ్ళీ అక్కడికి ఒకసారివచ్చింది. రామబాబు ఆమెకేసిచూసి "ఇంక నువ్వు ఒక్కనిమిషమైనా ఆలస్యం చెయ్యవద్దమ్మా! తొందరగావెళ్ళి పడుకో నేనీసావిట్లో సుఖంగాపడుకుని నిద్రపోతానమ్మా! నాకేమీ ఇబ్బంది లేదు! నువ్వువెళ్ళి పడుకో!" అన్నారు.

అసలు అచల వెళ్ళిపోవాలని తొందరపడుతూనే ఉంది. ఆపైన ముసలాయన బలవంతపెట్టడంవల్ల ఆమెహృదయంలో ఏదో ఇంద్రజాలం జరిగినట్లయింది. రామబాబు అచలని కన్నతండ్రిలాగ చూసుకుంటున్నారు. అయినాగాని అచల ఆయన్ని మోసగించి ఆయనగౌరవానికి పాత్రురాలైంది. ఈవిధంగా ఆయన్ని మోసగించి ఆయనవల్ల గౌరవంపొందుతూండడం ఆమెకు ప్రతిరోజూ అలవాటై పోయింది. ఆమె ఈవేళ మనస్సులో ఎంతో బాధపడుతూనే ఉంది. అయినాగాని ప్రతీరోజూ అయిన ఆఅలవాటువల్ల ఆమె ఈవేళ సురేశుడి

పడకగది వైపు నడిచివెళ్ళింది. అల్లాగ నడిచివెడుతూ, ఆమెకు ఈవిధంగా గాలీ వానా వచ్చినరోజు ఇంకొకటి జ్ఞాపకంవచ్చింది. ఆవేళ ఆమెకీ భర్తకీ ఎడబాటు కలిగింది. ఈవేళ ఏదో ఒక అనతిక్రమణీయమైన శాపంవల్ల ఆమె శాశ్వతంగా ఒక మహాంధకారంలో పడిపోతూంది. అల్లాగ నడిచి వెడుతూంటే అచలకి తను అంధకారంలో పడి పోతూన్నట్లనిపించింది. కాని చివరికి అసత్యమే ఆమె జీవితంలో అంతిమవిజయం సాధించింది. కేవలం మోహం ఆమెనుపాదాక్రాంతు రాలిని చేసివేసింది. ఆమె ఏమీ బాధపడలేదు! పైకి ఏమీ అన లేదు. ఆఖరికి ఒక్కసారైనా వెనక్కితిరిగిచూడలేదు. ఆమె నిశ్శబ్దంగా సురేశుడి పడకగదిలో ప్రవేశించింది. బాహ్యప్రపంచకంలో ఆ ఉన్మత్త ప్రకృతి అల్లాగే ప్రళయతాండవం చేసింది. ఆ గాఢాంధకారంలో ఆ మెరుపు అల్లాగే పకపకనవ్వింది. ఆరాత్రి తెల్లవార్లూ ఆగాలివానలో కొంచమైనా మార్పుకనబడలేదు!

కొత్తచోటు అవడంచేత రామబాబుకి బాగా నిద్రపట్టలేదు. అందు లోనూ ఏదో ఒకవిషయాన్ని గురించి ఆలోచిస్తూ ఉండడంవల్ల ఆయనకి ఇంకా తెల్లవారకముందే మెళుకువవచ్చింది. ఆయనలేచి ఆకాశంవైపు చూశారు. గాలివాన చాలావరకు తగ్గిపోయింది గాని, ఇంకా పూర్తిగా తగ్గిందని చెప్పడానికివీల్లేదు. ఆయన నౌఖర్లు ఇంకాలేచారో లేదో చూద్దామని వరాండాలోకి వచ్చి ఇటూ అటూ చూసి నిర్ఘాంత పడిపోయారు! ఎవరో ఒకవ్యక్తి ఎదురుగుండా ఉన్నబల్లమీద తల ఆనుకుని కూర్చున్నట్టు కనిపించింది. ఆయన బాగా దగ్గిరికివెళ్ళి చూశారు. అక్కడ ఆవిధంగా కూర్చున్నవ్యక్తి అచల! ఆయన ఎంతో ఆశ్చర్యపడి "సురమా! నువ్వు ఇక్కడ కూర్చున్నావేమిటి? ఇంతతొందరగా ఎందుకు లేచావు!" అన్నారు.

సురమ ఒకసారి తలఎత్తిచూసి మళ్ళీతలవాల్చి బల్లమీదపడుకుంది.

ఆమెముఖంమీద కత్తివాటువేసినా నెత్తురుచుక్క లేదు! కళ్ళకింద నల్లటిరేఖలు కనిపించాయి. గాలిమీదనించి నీరుప్రవహించినట్లు ఆమెకళ్ళమ్మట కన్నీళ్ళు అదేపనిగా ప్రవహిస్తూనాన్నాయి. రాముబాబు అస్పష్టంగా ఏదో అన్నారు. ఆపైన నగంనగం చచ్చిపోయినట్లు పడిఉన్న ఆమెకేసి అల్లాగే చూస్తూ నుంచున్నారు. ఆయన నోట్లో నించి ఒక్కమాటైనా పైకి ఊడిపడలేదు!

## ౩౮

కేదారబాబు తెల్లవారగానే ఫలహారంచేసి టీపుచ్చుకొని "అమ్మ య్యా!" అని ఒక్కతేనుపు తేన్చారు. ఆయన ఫలహారంచేసిన తరవాత ఆగిన్నెలూ అవీ తియ్యడానికి మృణాల అక్కడికివచ్చింది. కేదార బాబు ఆమెకేసితిరిగి "అమ్మా! నువ్వు పెట్టేఫలహారంలో ఎల్లాంటి అమృతంఉందోగాని నెలరోజులైనా నేనిక్కడినించి కదలలేకుండా ఉన్నాను" అన్నారు. మృణాల ఆయన్ని "బాబయ్యగారూ!" అని పిలవడం అలవాటు చేసుకుంది. అందుచేత ఇప్పుడుకూడా అల్లాగే పిలిచి "ఇక్కడినించి మీరుతొందరగా వెళ్ళిపోవాలని చూస్తున్నారు! మీకు ఇల్లాంటి అభిప్రాయం ఎందుకుకలిగిందో నాకుబోధపడడంలేదు. మీకు పరిచర్యచెయ్యడం ఎల్లాగో నాకు తెలియదా?" అంది.

మృణాల "మీకు నేను అసలు కూతుర్ని కానుగదా!" అని ఇంకా ఏదో చెప్పబోయి, చటుక్కుని ఆమాట మార్చేసి పైన చెప్పిన విధంగా మాట్లాడింది. ఈ సంగతి కేదారబాబు గ్రహించినా పైకి గ్రహించనట్లు నటించారు. అయినాగాని ఆయన కంఠం చటుక్కుని గద్గదమయింది. ఆయన అల్లాగ ఒక్కక్షణం ఊరుకుని వెళ్ళిపోవడానికి తొందరపడడం ఏమిటమ్మా! నీచేత్తో వండిన అన్నంతింటూ నువ్విచ్చిన టీ తాగుతూ ఉంటే నాకింక స్వర్గంకూడా

ఎందుకని అనిపిస్తూఉంటుంది! ఆకిటికీదగ్గిర నుంచున్నప్పుడల్లా నాకు "నేనుకలకత్తాలో ఉన్నంతకాలమూ ఎన్నో బాధలు అనుభవించాను. భగవంతుడిదయవల్ల ఇంకొకరెండేళ్లు బతికిఉంటే అనుభవించవలసిన బాధలన్నీ పూర్తిఅయిపోతాయి. ఆపైన ఆపరమేశ్వరుడిసన్నిధిలో నిలబడగలుగుతాను" అని అనిపిస్తూ ఉంటుంది." అన్నారు. ఆయన ఎంతో బాధపడుతూ ఈమాటలు అన్నారని మృణాల గ్రహించింది. ఆయనకి కలకత్తా చిరకాలపరిచితమైన ప్రదేశము. ఆప్రదేశమూ ఆసమాజమూ విడిచిపెట్టి ఈమట్టికొంపలో జీవితశేషం గడిపివెయ్యాలని ఆయనకోరిక! మృణాల ఒకక్షణంలో ఆయన మనస్సులోఉన్న అభిమానమూ, సిగ్గూ గ్రహించగలిగింది. అందుచేత ఆయన అన్నదానికి ఏమీ చెప్పలేక టీకప్పులూ అవీ తీసుకుని మెల్లిమెల్లిగా అక్కడనించి వెళ్ళిపోయింది.

ఇక్కడ కొంచెం వెనకాలజరిగినకథ చెప్పవలసిన అవసరంఉంది. ఆయన ఇక్కడికివచ్చి అప్పుడే నెలరోజులయింది. ఆయన అప్పటినించీ తిరిగి ఇంటికి వెళ్ళనేలేదు. మహిముడికి జబ్బుచేసినసందర్భంలో సురేశుడిఇంటికి వెళ్ళినప్పుడు ఆయనకి మృణాలతో పరిచయంకలిగింది; కాని ఇప్పుడు మృణాల ఆతిథ్యం అనుభవిస్తూ ఉండడంవల్ల ఆయనకి మృణాల పరిచయంలో ఉన్నమహత్త్వం బోధపడింది. ఆయన కీ పరిచయంవల్ల శరీరమూ మనస్సూ బంగారుగొలుసులతో కట్టివేసినట్లయింది. ఎంత ప్రయత్నించినా ఆయన ఈబంధనంలోనించి విడిపించుకోలేకపోయారు.

ఆయన మహిముణ్ణి కలుసుకోలేకపోయారు. ఆయనవస్తున్నారని తెలియడంతోనే మహిముడు అక్కడినించి వెళ్ళిపోయాడు. మహిముడు వెళ్లిపోతూంటే మృణాలఅతన్ని ఆపడానికి ఏమీప్రయత్నించ లేదు. ఆమెకు చిన్నప్పటినించీ అతనిసంగతి బాగా తెలుసును. కేదారబాబుని చూడడం ఇష్టంలేక అతను వెళ్ళిపోతున్నాడన్న సంగతికూడా

ఆమెకు తెలుస్తున్నా. ఆమె "మహిముడు రాసిన ఉత్తరం చూసుకుని కేదారబాబు అల్లుడికీ కూతురికీ సమాధానం కుదర్చడంకోసం ఇక్కడికి వస్తున్నా" రని అనుకుంది. అంతేగాని అసలు సంగతి ఆమెకేమీ తెలియదు! ఇంతవరకూ అసలు సంగతి ఏమిటంటో ఎవ్వరికీ కూ తెలియదు! అంతకంతకి వారిద్దరి మధ్యా అనుమానాలు ఎక్కువ అవడం మొదలుపెట్టింది. వాళ్లు ఆ అనుమానాలతోనే కష్టాలు భరించి అల్లాగే కాలక్షేపం చేస్తున్నారు. ఆకాశంలో కారు మేఘాలు దట్టంగా అలుముకున్నాయి. ఒకవేళ ఆ మేఘాలు తొలగిపోతే దానివెనకాల ఉన్న అంధకారంమాత్రమే కనిపిస్తుంది. అంతే! వెన్నెల మాత్రం కనబడదు!

సురేశుడి పినతల్లి సురేశుడికబురు తెలియక ఎంతో కంగారుపడి మృణాలకి ఒక ఉత్తరం రాసింది. ఆ ఉత్తరం కేదారబాబుచేతుల్లో పడింది. మహిముడిదగ్గిరనించికూడా ఒక ఉత్తరం వచ్చింది. అతను అందులో తను ఒకజమీందారుగారింట్లో ట్యూషను చెబుతూన్న సంగతి రాశాడు. కేదారబాబు ఆ ఉత్తరం నాలుగైదుసార్లు చదివారు. ఆయనకి అందులో ఎక్కడా అచలసంగతి కనబడలేదు. ఆ ఉత్తరాలు రెండూ దగ్గిరపెట్టుకుని చదివితే ఉన్నవిషయం తెలిసిపోతూనేఉంది. కాని అసలు ఏమిజరిగిందో తెలుసుకోడానికి ఆయనదగ్గిర శక్తిలేకపోయింది.

అచల ఆయనకి లేకలేక పుట్టినపిల్ల. ఇంతేకాదు. తల్లి పోయినప్పటి నించీ ఆయన అచలని తల్లిలాగ పెంచి పెద్దదాన్నిచేశారు. ఆమెకి ఏదో అమంగళం జరిగిందనే భయంచేత ఆయన శరీరం రోజురోజూ శుష్కించిపోతూంది. బంగారంలాటి శరీరచ్ఛాయ క్రమక్రమంగా నల్లబడిపోతూంది. ఇందులో ఇంకొకచిత్రం ఉంది. ఆయన తండ్రి అవడంచేత కూతుర్నిగురించి బొత్తిగా తెలియడం మానేసింది.

ఆపల్లెటూళ్లో ఇద్దరుముగ్గురు ఇరుగుపొరుగు పెద్దమనుష్యులు

అప్పుడప్పుడు ఆయనతో పిచ్చాపాటీ మాట్లాడడానికి వస్తూండేవారు. కాని ఆయనమాత్రం ఎక్కడికీ వెళ్ళేవారుకారు. మృణాల అప్పుడప్పుడు ఈవిషయాన్నిగురించి ప్రస్తావిస్తూఉండేది ; కాని ఆయన ఒకనవ్వు నవ్వేసి "నాకు ఒకళ్లఇంటికి వెళ్ళవలసిన అవసరం ఏమి ఉందమ్మా ! నావంటి మ్లేచ్ఛుడు ఇంకొకళ్ళ ఇంటికి వెళ్లకుండా ఉంటేనే మంచిది" అనేవారు. మృణాల "అయితే వాళ్లంతా మీదగ్గిరికి ఎందుకువస్తారు?" అనేది. ఆయన ఆమాటకి ఏమీ సమాధానం చెప్పకుండా గొడుగు వేసుకుని మెల్లిమెల్లిగా మైదానంవైపు వెళ్ళిపోతూఉండేవారు. ఆమైదానానికి సమీపంలో కొంతమంది రైతుల ఇళ్లున్నాయి. ఆయన వాళ్ళ ఇళ్ళకి వెళ్ళివాళ్ళతో పరిచయం కలిగించుకున్నారు. ఆపైనవాళ్ళకష్టసుఖాలన్నీ కనుక్కుంటూ ఉండేవారు. వాళ్ళతో ఏవేవో విషయాలనిగురించి చర్చిస్తూఉండేవారు. కొంతసేపు ఆవిధంగా కాలక్షేపం చేసి కొంచెం పొద్దెక్కేసరికి ఇంటికి తిరిగివస్తూండేవారు. ప్రతీరోజూ పొద్దున్నే లేచి టీతాగినతరవాత ఇంచుమించుగా ఆయనచేసే పని ఇది.

పుట్టినప్పటినుంచీ కేదారబాబుకలకత్తాలోనే ఉన్నారు. ఆకలకత్తాకి చుట్టూ అనేకగ్రామాలున్నాయి ; కాని కేదారబాబు కుటుంబానికి అప్పుడే చాలాకాలాన్నించి ఆగ్రామాలతో సంబంధం తెగిపోయింది. బ్రాహ్మమతం స్వీకరించడంతోనే ఆయనకి బంధువులుకూడా దూరమైపోయారు. అందుచేత పట్టణవాసస్థులలాగ ఆయన చాలామంది బంధువుల్ని మరిచిపోయారు ; కాని కొందరుకొందరు బంధువుల్ని గురించి ఆయనకి ఎన్నెన్నో విషయాలు బాగా జ్ఞాపకంఉన్నాయి. పట్టణవాసం సంగతి ఏమీ తెలియకుండా జన్మంతఉన్నంతకాలమూ పల్లెటూళ్ళలో ఉండే గ్రామీణుల్ని చూసి "ఆయన వీళ్ళంతా కేవలం పశువులు" అని అనుకునేవారు; కాని ఈవేళ దురదృష్టకాలసర్పం ఆయనహృదయం మీదాడ గట్టిగా కాటు వెయ్యడంమూలాన్ని బ్రహ్మసమాజం అంటే

ఆయనకి బాగా స్వైముఖ్యం కలిగింది. ఆతరవాత క్రమక్రమంగా పల్లె టూరిరైతులతో పరిచయం కలిగినకొద్దీ ఆయనకి వాళ్ళమీద ఇష్టం ఎక్కువయింది. దానితోటి ఆయనహృదయంలో క్రమక్రమంగా తన సమాజంమీదా, ఆచారాలమీదా, ధర్మంమీదా విరక్తి కలిగింది. విరక్తితోబాటు దానిమీద విద్వేషంకూడా పెరగడం మొదలుపెట్టింది.

చదవడమూ, రాయడమూ రాకపోయినా పల్లెటూరివాళ్ళదగ్గిర మంచిమర్యాదా, మంచిప్రవర్తనా ఉన్నాయని కేదారబాబు గ్రహించారు. యుగయుగాలనాటి ప్రాచీన నాగరికత వాళ్ళరక్తనాళాల్లో ప్రవహిస్తూంది. ప్రపంచకంలోఉండే ధర్మశాస్త్రాలన్నీ వాళ్ళకి తెలుసును. వాళ్ళకి ఏమతంమీదా ద్వేషంలేదు. అన్నిమతాలూ ఒక్కటే ననిన్నీ, మానవసేవే మాధవసేవఅనిన్నీ వాళ్ళకి పూర్తిగా తెలుసును. ఈవిషయంలో వాళ్లు ఏఇతరమతస్థులకీ తీసిపోరు. హిందువుల పరమేశ్వరుడూ మహమ్మదీయుల అల్లాకూడా ఒక్కటేనని వాళ్ళుఎరుగుదురు.

ఈవిషయాలన్నీ గ్రహించి ఆయన లోలోపల ఎంతోసిగ్గుపడ్డారు. ఆయన మనస్సులో. "ఈపల్లెటూరివాళ్లు మాకంటె ఏవిషయంలో తక్కువ? మేము ఏవిషయంలోనూకూడా వీళ్ళకంటె గొప్పవాళ్ళమని అనుకోవడానికి వీల్లేదు. అసలు వీళ్ళకంటె మాకు ఎక్కువ తెలిసింది ఏమిఉంది? మేము వీళ్ళసంబంధం విడిచిపెట్టి దూరంగా ఎందుకు వెళ్ళిపోయాము? ఆదూరం సామాన్యమైన దూరంకాదు. దానివల్లనే మేమంతా వీళ్లకి మ్లేచ్ఛుల్లాగ కనిపిస్తున్నాము. ఇది ఈవిధంగా ఎందుకు జరిగింది?" అనిఅనుకున్నారు. ఈవిధంగా ఆలోచించుకుంటూ ఇంటికి తిరిగివచ్చేటప్పటికి అప్పుడే పదిగంటలయింది. మృణాల ఆయనకి ఎదురుగుండావచ్చి "బాబయ్యగారూ! నిన్న మీకు ఒంట్లో బాగుండ లేదు. మీరు రీవేళ చెరువులో స్నానంచెయ్యడానికి వెళ్ళవద్దు. నే నీవేళ మీకు వేడినీళ్ళు పెట్టాను" అంది.

కేదారబాబు "అప్పుడే వేడినీళ్ళు పెట్టావా?" అని తెల్లబోయినట్టు ఆమెకేసి అదేపనిగా చూస్తూ నుంచున్నారు.

స్నానంఅయిపోయినతరవాత మృణాల పూజచెయ్యడానికి కూర్చుంది; కాని కేదారబాబు అమెగులచప్పుడువిని చటుక్కు నిలేచినుంచుంది. తడిసిన ఆమె తలవెండ్రుకలు వీపుమీద వేళ్ళాడుతున్నాయి. ఆమె పట్టుబట్ట కట్టుకుంది. ఆమె ముఖంవైపు చూస్తే ఎంతో ప్రసన్నంగా కనబడింది; శరీరం మూర్తీభవించిన శుచిత్వంగా ప్రకాశించింది. కేదారబాబు ఆమె కేసి చూస్తూ "నాకోసం నువ్వింత ఇబ్బందిపడటం ఎందుకమ్మా! నువ్వు ఇంత శ్రమపడవలిసిన అవసరం లేదే!" అన్నారు. ఆతరవాత మళ్ళీ ఒకచిరునవ్వునవ్వి "నేను కలకత్తాలో ఉన్నవాణ్ణిగదా! నాకెప్పుడూ కొళాయికగ్గిర స్నానంచెయ్యడం అలవాటు. నీకుంచితనం మూలాన్ని మీచెరువుకూడా నాకుపకారం చేస్తూన్నట్టే కనిపిస్తూంది. ఆ చెరువులో స్నానంచేస్తే నాఆరోగ్యం ఎప్పుడూ పాడవదమ్మా! అందుచేత నేను చెరువులో స్నానంచెయ్యడానికి వెడతాను" అన్నారు.

మృణాల దానికి అంగీకరించక "అబ్బే! మీరు చెరువులో స్నానంచెయ్యడానికి వల్లకాదు బాబయ్యగారూ! నిన్న మీకు ఒంట్లో బాగుండలేదు. నా కానంగతి తెలుసును. నేను వేడినీళ్ళు తీసుకు వస్తాను. మీరు ఒంటికి నూనె రాసుకుంటూ ఉండండి!" అని అక్కడి నించి గబగబా లోపలికి వెళ్ళిపోయింది. కేదారబాబు చటుక్కుని ఆమెను ఆగమని "సరే! నేను ఒంటికి నూనె రాసుకుంటానుగాని నిన్ను ఈవేళ ఒకమాట అడగాలని అనుకుంటున్నాను. నువ్వు ఇంత చిన్న వయస్సులో ఈవిధంగా ఇతరులకి సేవచెయ్యడం ఎక్కడనేర్చుకున్నావమ్మా! ఇల్లాగ పరిచర్యచెయ్యడం నేను ఎక్కడా చూడలేదమ్మా!" అన్నారు. సిగ్గుచేత మృణాల ముఖం అంతా ఎర్రబడిపోయింది. అయినాగాని ఆమె బలవంతంగా నవ్వు తెచ్చుకుని "బాబయ్యగారూ! మీరు నాకేం పరాయి

వారా!" అంది. కేదారబాబు "కాదమ్మా! పరాయివాణ్ణికాదు. నేను మీఅబ్బాయిలాంటివాణ్ణి! కాని నువ్వు ఈవిధంగా తప్పించుకుపోవడానికి వీల్లేదు. నేను అడిగినదానికి సమాధానం చెప్పితీరాలి!" అన్నారు.

మృణాల ఇంకొకపక్కకి తిరిగి చూస్తూ నవ్వుతూ "బాబయ్యగారూ! అంత ప్రయత్నంచేసి నేర్చుకోడానికి ఇదేమైనా కష్టమైనపనా? మాలాంటి వాళ్ళకిది పుట్టినప్పటినుంచీ అలవాటే! దానికేంగాని మీకు స్నానం చెయ్యడంకోసం పెట్టిననీళ్లు చల్లారిపోతున్నాయి బాబయ్యగారూ!" అంది. కేదారబాబు "అయితేసరే! అల్లాగేచేస్తాను" అని మళ్ళీ గంభీరంగా కొన్నాళ్ళనించి నే నీవిషయమే ఆలోచిస్తున్నాను. మృణాలా! మనిషి ఈత నేర్చుకుంటాడు. ఆపైన ఈదడం ప్రారంభిస్తాడు; కాని చేపలూ అవీ పుడుతూనే నీళ్ళలో ఈదుతాయి. అవి ఎప్పుడు ఈదడం నేర్చుకుంటాయో ఎవ్వరికీ తెలియదు. పక్షిపిల్లలకైనా ఒళ్లుదాచుకుంటే పనులు సానుకూలపడవమ్మా! ఎప్పుడో అప్పుడు మనిషిఅన్నవాడు ప్రతీదీ కష్టపడి నేర్చుకోవలసిందేనమ్మా! కాని నువ్వు ఈ పల్లెటూళ్లో ఉండి ఈ విద్య పుట్టుకతోనే నేర్చుకోవడం చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. "అసలు నీవంటి వ్యక్తిని తయారుచేసిన సంఘాన్ని గురించే నేను బాగా ఆలోచిస్తున్నాను నేననేదేమిటంటే—" అన్నారు.

"కాని మీకోసం పెట్టిననీళ్లు చల్లారిపోతున్నాయి."

"పోనీలే! చల్లారిపోతే పోనీ! చెరువులో కావలిసినన్ని నీళ్ళున్నాయి. మీఅబ్బాయి నీదగ్గర కూర్చుని ఎన్నెన్ని కొత్తమాటలు నేర్చుకుంటున్నాడో వాడికే తెలియదు! ఇంకొకవిషయం ఉందమ్మా! నాకు దేవతలన్నా ఈ మంత్రాలన్నా ఏమీ నమ్మకం ఉండేదికాదు; కాని నువ్వు చక్కగా స్నానంచేసి పట్టుబట్టకట్టుకుని పూజ చేసుకుంటూంటే నాకు మళ్ళీ జంధ్యంవేసుకుని నీకుమల్లే పూజ చేసుకోవాలని ఉందమ్మా!" అన్నారు. ఆమాటవిని మృణాల "అదేమిటి బాబయ్యగారూ! అల్లాగ

అంటున్నారు! మీరు మీఆచార వ్యవహారాలూ, మీసమాజమూ విడిచిపెట్టి ఇంకొకళ్ళ ఆచార వ్యవహారాలు ఎందుకు అనుసరిస్తారు! మీసమాజంలో ఆచరించేవి మంచివికావని ఎవరూ అనలేరుగదా!" అంది.

ఆమాటవిని కేదారబాబు ఇల్లా అన్నారు. "మాసమాజంలో తప్పులున్నాయా? లేవా! అనేదికాదు మనకిప్పుడుప్రశ్న. అదివేరేసంగతి. అదీగాక మాసమాజాన్ని నిందించడంకూడా నాఅభిప్రాయంకాదు. అది మంచిదయినా చెడ్డదయినా దాన్ని విడిచిపెట్టడానికి కావలిసినంత శక్తి ఇప్పుడు నాదగ్గిరలేదు. అదీగాక మతంమార్చడంవల్ల ఇప్పుడు ఉపయోగం కూడాలేదు. ఏదో చివరదాకా ఇంక ఈదారిలో ఉండవలసిందే! కాని నిన్ను చూసినప్పుడు నేనెంతో ఆశ్చర్యపడుతున్నానమ్మా! నువ్వు ఇంత చిన్నవయస్సులో ఎంతో స్వార్థత్యాగం అలవాటుచేసుకున్నావు! స్వర్గస్థులైన వాళ్ళమీద నీకున్న భక్తి ఇంతాఅంతా అని చెప్పడానికి వీల్లేదు!—సరేలే! పోనీలే! ఆమాటలన్నీ ఇప్పుడెందుకు? కాని చిన్నప్పటినించీ పుట్టిపెరిగిన సమాజంలో ఉన్న మంచిచెడ్డలు ఆలోచించకుండా ఉండలేకుండా ఉన్నానమ్మా!"

మృణాల ఆయన అన్నమాటలు విని మనస్సులో చాలా నొచ్చుకుంది. ఆమె వ్యక్తిగతంగా ఎన్నో బాధలు అనుభవిస్తాంది. కేదారబాబు అవ్వన్నీ సుగుణాలని వాటిని హిందూసంఘంమీద ఆరోపించడం మృణాలకి ఎంతో అన్యాయంలాగ కనిపించింది. ఆమె ఆమాటలన్నీ విని ఒక్కనిమిషం ఆగి "బాబయ్యగారూ! మీరు హిందూసంఘాన్ని గురించి కొంచెం జాగ్రత్తగాఆలోచిస్తే అందులోకూడా మీకు అనేకమైనలోపాలు కనిపిస్తాయి. మాలోకూడా తమలోఉన్న దోషాలు సమాజంమీద ఆరోపించడానికి అందరూ సిద్ధపడుతూఉంటారు. మేముకూడా—" అని ఇంకా ఏదో చెప్పబోయింది. కాని ఆమె చెప్పేమాట పూర్తిచెయ్యకుండా కేదారబాబు చటుక్కుని అందుకుని "నేను ఇప్పుడు అల్లాంటి

పని ఏదీ చెయ్యడంలేదమ్మా! మీ హిందూసంఘంలో అనేకులో పాటుండ వచ్చును; కాని నీవంటి మనిషి ఆసంఘంలో పుట్టలేదు. నీలాంటి వ్యక్తి మాలో కంచుకాగడ వేసినా కనబడదమ్మా!" అన్నారు.

మృణాల ముఖం సిగ్గుచేత మళ్ళీ ఎర్రకలవపువ్వులాగ మారిపోయింది. ఆమె క్షణంకాలం ఆగి "బాబయ్యగారూ! మీరు మాటిమాటికీ నన్నీవిధంగా పొగుడుతూంటే నేనుమీకు కనబడకుండా ఎక్కడికైనా పారి పోతాను. ఇంక ఆపైనమీకు నన్ను పట్టుకోవడంకూడా కష్టమైపోతుంది. ఆమాట నేను ముందుగానే చెబుతున్నాను!" అంది. ముసలాయన ఆమాటకి వెంటనే ఏసమాధానమూ చెప్పలేక పోయారు. వాడిపోయిన ముఖంతో ఆమెకేసి అల్లాగే చూస్తూనుంచున్నారు. అల్లాగ కొంచెం సేపుండి ఆపైన "మెల్లిమెల్లిగా నేనుకూడా నీతో ఒకమాట చెబు తున్నాను వినమ్మా! నువ్వు ఎక్కడికో పారిపోతావని అంటున్నావుగాని నేను నిన్నెప్పటికీ పారిపోనివ్వను! నువ్వు నాకళ్ళకి మాణిక్యంలాంటి దాన వమ్మా! నాతల్లివికూడా నువ్వేనమ్మా! ఇంక నాకు నవ్వొకక్కత్తివేగతి! ఎప్పుడో అప్పుడు నీకు నన్ను జాగర్తగా చూడవలసిన బరువుతేకుండా పోతుంది. ఇంక నిన్ను ఆట్టేకాలం శ్రమ పెట్టను! అప్పుడే నాకది అంతా కళ్ళకి ఎదురుగుండా కనిపిస్తోంది" అన్నారు. అల్లాగ అంటూ ఉంటే ఆయనకళ్ళమ్మట కన్నీళ్ళు పొంగిపొంగి పైకివచ్చాయి. ఆ తర వాత చొక్కాఅంచుతో కన్నీళ్ళుతుడుచుకుని ఆయన "అమ్మా! నేనింకా ఒక్కపనిచెయ్యవలసిఉంది. అదిమరేమీకాదు. మహిమణ్ణి కలుసుకోవడమే. అతను నాకు కనబడకుండా పారిపోవడానికి కారణ మేమిటో బోధపడడంలేదు. ఆ విషయం నేను అతన్నే అడగాలని అను కుంటున్నాను. అసలు అతను ఎక్కడో అక్కడ బతికిఉన్నాడా?" అన్నారు.

"బాబయ్యగారూ! మీరు ఎందుకని ఇంత భయపడుతున్నారు?"

ముసలాయన ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి "భయ మెందు

కంటున్నావా? కన్నకూతురు ఏమయిపోయిందో అనే భయం తప్ప తండ్రికి ఇంక ఏమిభయం ఉంటుందమ్మా!" అన్నారు.

## ౩౮

కేదారబాబు ఇప్పుడు కుమార్తెవిషయం తలుచుకుని ఎంతో బాధపడుతూన్నారు. బహుశః ఆయన కుమార్తె మరణవార్త విని ఉంటేకూడా ఇంతఎక్కువగా బాధపడిఉండరు. మృణాల ఈసంగతి చూచాయగా తెలుసుకుని మనస్సులో ఎంతో సంకోచపడి ఆయనదగ్గిరికి రావడానికి సిగ్గుపడింది. కేదారబాబుకి ఈవిషయం హృదయంమీద ఒకగొడ్డలిపెట్టు లాగ కనబడింది. ఆయన చాలాసేపు ఎమీ మాట్లాడకుండా కూర్చుని తెల్లని గెడ్డంలోనుంచి మెల్లిగా వేళ్ళు పోనిస్తూ పెద్దనిట్టూర్పు విడిచి పెట్టారు. ఆ తరవాత నూనెగిన్ని చేత్తోపట్టుకుని ఒంటికి నూనె రాసుకున్నారు.

ఈవేళ పొద్దుటినుంచీ ఆకాశం నిర్మలంగానేఉంది; కాని మధ్యాహ్నం నుంచీ మేఘాలు కొంచెం అటూఇటూ పచారుచెయ్యడం మొదలు పెట్టాయి. కేదారబాబు ఇప్పుడే నిద్రపోయిలేచారు. ఆ తరవాత ఆయన వరుపుమీద కూర్చుని పడమటివైపు కిటికీ తెరిచి ఆకాశంకేసి చూడడం మొదలుపెట్టారు. ఆయనకి ఎదురుగుండా ఉన్న ఒకమామిడిచెట్టు బాగా పూచింది. తేనెటీగలు ఆచెట్టుమీద ఝుమ్మని ధ్వనిచేస్తూ ఇటూ అటూతిరుగుతున్నాయి. ఆపక్కని బాగా ఎలిసిఉన్న ఆవుఒకటి పచ్చగడ్డి మేస్తూంది. మృణాల దాన్ని ఒకపొడుగైన తాటితో కట్టివేసింది. అది అప్పుడప్పుడు బుస్సుమని ఊపిరివిడుస్తూ మెల్లిమెల్లిగా గడ్డి మేస్తూంది. ఆ ఆవు వెనకాలనించి ఒక కాలిదారి కొంచెంకొంచెం కనబడుతూ ఉంది.

"బాబయ్యగారూ! మీకు టీ తీసుకురమ్మన్నారా?"

కేదారబాబు వెనక్కి తిరిగిచూసి "ఇప్పుడే తీసుకువస్తావా?

తల్లీ!" అన్నారు.

"సరి! అప్పుడే దగ్గిరదగ్గిరగా సూర్యాస్తమానం కావస్తూంది"

ఆమాటమీద కేదారబాబు ఒక చిరునవ్వునవ్వి తలెత్తి ...ది గడియారం తీసిచూసి "ఇంకా ...నా కాలేదమ్మా!" అన్నారు. మృణాల "ఇంకా మూడే కాలేదా? అయితే ఏం లెండి! ... మీరు బొత్తిగా ఏమీ నోట్లోపెట్టుకోలేదు" అంది. కేదారబాబు ఇంక ఆమెమాటకి అడ్డుచెప్పడంవల్ల ఏమీ ప్రయోజనం లేదనుకుని "సరే పోనీ తీసుకురా" అన్నారు. మృణాల ఒక... ... కూరుకుని "మీకు వేడివేడి పెసరట్లంటే ఇష్టమే కాదూ!" అంది.

"అవును ఆమాటనిజమే!"

"అయితే అవికూడా రెండు తీసుకురమ్మన్నారా?"

కేదారబాబు "తీసుకువస్తావా అయితే తీసుకురా!" అని చెప్పి ఆమె కేసిచూస్తూ బలవంతంగా చిరునవ్వునవ్వారు. మృణాల వెళ్ళగానే ఆయన ఆ కిటికీతీసి మళ్ళీ అటు కేసి చూడడం మొదలుపెట్టారు. ఆయనకి ప్రపంచమంతా ఏదో అలుక్కుపోయినట్లు కనబడింది. ఉత్తరక్షణంలో అయిదారు వేడి వేడి కన్నీటిబింధువులు ఆయన కళ్ళల్లోనించి జారి కిందపడ్డాయి. ఆయన చటుక్కుని చొక్కా అంచుతో ఆకన్నీళ్లు ఆ... లేకుండా తుడుచుకుని ముఖం ప్రశాంతంగా కనబడడంకోసమని ఆపక్క నున్న ఎమర్సను పుస్తకం తెరచి ఎదురుగుండా పెట్టుకున్నారు.

ఆయనకి ఆలోచించగా ఆలోచించగా "ఈసృష్టి ఎంతవిచిత్రమైనది" అని అనిపించింది. ఇంక ఆయన బతికేరోజులన్నీ వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చును అన్నట్లుగా ఉన్నాయి. అల్లాంటి పరిస్థితిలో ఆయన పూర్వపు అనుభవాలన్నీ మరచిపోయి ఎన్నో కొత్తవిషయాలు నేర్చుకోవలసిన అవసరంకలిగింది. ఆయనకు ఈగడిచిపోయిన జీవితం అంతా కేవలం వ్యర్థమైపోయినట్లు కనిపిస్తూంది. ఈ జీవితంఅంతా వ్యర్థం ఐపోయిందని

తెలుసుకోడానికి ఈఒక్క నెలా సరిపోతుందని కూడా అనిపిస్తోంది" అని అనుకున్నారు.

ఇంతలో తలుపుదగ్గిర అడుగులచప్పుడువినబడింది. ఆయన చటుక్కుని తలపైకెత్తి చూశారు. మృణాల ఒకచేత్తో టీ. ఇంకొకచేత్తో పెసరట్లు పట్టుకుని లోపల ప్రవేశించింది. ఆయన ఆరెండూ రెండుచేతులతోనూ అందుకుని "ఈవేళ నేను కడుపునిండా భోజనం చెయ్యలేదన్న సంగతి తెలుస్తూంది. అయితే అమ్మాయి!—" అని ఏదో అనబోయారు.

"కాదు బాబయ్యగారూ! మీరు మాట్లాడడం ప్రారంభిస్తే ఇవన్నీ చల్లారిపోతాయి!" ఆమాటవిని కేదారబాబు టీగిన్నె చేత్తోపుచ్చుకుని టీఅంతా తాగి పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి "నేను, ముందుజన్మలో నువ్వే నాకు పుట్టాలని కోరుకుంటున్నానమ్మా! పిల్లల్ని పెంచడం నాకు బాగా తెలుసునమ్మా! ముందుజన్మలో నువ్వు కూతురువైతే నిన్ను తనివితీరా పెంచి పెద్దదాన్ని చేసుకుంటానమ్మా!" అన్నారు. ఆమాట అంటూంటే ఆయన కంఠసర్వం కంపించింది. ఈవిధంగా ఆయన మాట్లాడడం మొదల్లు పెట్టేసరికి మృణాలకి ఎంతో సంకోచంకలిగింది. మృణాల ఆయన వచ్చిన ఆవేశం గమనించకుండా నవ్వుతూ "అయితే సరేలెండి బాబయ్యగారూ! మీకు ముందుజన్మలో కలిగే సంతానంలో నేనుకూడా ఒకదాన్ని అవుతాను!" అంది.

ముసలాయన చటుక్కుని కాదన్నట్లు తల అడ్డంగా తిప్పుతూ "కాదమ్మా కాదు! అనేకమంది పిల్లల్లో నువ్వొకపిల్లగా పుట్టడంకాదు. నువ్వు ఒక్కత్తివే నాకూతురువై పుట్టాలి. నిన్ను అస్తమానమూ నేను మనస్సులో తలుచుకుంటూఉండాలి. నేనీజన్మలో నేర్చుకున్నవన్నీ నీకు ఒక్కొక్కటే బోధపరుస్తూ ఉంటాను. మళ్ళీ అవ్వన్నీ ఇంకొక జన్మలో ఉపయోగిస్తాను. నాజన్మలన్నీ ఇల్లాగే వెళ్ళిపోతూంటాయి!" అన్నారు. ఈమాట చెప్పినతరవాత ఆయన మృణాలకి కనబడకుండా

అనాలని అనుకొంది గాని ఆయనముఖం చూసి మరిమాట్లాడలేకపోయింది.

కొంతసేపటిదాకా ఎవరూ ఏమీమాట్లాడలేదు. మృణాల తల వంచు కుని కదలకుండా కూర్చుంది. అల్లాగ కొంతసేపున్నతర్వాత ఆఖరికి కేదారబాబు "నేను ధర్మం విడిచిపెట్టి ఇంకొకధర్మం అవలంబించాను. ఈవిషయంలో నేనుఇంకొకళ్లకి సమాధానం చెప్పినా చెప్పకపోయినా నాకు నేనే సమాధానం చెప్పుకోవలసిన అవసరం ఏర్పడింది. ఈప్రశ్న ఇన్నాళ్లనించీ తప్పించుకున్నాను కాని ఇంక తప్పించుకోవడానికి మార్గం లేదు. ధర్మంవిషయంలో నాకేమిఅనిపిస్తూంది అంటే-" అన్నారు. ఆమాట వినగానే మృణాల కళ్లెత్తి ఆయనకేసి చూసింది. కేదారబాబు ఆసంగతి గమనించి చటుక్కుని "నువ్వేం భయపడక్కర లేదమ్మా! నీసంగతి చెప్పి నిన్ను చిన్నబుచ్చడం లేదులే! ఇన్నాళ్లు గడిచినతరువాత ఒక్క విషయంమాత్రం నిశ్చయంగా తెలిసింది. వాదోపవాదాలవల్లా యుద్ధాల వల్లా ప్రపంచకంలో ఏవస్తువైనా సంపాదించవచ్చును; కాని ధర్మం అనేది సంపాదించడంమాత్రం చాలాకష్టం!" అన్నారు.

మృణాల ఆయన అన్నమాటకి అభిప్రాయం ఏమిటో బోధ పరుచుకుని మెల్లిమెల్లిగా "బాబయ్యగారూ! మీరన్నమాట నిజమే! కాని, ధర్మం నేను సర్వోత్తమమని అనుకున్నాననుకోండి! అయితే దానికోసం తగాదాలు పెట్టుకుని వాదాలు పెంచుకోవడం ఎందుకో నాకు తెలియడంలేదు!" అంది. కేదారబాబు "నాక్కూడా కొన్నాళ్లకి ఆవిధంగా అనిపిస్తే అనిపించవచ్చును; కాని ఎప్పుడో ఒకప్పుడు వాటి అవసరం కనబడుతూనే ఉంటుందమ్మా! మనం ఏవస్తువునీకూడా ప్రీతిపూర్వకంగా త్యజించలేము! ఒకవేళ ఎప్పుడైనా దేన్నైనా విడిచి పెట్టామనుకో! దానికోసం మనస్సు అంతమూనమూ బాధ పడుతూనే ఉంటుంది. అందుకనే నీలో ఈ విషయాలన్నీ ఇంత వివరంగా చెప్ప వలసిన అవసరం కలిగింది. అయితే మీరందరూ చిన్నతనంనించీ

అలవాటయిన ధర్మాన్నే అవలంబిస్తున్నారు. దాని మంచిచెడ్డలతో మనకిప్పుడు ప్రసక్తిలేదు. అయితే ఈరెండింటికీ మధ్యనున్న భేదం ఎల్లాంటిదో కాస్త గమనించు!" అన్నారు.

మృణాల మాట్లాడకూరుకుంది. ఆమెకు చటుక్కున సమాధానం చెప్పడానికి కావలసిన అభిప్రాయాలేవీ తట్టలేదు. కేదారబాబుకూడా ఆతరవాత ఒక్కనిమిషందాకా మాట్లాడకూరుకుని "ఈవేళ ఎందుచేతనో గాని చాలాకాలంకింద మరిచిపోయిన విషయాలన్నీ ఒక్కటొక్కటే జ్ఞాపకం వస్తున్నాయమ్మా! అయితే ఇవి ఇన్నాళ్లనించీ ఎక్కడఉండిపోయాయో!" అన్నారు. ఆమాటవిని మృణాల రెండుకళ్లూ పైకెత్తి "ఆ విషయాలేమిటి? బాబయ్యగారూ!" అని అడిగింది.

కేదారబాబు "అబ్బే! మరి ఏవిషయాలూ కావమ్మా! నా స్వంత విషయాలే! భగవంతుడు నాకు గొప్పవాళ్లకి కావలసిన బుద్ధిబలం ఇవ్వలేదమ్మా! అందుచేత నేను ఒక గొప్పవ్యక్తిని కాలేకపోయాను. నేను అందరిమోస్తరుగా ఒక సామాన్యమైన వ్యక్తిని. కేవలం సాధారణ వ్యక్తులతో కలసిమెలిసి తిరుగుతూ నాజీవితం అంతా గడిపేశాను. ఐతే సమాజంలో సర్వశ్రేష్ఠులని అనిపించుకున్నవారి ఉపదేశాలు వింటూ ఉండడమూ సాధ్యమైనంతవరకు ఆచరిస్తూఉండడమూమాత్రమే నాకు తెలుసును. ఇప్పుడు ఆరోజుల్లో సంగతులు ఎన్నెన్నో జ్ఞాపకంవస్తున్నాయి! మృణాలా! నువ్వు ధర్మస్వీకారంలో తగాదా లెందుకు వస్తాయని అడుగుతున్నావు. తగాదాలకి అక్కడ అవకాశం ఏమీఉండదనా నీప్రశ్న! కాని నేను ఇన్నాళ్లనించీ తగాదాలూ అవ్వీ తప్పవనే అనుకుంటున్నాను. నేను ఎప్పుడూ అందరితోటీ ఈవిషయమే చెబుతూఉండేవాణ్ణి! ఇప్పుడు కూడా నేను అల్లాగే అనుకుంటున్నాను. హిందువులంతా కలిసి మనం వాళ్లని విదేశాల్లో తలఎత్తుకోడానికి వీల్లేకుండా చేస్తున్నామని అంటూంటారు. ఈ విషయంలో మనం క్రైస్తవమిషనరీలకంటె కూడా

ఎక్కువ అన్యాయంగా ప్రవర్తిస్తున్నాము : వాళ్ల అభిప్రాయము. ఈవేళ నాకు వాళ్లు మోపే నింద అబద్ధం అనడానికి ధైర్యం చాలకుండా ఉందమ్మా!” అన్నారు.

మృణాల ఆమాటలు విని చాలా కంగారుపడింది. కాని కేదార బాబు ఆవిషయం గమనించకుండా పూర్వపుధోరణిలో “ద్వేషమే లేకపోతే మనలో అధర్మపురుషులైనవారంతా ఆవిధంగా ఉపన్యాసా లెందుకిస్తారు. చెప్పమ్మా! పెద్దపెద్ద ఉపన్యాసవేదికలమీదకెక్కి పెద్దపెద్దగొంతుకలతో ‘మిగిలినమతాలు అనుసరించి ఎందుకుపాడై పోతారు! మామతం అనుసరించండి!’ అని ఎందుకు ఘోషిస్తారు? ఎందుకమ్మా? ఇన్నిమాటలు! వాళ్ళంతా ఉపదేశించడంలో చాలా ఘనులే! కాని కంచుకాగడాలువేసి వెతికినా వాళ్లల్లో ధర్మం కన బడదమ్మా!” అన్నారు.

మృణాల ఎంతోనొచ్చుకుని “బాబయ్యగారూ! మీరీమాటలన్నీ నాతో ఎందుకు చెబుతారు. నాకు వాళ్ళంతా పూజ్యులు!” అంది. ఆపైన ఆమె తలమీద రెండుచేతులూ జోడించి వాళ్ళకినమస్కా రించింది. ఆమె భక్తిభావంచూసి కేదారబాబు నిర్ఘాంతపోయి అల్లాగే ఆమెకేసి చూస్తూకూర్చున్నారు. ఆతరవాత దాసీదానిపిలుపు విని మృణాల అక్కడినించి వెళ్ళిపోయింది. అయినాగాని కేదార బాబు అల్లాగే కూర్చున్నారు. దాసీది ఎందుకు పిలిచిందో కనుక్కొని మృణాల వెంటనే తిరిగివచ్చేసింది. కేదారబాబు ఆమెనుచూసి ఎంతో ఆవేశంతో చటుక్కున “మృణాలా! నాజీవితంఅంతా ఈవిధంగా ఒకళ్లదోషాలు ఎన్నడంలోనే వెళ్లిపోతుందా? నేను దీన్నివిడిచిపెట్టి ఇంక ఇవతలపడలేనా?” అన్నారు.

మృణాల “మీ దోమతెర ఒకమూల కొంచెం చిరిగిపోయింది. కొంచెం లాగిపట్టుకోండి! నేను కుడతాను.” అంది. ఆతరవాత ఆమె

ట్రంకుపెట్టెలోనుంచి ఒక సూదులడబ్బీ తీసింది. కేదారబాబు ఆ తెర ఒకమూలాలపట్టుకున్నారు. ఆతర్వాత ఆమె కుట్టడంప్రారంభించింది. కేదారబాబు ఆమె ఎంతో శ్రద్ధగా ఆదోమతెర కుడుతూంటే ఆమె కేసి తదేకధ్యానంతో చూస్తూ కూర్చున్నారు. ఆమె కూడా తలఎత్తకుండా తనపని చేసుకుంటూ కూర్చుంది, ఆమెకేసి అల్లాగ చూస్తూంటే కారణంలేకుండా కేదారబాబు కళ్ళమ్మట కన్నీళ్ళు కారడం మొదలుపెట్టాయి. ఆయన మాటిమాటికీ కండువాఅంచుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ కూర్చున్నారు.

కుట్టడంపని పూర్తిఅయిపోగానే మృణాల మళ్ళీ సూదులడబ్బీ ఎక్కడఉందో అక్కడపెట్టి కేదారబాబుదగ్గిరకి వచ్చి "బాబయ్యగారూ! మీరురాత్రి ఏమిభోజనంచేస్తారు?" అంది. ఆప్రశ్నవిని కేదారబాబు పెద్దనిట్టూర్పువిడిచిపెట్టి కన్నీళ్లతో తడిసిన పెదవులతో చిరునవ్వు నవ్వి "ఇప్పుడు రాత్రిభోజనంసంగతి ఆలోచించవలసిన తొందరేమీలేదు. ఆసమయం వచ్చినప్పుడు దానిసంగతి చూసుకోవచ్చునులే. సరే దానికేంగాని నువ్వు కొంచెంసేపు అక్కడ నిలబడు!" అన్నారు. ఆపైన మళ్ళీ కొంచెంసేపు ఆగి "నేను ఈవేళచేసినంత తప్పుపని ఇంకెప్పుడూ చెయ్యదలుచుకోలేదు! అది ఈవేళతో ఆఖరైపోవాలి! నేనింక నానోటితో ఒకళ్ళని నిందించదలుచుకోలేదు. అల్లాంటినింద ఇంకనువ్వెప్పుడూ వినవు!" అన్నారు. ఆపైన మళ్ళీ కొంచెంసేపు ఆగి "నే నన్నమాటలుమూలాన్ని నీమనస్సుకి కష్టం కలగలేదుగదా! నేను నీమనస్సుకి కష్టంకలిగించాలనే ఉద్దేశంతో ఆమాటలు అనలేదుసుమా!" అన్నారు.

ఆయనకంఠస్వరం విని మృణాల ఉలిక్కిపడి "బాబయ్యగారూ! ఏమిటి? మీరీవేళ ఇల్లాగ మాట్లాడుతున్నారు? నేనెప్పుడైనా మీవిషయంలో మనస్సులో కష్టంపెట్టుకున్నానా?" అని అడిగింది.

కేదారబాబు ఆమాటవిని చటుక్కున తలఅడ్డంగా తిప్పుతూ ఇల్లాగఅన్నారు. "ఎప్పుడూ కష్టపెట్టుకోలేదమ్మా! ఎప్పుడూకష్టపెట్టుకోలేదు. నేను ముసలివాణ్ణిఅయినా నీకు కొడుకులాంటివాణ్ణే! అందుచేత నువ్వు నేనుచేసినపనులన్నీ నవ్వుతూ సహిస్తూంటావు. ఇంతకాలంనించీ నేను నాహృదయరక్తం ధారపోసి ఒకవిషయం గ్రహించగలిగాను. ఆవిషయం నేనీవేళ నీతో చెబుదామని అనుకున్నాను. అంతే! మృణాలా! నేను ఒకర్ని నిందిద్దామని అనుకోలేదు. మేమంతా ధర్మాన్ని బలవంతంగా బంధిద్దామని అనుకున్నాము. కాని అది ఆవిధంగాచేస్తే లభించేదికాదని తెలిసిపోయింది. తీవ్రమైన దుఃఖాగ్ని హృదయంఅంతా దహించివేస్తూన్నప్పుడుగాని మనిషికి ధర్మం ప్రత్యక్షం కాదు. ధర్మంవిషయంలో మనం ఏమాత్రం పొరబాటుచేసినా అది మన్ని తప్పించుకు వెళ్ళిపోతుంది. అయితే అల్లాంటి దురదృష్టం నాశత్రువుకైనా కలగకూడదు." అన్నారు.

మృణాల ఇంతసేపటినించీ ఎల్లాగోఅల్లాగ ఈప్రసంగం రాకుండా చూసింది. కాని కేదారబాబు ఆవిషయం ప్రస్తావించడంచూసి మనస్సులో సంకోచపడి ఎంతో బాధపడింది. కాని ఇప్పుడామె అక్కడినించి వెళ్ళిపోడానికి మాత్రం ప్రయత్నించలేదు. ఏమీ సమాధానంచెప్పకుండా మాట్లాడకూరుకుంది. కేదారబాబుకూడా మనస్సులో ఎంతోబాధ అనుభవించారు. ఆబాధవల్ల ఆయనదృష్టి తీక్షణంగాకనబడింది. కాని ఆయన ఎల్లాగోఅల్లాగ ఆబాధసహించి "అమ్మా! ప్రపంచకంలో నువ్వు ఒక్కత్తివి తప్ప నాకు మరెవ్వరూలేరు! నాకు ఈమాట ఎన్నిసార్లు చెప్పినా ఇంకా చెప్పాలనేఉంది. ఈవిధంగా నన్నాదరించినవారు అంతకుపూర్వం నాకెవ్వరూ కనబడలేదు. అందుచేత ఈవేళ నాభారంఅంతా వచ్చి నామీద విరుచుకుపడింది. అసలు ఇదంతా ఆశ్చర్యంగా ఉంది.

ఇదంతా చూస్తే ఆపరమేశ్వరుడే ఇది ఇల్లాగ ఏర్పాటుచేశాడని అనిపిస్తూంది. ఇందులో సందేహం ఏమీలేదు! ఇల్లాగ అనడానికి నాకీవేళ ఏమీసంకోచంకలగడంలేదు. మొట్టమొదటలో నాకు నెత్తి మీదికి వచ్చికూర్చున్నా నేమిటని అనిపించింది. కాని ఇప్పుడు ఆవిధమయిన సంకోచం పూర్తిగా పోయింది!" అన్నారు.

ఆమాటవిని మృణాల ముఖంఎత్తి చిన్నగనవ్వు నవ్వింది. ఆపైన కేదారబాబు కొంతకొంత సందేహిస్తూ "అయినాగాని నామనస్సులో ఏదో బాధగానే ఉందమ్మా! మాట్లాడదామంటే నోటమ్మట మాటే ఊడిపడడంలేదమ్మా!" అన్నారు.

"పోనివ్వండి బాబయ్యగారూ! ఆమాట చెప్పకపోతే ఇప్పుడు లోటేమివచ్చింది."

కేదారబాబు మెడతిప్పి ఆమెకేసి చూస్తూ "అమ్మా! నేనింక మాట్లాడకుండా ఊరుకోలేను! ఆమాట ఏదో చెప్పితీరాలి. నాకు తప్పకుండా అచల నురేశుడితో—" అని సగంసగం చెప్పి మాట్లాడ కూరుకున్నారు. ఈవిధమయిన అనుమానం మృణాలకికూడా కలిగింది. అందుచేత ఆమెమనస్సులో ఎంతో నొచ్చుకుని తలవంచుకొని కూర్చుంది. అంతేగాని ఏమీ మాట్లాడలేదు. కొంతసేపటిదాకా ఇద్దరూ నిశ్శబ్దం గానే ఉన్నారు. ఆఖరికి కేదారబాబు చటుక్కుని "మృణాలా! నేనొకసారి మహిముడిదగ్గిరికి వెళ్ళాలనిఅనుకుంటున్నాను. ఈవిషయంలో అతను ఏమిచెబుతాడో చూస్తాను. అతను ఏమిచెబుతాడో వింటేనే గాని నామనస్సులో బాధ తగ్గేటట్లు కనబడడంలేదు. కాని నేను ఒంటరిగా వెళ్లి అతనిఎదురుగుండా నిలబడడం ఎల్లాగ?" అన్నారు.

మృణాల ముఖంఎత్తి ఆయనకేసి ఎంతోజాలిగా చూసింది. ఆయన సిగ్గుచేతా భయంచేతా లోలోపల ఎంతో బాధపడుతూన్నట్లుకనపడ్డారు. ఆమె ఆయనకేసి అల్లాగ కొంతసేపుచూసి "బాబయ్యగారూ! మీరు

ఒక్కరూ వెళ్ళడంఎందుకు ? అంత వెళ్ళవలసిన అవసరమేవస్తే మనం ఇద్దరమూ కలిసే వెళ్ళవచ్చును." అంది.

"నువ్వు తప్పకుండా నాతోకూడా వస్తావా ? అమ్మా !"

"ఎందుకురాను బాబయ్యగారూ! అదీగాక నేను మిమ్మల్ని ఒక్కర్నీ ఎల్లాగ విడిచిపెడతాను ? మీరు ఎక్కడికి ప్రయాణం అయినా సరే నేను మిమ్మల్ని ఒంటరిగావిడిచిపెట్టదలుచుకోలేదు. ఎందుకైనామంచిది. నేనీమాట ముందుగానే చెప్పేస్తున్నాను. బాబయ్యగారూ ! అసలు నన్నెవ్వరూకూడా తీసుకువెళ్ళరండీ ! ఇంతవరకు నేనెక్కడికీ వెళ్ళలేదు ! అందుచేత మీరు నన్నుకూడా తీసుకువెళ్ళితీరాలి"

మృణాల కేదారబాబు శిరస్సుకి దగ్గిరగా కూర్చుంది అంతేగాని ఆపైన ఆయన్ని ఓదారుస్తూ ఒక్కమాటైనామాట్లాడలేదు. ఆయనకి పుట్టినదే ఒకఆడపిల్ల. ఆపిల్లకి కలిగిన దుర్గతిచేత ఆయనహృదయం చీలి పోతూంది. అల్లాంటిపరిస్థితిలో ఆమె ఏమని ఓదారుస్తుంది ? ఓదారిస్తే మాత్రం ఆయనకి ఉపశాంతి ఎల్లాగ కలుగుతుంది? ఈవిధంగా చాలా సేపు గడిచింది. ముసలాయనే ఎల్లాగోఅల్లాగ చివరికి మనస్సు కుదుటబరుచుకుని మృణాలని "అమ్మా !" అని పిలిచారు. ఆయనకేసి చూస్తూంటే మృణాలకి గుండెతరుక్కుపోవడం మొదలుపెట్టింది. కాని ఆమె ఎల్లాగో అల్లాగ మనస్సు కుదుటబరుచుకుని పొంగిపొంగి పైకివచ్చే కన్నీళ్ళు బలవంతంగా ఆపుకుని "ఎందుకు బాబయ్యగారూ ?" అంది.

"జీవితంలో బాధలు ఇంత దుస్సహంగా ఉంటాయని నేనెప్పుడూ అనుకోలేదమ్మా ! ఈయమయాతనలోంచి తప్పించుకోడానికి మార్గం ఏమీలేదా ? ఎవ్వరూ దీనికి ఒకఉపాయం చెప్పలేరా ?"

"కాని, బాబయ్యగారూ !. మనిషి మరణదుఃఖంకూడా సహించగలుగుతున్నాడుగదా !"

కేదారబాబు "నాకింక అది చచ్చిపోయినట్లే అని నువ్వు అంటు

అల్లాగే తీవ్రంగా "అతన్ని ఎప్పటికీ క్షమించడానికి వీల్లేదు. అందు లోనూ తండ్రినై ఉండి నేను బొత్తిగా క్షమించలేను. అసలది క్షమించ డానికి యోగ్యురాలు కానే కాదు. దాన్ని క్షమించడం న్యాయమూ కాదు. నేనీవిషయం గురించి నిశ్చయంగా చెప్పేస్తున్నాను!" అన్నారు. మృణాల "ఇది ఉచితమూ? అనుచితమూ?" అని ఆలోచించడం చర్చ అనిపించుకుంటుంది. దాన్ని క్షమించడం అని అనకు. అది అల్లాగ ఉంచండి! క్షమించడంవల్ల కలిగే ఫలితం అపరాధి ఒక్కడే పొందు తున్నాడా? దానివల్ల వచ్చే ఫలితం క్షమించే వ్యక్తికికూడా కలగడం లేదా?" అంది.

ముసలాయన ఆమాట విని నిశ్చేష్టులైపోయారు. ఆమె చెప్పిన అమృతమధురమైన మాటలవల్ల ఆయన మరి మాట్లాడలేకపోయారు! ఏదో కలగంటూన్నట్టు అల్లాగ కొంతసేపుకూర్చుని ఆయన మళ్ళీ చటుక్కుని "మృణాలా! నేనీవిధంగా ఎప్పుడూ ఆలోచించలేదమ్మా! ఈవేళనువ్వునాకు ఒక కొత్తసత్యం బోధించావమ్మా! నువ్వుచెప్పిన మాట నిజమే! క్షమాపణపొందినవాడు ఒక్కడే లాభంఅంతా తీసు కుంటున్నాడని చెప్పడానికి వీల్లేదు. క్షమించేవాడుకూడా కొంతలాభం పొందుతూనే ఉన్నాడు. అపరాధం ఎంతగొప్పదయినా మనమట్టుకి మనం క్షమించితీరవలసిందే! ఇదేనాదమ్మా నువ్వుచెప్పే ఉపదేశం?" అన్నారు.

"బాబయ్యగారూ! మీరీమాటలవల్ల నన్ను మరింత చిన్నబుచ్చు తున్నారు"

"నిన్ను చిన్నబుచ్చడం ఏమిటమ్మా! ప్రపంచకంలో అల్లాంటి మనిషికే నిజంగా స్థానం ఉందన్నమాట!"

ఆపైన మృణాల చటుక్కుని లేచినుంచుని "మాఅమ్మ నన్ను పిలు [illegible]న్నట్టుంది బాబయ్యగారూ! నేను ఇప్పుడేవస్తాను" అని చెప్పి [illegible] అక్కడినుంచి వెళ్ళిపోయింది.

మృణాల వేసివెళ్ళిపోయింది; ఆమె వెళ్ళిపోవటం తనుయేమీ గమనించలేదు. ఆయన తనమనస్సులోతక్క వినుమనే ఆలోచిస్తు ఉంటూ లోలోపల ఇల్లా అనుకున్నారు. "అమ్మా! నేనింక బతికి పోయానమ్మా! బతికిపోయాను! నువ్వునాకు ప్రాణదానం చేశావు తల్లీ! దుర్గతిఅనే దుర్గమారణ్యంలో పడిపోకుండా నాకు కళ్ళుమూసుకు పోయాయి. నాకింక మృత్యువుతప్ప వేరేమార్గం లేదనుకున్నాను. అల్లాంటిపరిస్థితుల్లో నాకు కనువిప్పుచేసి రాజమార్గం కనబడింది. ఈవిషయం నాకు నువ్వుతప్ప ఇంకెవరు బోధించగలరమ్మా! క్షమించడంఅనేమాట నేనెప్పుడూ ఆలోచించలేదు! క్షమాపణ అనేమాట నాహృదయంలో ఆవేశించేసరికి నాన్నకు రెండుచేతులతోనూ వెనక్కి గెంటివేసేవాణ్ణి! లోలోపల "వీల్లేదు! ఎప్పటికీ క్షమించడానికి వీల్లేదు! కూతురుఅయిఉండి నాయెడల ఇల్లాంటి అపరాధం చేసింది. కాబట్టి దీన్ని ఎప్పటికీ క్షమించడానికి వీల్లేదు!" అని అనుకునేవాణ్ణి! కాని నేను ఎంతమూర్ఖుణ్ణయిపోయాను! తండ్రినై ఉండి నేనే క్షమించకపోతే దాన్ని ఇంకెవరు క్షమిస్తారు. ఒకవేళ ఇంకొకళ్ళు క్షమిస్తే మాత్రం అది ఆ క్షమాపణ ఎల్లాగ అంగీకరిస్తుంది. నువ్వు క్షమిస్తే దానివల్ల నీకే లాభం కలుగుతుంది. ఇప్పటికి మృణాల నాకీవిషయం కళ్ళు తెరిచి చూపించింది! లేకపోతే నాగతిఏమికావలిసింది!"

ఈవిధంగా అనుకుని ఆతరవాత ఆయన ఆ మేఘాచ్ఛన్నమైన ఆకాశం కేసి చూడడం మొదలుపెట్టారు. అల్లాగ ఒక్కనిమిషంచూసి మళ్ళీ హృదయపూర్వకంగా ఈవిధంగాఅన్నారు. "నేను క్షమించివేశాను! సురేఖా! నిన్నుకూడా నేను క్షమించాను! అచలా! నిన్నుకూడా క్షమించాను! నేనీవేళ ప్రపంచకంలో ఉండే పశుపక్ష్యాదుల నన్నిటినీ

తుతున్నాను. ఈవేళనుంచి నేనెవ్వర్నీ నిందించను. ఈవేళతో నాకు ముక్తి లభించింది. ఈవేళనించి నేను పరమానందస్వరూపుణ్ణి!"

అల్లాగ మాట్లాడుతూంటే ఒక అనిర్వచనీయమైన కరుణవల్ల ఆయన రెండుకళ్ళూ మూతలుపడ్డాయి. ఆయన హృదయంలోనించి పొంగి పొంగి పైకివస్తూన్న పితృస్నేహంఅంతా కన్నీటిరూపంగా ప్రవహిస్తూన్నట్టు కనిపించింది. ఆయన అల్లాగ ఒక్కనిమిషం ఉండి కంపిస్తూన్న కంఠస్వరంతో "అమ్మా! అమ్మా! నువ్వు ఎక్కడున్నావు తల్లీ! ఒక్కసారి—ఒక్కసారి తిరిగి నాదగ్గిరికి రా! అమ్మా! నేను చిన్నప్పటినించీ నిన్ను పెంచినట్లు మళ్ళీ నిన్ను పెంచుకుంటాను. ఇంక మనంఇద్దరమూ సమాజంలోకి వెళ్ళడంమానివేద్దాము. అసలుమనం ఇల్లువిడిచిపెట్టి వీధుల్లోకి వెళ్ళనేవద్దు! కేవలం నువ్వూనేనూ——"అని ఇంకా ఏవో అనబోయారు.

"బాబయ్యగారూ!"

ముసలాయనముఖంతిప్పి ఒక్కసారి మృణాలకేసి చూశారు. ఆపైన ధైర్యం తెచ్చుకోడానికి ఎంతోకొంత ప్రయత్నించారు. కాని ఏమీలాభం లేకపోయింది. ఆ క్షణంలో చిన్నపిల్లవాడిలాగ భూమిమీదపడి దొర్లుతూ ఆర్తస్వరంతో "అమ్మా! అమ్మా! నాహృదయం చీలిపోతూంది. అందరూకలిసి ఈహృదయాన్ని ఎంతబాధ పెడుతూన్నారు! ఇంక నేనుబాధ భరించలేనమ్మా! అన్నారు. మృణాల ఏమీ మాట్లాడలేదు! భూమిమీద దొర్లుతూన్న ఆయనశిరస్సు తన ఒడిలోపెట్టుకుని మెల్లిమెల్లిగా చేత్తోనిమిరింది. అదిచూస్తూంటే ఆమె కళ్ళమ్మటకూడా కన్నీళ్లు ప్రవహించడం మొదలుపెట్టాయి.

అది ఫాల్గుణశుద్ధపాడ్యమి. ఆకాశంమీద అక్కడక్కడ మేఘాలు కమ్ముకున్నాయి. ఆరోజంతా ఇంక అవిఘ్నంగానే ఉండేటట్టు కనిపించింది. కాని కేదారబాబు చటుక్కుని కళ్ళుతెరచి "మృణాలా!

మోహనుడికి ఉత్తరం రాస్తే ఏమైనా సమాధానం రాస్తాడంటావా?" అన్నారు. మృణాల "ఏమోనండి నాకు తెలియదు బాబయ్యగారూ! నేను ఒకటి రెండు రోజుల్లో అక్కడినించి సమాధానం వస్తుందని అనుకుంటున్నాను" అంది.

"నువ్వు అతనికి ఉత్తరం రాశావా?"

మృణాల "రాశాను" అంది. ముసలాయన ఆ ఉత్తరంలో ఏమి ఉందని అడుగుదామని అనుకున్నారుగాని మళ్ళీ మొహమాటపడి మాట్లాడకూరకున్నారు. ఆతరవాత మళ్ళీ కిటికీవైపు చూస్తూ "ఇంకా కొంచెం పొద్దున్నట్టు కనిపిస్తోంది. అందుచేత కాస్త అటూ ఇటూ తిరిగివస్తాను" అన్నారు. ఆతరవాత కర్ర చేత్తో పుచ్చుకుని రెండు మూడడుగులు నడిచారు. కాని తక్షణం అక్కడ నిలబడిపోయి "అయితే, చూడమ్మా!—" అన్నారు.

"ఏమిటి బాబయ్యగారూ!"

"నాకు కొంత భయంగా ఉంది—————కేవలం భయం కాదనుకో! నేను అనుకునేది ఏమిటంటే——————"

"ఏమిటది బాబయ్యగారూ!"

"అప్పో! మరేమీ లేదమ్మా! ఒకవేళ మనం అక్కడికి వెడితే మోహనుడు ఏమన్నా అనుకుంటాడంటావా?"

ఈ రకమైన అనుమానం మృణాల మనస్సులో కూడా ఉంది. అయితే ఆమె దీనికింతకుపూర్వమే ఒక సమాధానం ఆలోచించి ఉంచింది. అందుచేత చటుక్కుని "ఇప్పుడు అన్నయ్య ఎక్కడ ఉన్నాడో మనకి తెలియదుగదా! తెలియగానే మనం బయలుదేరి అక్కడికి వెడదాము. నన్ను కూడా అన్నయ్య నా యింటికి రావద్దని అంటే అప్పుడు తెలుసుకోవలసిన సంగతులన్నీ మనకి తెలిసిపోతాయి. ఈ విషయంలో మనం ఇంకొకర్ని అడగవలసినపనే ఉండదు" అంది. కేదారబాబు

ఆమాటలువిని ఒక్కనిమిషం మాట్లాడకూరుకుని "అయితే తప్పకుండా నువ్వు నాతోకూడా వస్తావా? అమ్మా!" అన్నారు. మృణాల "తప్పకుండా వస్తాను. కాని నేను మీతోకూడా రాను బాబయ్యగారూ! మీరే నాకూడా వస్తారు" అంది. కేదారబాబు దానికి ఏదో సమాధానం చెబుదామని అనుకున్నారు. కాని ఒక్కనిమిషం ఆమెకేసి చూసి కళ్ళు ముఖం తిప్పివేసి మెల్లిమెల్లిగా అక్కడినించి వీధులోకి వెళ్ళిపోయారు.

సరీగ్గా ఈపాల్గునమాసంలో ఒకనాటి సాయంకాలంవేళ ఒకబంగాళా ముందుభాగంలో ఇద్దరుస్త్రీపురుషులు కూర్చున్నారు. వారిద్దరూకూడా తమహృదయాలలోంచి పొంగిపొంగి వస్తూన్న కన్నీటిప్రవాహం ఆపుగోవాలని ప్రయత్నించారుగాని చివరికి ఆపుకోలేక పోయారు. సురేశుడు సీలువేసిఉన్న పెద్దకవరుఒకటి జేబులోంచితీసి అచలచేతులో ఉంచి "ఇన్నాళ్ళనించీకూడా ఇదిఇద్దామని అనుకుంటూనేఉన్నాను. కాని ఈకాగితం మీచేతులో పెట్టడానికి ధైర్యం లేకపోయింది. ఈవేళ ఇంక వేరేమార్గం లేక పోయింది" అన్నాడు. అచల ఆకవరు చేత్తో పుచ్చుకుని "అంటే మీఅభిప్రాయం ఏమిటో నాకు బోధపడలేదు" అని అతనికేసి చూసింది.

సురేశుడు ఒకచిన్ననవ్వు నవ్వి "ప్రపంచకంలో నేను సాహసించి చెయ్యలేనిపని ఏమైనాఉంటుందా? ఎల్లాంటి భయంకరమైన పనిఅయినా ఎంత ఆశ్చర్యకరమైన పనిఅయినా నేను చేస్తానని మీకు తెలుసును. అల్లాంటివాణ్ణి ఇప్పుడు ఈవిధంగా మాట్లాడుతున్నా నేమిటని మీరు ఆలోచిస్తున్నారులాఉంది. ఈకవరులో ఏమైనా రహస్యంఉంటే అది మీకు కొద్దిరోజుల్లో బోధపడిపోతుంది. అయితే ఇన్నాళ్ళనించీ మీరు అర్థమనేదిఅడగకుండా నావల్ల అనేకబాధలు అనుభవించారు; లెఖ్ఖలేనన్ని అవమానాలు భరించారు! దీన్నికూడా అల్లాగేస్వీకరించమని

పోవడం ఆశ్చర్యంకాదు. సురేసుకు చాలాడబ్బుఖర్చుపెట్టి చాలాచోట్లకి ఔషధాలూ అన్వేషిస్తున్నాడు. స్వయంగా తానుకూడా తెల్లవారగట్లే లేచి ఎక్కడికో బయలుదేరి వెళ్ళిపోతున్నాడు. ఒకొక్కప్పుడు సాయంత్రానికి తిరిగివస్తున్నాడు; ఒకొక్కప్పుడు బాగా రాత్రిపడితేనేగాని తిరిగిరావడంలేదు; ఒకొక్కప్పుడు అసలు రావడమే లేదు. ఈవేళ అతను సమస్తమూ విడిచిపెట్టి వెళ్ళిపోతున్నాడనే సంగతి ఆమె కొంచెమైనా ఊహించలేకపోయింది. అందుచేత అసాధారణంగానే ఆమె అతనికేసి రెప్పవాల్చకుండా చూస్తూనేవుంది. ఆ మహాత్ముడికి భగవంతుడిమీద నమ్మకంలేదు; అతను తనప్రియస్నేహితుడి భార్యని—కేవలం నిర్దోషురాలిని—లేవదీసుకువెళ్ళి భ్రష్టురాలిని చేసివేశాడు; అల్లాంటప్పుడుకూడా అతను మనస్సులో ఏమీ బాధపడలేదు! ఈవేళ ఆవ్యక్తిని చూస్తూంటే, అచలదృష్టి కేవలం విరక్తిభావంచేత విషమయం అయిపోయింది. ఇంతేకాదు! అకస్మాత్తుగా ఆమెహృదయం లోపల ఒకవిధమైన ఆశ్చర్యభావంకూడా ప్రవేశించింది. ఆ వ్యక్తి పెదవులమీద ఇంకా చిరునవ్వు కొంచెంకొంచెం కనిపిస్తూనేఉంది. కాని అది బాగా క్షీణించిపోయింది. ఆచిరునవ్వులో ఆమెకు ఒక స్పష్టమైన విరక్తిభావం కనబడింది. అతనిముఖంమీద ఈవేళ కొంచెమైనా ఉద్వేగం కనబడలేదు. అతను ఈవేళ కేవలం మృత్యువు ఎదురుగుండా నుంచోడానికి వెళుతున్నాడు. అయినప్పటికీ అతని ముఖంమీద భయం అణుమాత్రమైనా కనబడలేదు. అతను నిరీశ్వరవాది; కేవలం స్వార్థపరుడు! అల్లాంటివ్యక్తికికూడా ఈవేళ ప్రాణాలంటే ఇంతనిర్లక్ష్యభావం కలగడానికి కారణమేమిటి? అతనికి ప్రపంచకంలో భోగాలు అనుభవించడం తప్ప మరేమీ కనబడలేదు. అతను ఇంతకాలంనుంచీ కేవలం భోగానుభూతిలో మునుగుతూ తేలుతూ ఉన్నాడు. అల్లాంటివ్యక్తి ఈవేళ జీవితంఅంటే ఇంత

తుచ్ఛంగా ఎంచుకుంటున్నాడు? బహుశః అతను తిరిగిరాకపోతే రాకపోవచ్చును. ఇది ఏమైనా రావచ్చునన్నగాని వేళాకోళం మాత్రం కాదు.

అకస్మాత్తుగా అతని హృదయానికి పెద్దఆఘాతం కలిగినట్లయింది. ఆ కాగితంలో ఉన్న కవరు సురేశుడికి చూపిస్తూ "ఇది మీరు రాసిన దేనా?" అని అడిగింది. సురేశుడు "మిమ్మల్ని పరీక్షించడానికే నేనొక భిక్ష అడిగానుకదా! అది అప్పుడే తిరిగి పంపించేశారని అనుకుంటున్నారా!" అన్నాడు. అచల కొంతసేపు నిశ్శబ్దంగా ఊరుకుని అయితే సరే! నేనాప్రశ్న అడగను. కాని నేను మిమ్మల్ని వెళ్ళనివ్వను!" అంది.

"ఎందుచేత?"

అచల ఆకవరు అటూఇటూ తిప్పి కొంతసందేహిస్తూ "మీరు నాకోసం అనేకం చేశారు; కాని మీరు నాకోసం మరణిస్తానంటే మాత్రం నేనంగీకరించను" అంది. సురేశుడు ఆమాటకి ఏమీ సమాధానం చెప్పలేదు. అచల తను అన్నమాటకి కొంచెం సిగ్గుపడి, ఆమాట ఊరికే తమాషాకి అన్నట్లు నటిస్తూ "కాదు, నేను మీకోసం చచ్చిపోవడంలేదు. నేను దరిద్రులకి ప్రాణదానం చెయ్యడంకోసం వెడుతున్నాను" అని అంటేఅనవచ్చును. కాని ఇందుకుకూడా నేను వెళ్ళనివ్వదలుచుకోలేదు!" అంది.

ఆమాట వినేసరికి సురేశుడికి మహిముడిసంగతి జ్ఞాపకంవచ్చింది. వెంటనే అతని హృదయాంతరాళంలోనించి ఒక పెద్దనిట్టూర్పు పైకివచ్చి నిశ్శబ్దంగాఉన్న ఆగదిలో ప్రవేశించింది. దానికి కారణం ఇది: సురేశుడికి జీవితంఅంటే లక్ష్యంలేదు. అతనికి అది ఒక తుచ్ఛమైనవస్తువు. ఆసంగతి బాగా తెలిసిన సాక్షి ఒకడున్నాడు. సాక్షి ఇంకా జీవించిఉన్నాడు! అతను మరెవరో కాదు! మహిముడే! ఈవేళ అతని ప్రయాణం ఈజీవితంలో అంతిమప్రయాణం అయితేకావచ్చును! ఆసంగతి తెలిస్తే మహి

ముకు లోలోపల "సురేశుడు లోభంచేతగాని, దుఃఖంచేతగాని, విరక్తి చేతగాని, ఇహలోక పరలోకాలలో ఉండేభోగాలమీద కాంక్షచేతగాని మరణించలేదు. అతనికి మృత్యువువచ్చినది; చనిపోయాడు" అని మాత్రం అనుకుంటాను.

సురేశుడి కళ్లనిండా కన్నీళ్లు నిండిపోయినై. కాని అతను మనస్సునిగ్రహించుకుని కన్నీరు ప్రవహించకుండా ఆపివేశాడు. ఆపైన ముఖం ఎత్తి కొంచెం నవ్వు తెప్పించుకోడానికి ప్రయత్నించి "నేనీవేళ ఎవరికోసమూ చచ్చిపోవడంలేదు. నాకింటిదగ్గిర ఊరికే కూర్చుంటే ఏమీ తోచడం లేదు. అందుచేత కొంచెం తిరిగివద్దామని వెళుతున్నాను. నేనెందుకు చచ్చిపోతాను! ఎప్పుడూ చావను!" అన్నాడు.

"అయితే ఈవీలునామా ఎందుకు?"

"ఇదివీలునామా అనేసంగతి నిశ్చయంగా లేదుగా!"

"కాకపోతే పోనీయండి! ఇక్కడ నన్నొక్కర్తినీ విడిచిపెట్టి వెళ్లిపోతున్నారా?"

"ఇంక మళ్లీతిరిగి రానన్నమాట ఇంకా నిశ్చయంగా లేదుగా!"

"అవును! కాలేదు! ఈపరదేశంలో ఎవరూ దిక్కులేని చోట"

అని సగంసగం చెప్పి అచల ఏడ్చింది. లేచినుంచున్న సురేశుడు కూర్చుండిపోయాడు. అతని హృదయంలోనించి ఒక పెద్ద ఆవేశం వచ్చింది. కాని జీవితంలో ఈవేళ మొట్టమొదట అతను ఆ ఆవేశం నిగ్రహించుకున్నాడు. ఆతరవాత అల్లాగ ఒక్కనిమిషం ఊరుకుని ప్రశాంతమైన కంఠస్వరంతో "నేనీవేళ మీజీవితంలో భాగస్వామిని కాను. ఈవేళకూడా మీరు ఒంటరిగానే ఉన్నారు. ఒకవేళ అటువంటి రోజేవస్తే మీకు ఇంతకంటె దిక్కులేనిపరిస్థితి ఏర్పడదు" అన్నాడు.

అచలకళ్లమ్మట కన్నీళ్లు ప్రవహిస్తున్నాయి. ఆమె ఆకన్నీళ్లతో తడిసిన కళ్లు పైకెత్తి సురేశుడికేసి చూసింది. వెంటనే ఆమెపెదవులు

ఏడుస్తూవుంటుంది. సురేశుడు ఆమెకేసి రెప్పవాల్చకుండా చూస్తూ ఆలోచించడం మొదలుపెట్టాడు. ఈమధ్యని కొన్నాళ్లనించి అతనికి తనుచేసిన పొరబాటుపని ఏమిటో తెలిసిపోయింది. అందులోనూ, ఆలింగనచుట్టుకుపోయివున్న ఆస్త్రీమూర్తి—ఆమనోహరమైన ఆమె దేహసౌందర్యమూ, ఆమెఅనుభవిస్తూన్న వేదనా, అవన్నీ ప్రత్యక్షమయ్యేసరికి, ఇన్నాళ్లనించీ అతని కళ్లని ఆవరించుకున్న మోహబంధం కాస్తా తొలిగిపోయింది. అతనికి తనపరిస్థితి తలుచుకుంటే విచిత్రంగా కనిపించింది. సూర్యోదయసమయంలో ఆకుచివర నిలిచిఉన్న మంచుబిందువు తళతళా మెరుస్తుంది. ఆమంచుబిందువులో అనంతసౌందర్యం చూసి లోభించినవాడిగతి ఏమవుతుందో సురేశుడిగతికూడా సరిగ్గా అల్లాగే అయింది. అతను నాస్తికుడు; అతనికి ఆత్మఅనేది లేదు! ఆత్మప్రభావంవల్ల ఈఅనంతమైన ప్రపంచకసౌందర్యంఅంతా ప్రవహిస్తూందనే విషయంమీద అతనికి నమ్మకంలేదు. అదంతా ఒట్టిమిథ్య అని అతని అభిప్రాయము. అందుచేత అతను అచలశరీరంచూసి అది పొందగలిగితే నేను మహాదృష్టవంతుణ్ణని అనుకున్నాడు. మొట్టమొదట అతనికి ఆవిషయంలో ఏమీ సందేహంకలగలేదు. ఈవేళ భ్రమాత్మకమైన అతనిభావనాసౌధంఅంతా ఒక్కసారిగాకూలి నేలమట్టం అయిపోయింది. ఈవేళ అతనికి తనుచేసినది ఎంతపొరబాటో బాగా తెలిసిపోయింది. ఆవిషయం తలుచుకుంటూన్న కొద్దీ అతనిహృదయంలో బల్లెం పొడుచుకుంటూన్నట్లయింది. మంచుబిందువు పడగానే నిమిషంలో మాయమైపోతుంది. ఈవేళ అతనికి అచలకూడా సరిగ్గా ఆవిధంగానే కనిపించింది! అయ్యయ్యో! మంచుబిందువు ఉండవలసినచోటు చిగురుటాకే! ఐశ్వర్యం అనే ఎడారిలోకితీసుకువస్తే అది ఎందుకైనా ఉపయోగిస్తుందా? అతనికి తెలియకుండా కళ్లమ్మటనీళ్లు నిండాయి. అతను ఆకన్నీళ్లు తుడుచుకుని అచలను గట్టిగా పిలిచాడు.

అచల ఉలిక్కిపడింది. కాని అల్లాగే మాట్లాడకూరుకుంది. సురేశును "బండీపచ్చి వీథులో నుంచుంది. మీరీవేళ రామబాబుగారింటికి వెడదామని అనుకున్నారుకారూ?" అన్నాడు. అయినాగాని ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు. అతను "మీకు వెళ్ళడం ఇష్టంలేకపోతే గుర్రాలను విప్పివెయ్యమని చెబుతాను. బహుశః నే నీవేళ ఎక్కడికీ వెళ్ళలేననుకుంటాను. బండివాణ్ణి తిరిగి వెళ్ళిపొమ్మని చెబుతాను." అన్నాడు. ఆపైన అతను తిరిగి తను సామాన్యంగా కూర్చునే గది లోకి వెళ్ళిపోయాడు.

ఆతరవాత పది పదిహేను నిమిషాలదాకా అతను ఏమి ఆలోచిస్తున్నాడో అతనికే తెలియదు. ఇంతలో ఎవరో లోపలికి వస్తూన్న చప్పుడయింది. అతను ఆవైపు చూశాడు. ఇంతలో అచల వచ్చి అతనికి ఎదురుగుండానుంచుంది. ఆమె కళ్లు శుభ్రంగా కడుక్కొని మంచి ధనవంతులాడవాళ్ళు వేసుకునే వేషం వేసుకుని చటుక్కునివచ్చి అక్కడ నిలబడింది ఆపైన "ఈవేళ వారింటికి ఒకసారి తప్పకుండా వెళ్ళాలి!" అంది. అతను ఈవేషంఅదీ చూసి ఆమె రామబాబు గారింటికి వెళ్లబోతూందని ఇంతకుపూర్వమే గ్రహించాడు. అయినాగాని మాణిక్యాలూ ముత్యాలూ అలంకరించుకున్న ఆసౌందర్యకాంతి అతన్ని ఒకక్షణకాలం పరవశుణ్ణి చేసింది. అతను ఎంతో ఆశ్చర్యపడుతూ "తప్పకుండా వెళ్లితీరాలా!" అన్నాడు.

"రాక్షసి కలకత్తానించి జ్వరంతోటే తిరిగివచ్చేసింది. పెదనాన్న గారుకూడా నిన్నటినించీ జ్వరంగా ఉన్నారని తెలిసింది"

"వారువచ్చినతరవాత ఒక్కసారిఅయినా అక్కడికివెళ్ళలేదూ?"

"లేదు"

"వాళ్లేనా రాలేదూ?"

"రాలేదు"

"రామబాబుగారుకూడా రాలేదా?"

"రాలేదు"

ఈఇంటిలోకి వచ్చినప్పటినుంచీ సురేశుడు ఇంచుమించు ప్లేగువచ్చిన వాళ్ళకి వైద్యం చేసే పనిలో మునిగిఉన్నాడు. అందుచేత సంసార విషయంలో గాని బంధువులవిషయంలో గాని అతనికి ఆలోచనే వెళ్ళ లేదు. ఆకారణంచేత ఈసంగతి వినేసరికి అతనికి ఎంతో ఆశ్చర్యం వేసింది. అతను "ఈవిషయం చాలా ఆశ్చర్యంగా ఉందే! సరే! వెళ్ళండి!" అన్నాడు. అచల "మనం ఆశ్చర్యపడవలసినంత ఎక్కువగా వాళ్లు ఆశ్చర్యపడవలసిన అవసరం ఏమీ లేదు బంధువులతో వాళ్ళకి ఊపిరి విడవడానికికూడా ఖాళీఉండదు! అసలు మనమే ఒకసారి వెళ్ళవలసింది" అంది.

"సరే మీరు వెళ్ళండి! కాని తొందరగామాత్రం తిరిగిరండి!"

అచల కొంతసేపటిదాకా మాట్లాడకూరుకుని "మీరుకూడా నాతో రండి!" అంది.

"నేనెందుకు?"

అచల కొంత కోపపడుతూ "మీ రోగంసంగతి మీకు జ్ఞాపకంలేక పోతే పోవచ్చును; కాని మీరు డాక్టరు అన్న సంగతిఅయినా జ్ఞాపకం ఉంచుకొని ఒక్కసారి అక్కడికి రండి!" అంది. సురేశుడు అయితే లేవండి!" అని చెప్పి లేచినుంచుని బట్టలుమార్చుకోడానికి తన గదిలోకి వెళ్ళిపోయాడు

అచల "బాబుగారు ఇప్పుడు వెళ్ళరు. నీ బండివాని ఏమీలేదు!" అంది.

సురేశుడు బండిఎక్కి ముందున్న సీటులో కూర్చోబోయాడు గాని అంతలో అచల అతనికోటుపట్టుకుని లాగి పక్కనికూర్చోమని సంజ్ఞచేసింది. అందుచేత అతను వెళ్ళి అచల పక్కని కూర్చున్నాడు. బండిగబగబా వెళ్ళిపోతూంది. ఎవరూ ఏమీ మాటాడలేదు. ఆ యిద్దరూ ఎవరిమట్టుకు వారు తమపక్కనున్న కిటికీ లోంచి అవతలికి చూస్తూ కూర్చున్నారు. బండి ఆవరణదాటి రోడ్డుమీదికి వచ్చింది. అప్పుడు సురేశుడు మెల్లిగా పేరుపెట్టి అచలని పిలిచాడు.

"ఎందుకు"

"నేనివేళ ఏమి ఆలోచిస్తున్నానో మీకు తెలుసునా?"

"తెలియదు"

"ఇప్పుడు ఇన్నాళ్ళనించీ ఆలోచించినదానికి కేవలం వ్యతిరేకంగా ఆలోచిస్తున్నాను. ఇన్నాళ్ళనించీ మిమ్మల్ని చేపట్టడం ఎల్లాగా అని ఆలోచించేవాణ్ణి! ఇప్పుడు మిమ్మల్ని ఒదిలించుకోడం ఎల్లాగా అని ఆలోచిస్తున్నాను. మీ భారం ఇప్పుడు నేను భరించలేకుండా ఉన్నాను!" అన్నాడు.

అచల అతనీవిధంగా అంటాడని ఎప్పుడూ అనుకోలేదు. ఈమాటలు ఆమెచెవులలో శూలాల్లాగ గుచ్చుకున్నాయి. ఇవి ఆమె కొంత సేపటిదాకా నమ్మలేకపోయింది. అల్లాగే కొంతసేపటిదాకా మతి పోయినట్టు కూర్చుని "అస్పష్టంగా నాకు తెలుసును కాని ఇది—" అంది.

సురేశుడు ఆమె సగంసగంఅన్న మాట అందుకుని 'నాపొరపాటే! అవును! మీరంతా పాపానికి ఏదో శిక్ష ఉంటుందని అంటూంటారు. నాకామాట నిజమే అనిపిస్తూంది. మనస్సులేని ఈదేహం ఇంతబరువై పోతుందని నేను స్వప్నంలోకూడా అనుకోలేదు!" అన్నాడు. అచల కళ్ళెత్తి అతనికేసి చూసి "అయితే మీరు నన్ను విడిచిపెట్టి వెళ్ళి

పోతారా ?'' అంది. సురేశుడు అణుమాత్రమైనా సందేహించకుండా "అవును ! అంతే అనుకోండి ?'' అన్నాడు.

ఆతడు నిస్సందేహంగా ఇచ్చిన సమాధానంవిని అచల నిశ్చేష్టురాలై పోయింది. ఆమెహృదయంలో మాటిమాటికీ "ఈ మన ఆ సురేశుడే ! ఈ మన ఆసురేశుడే ! ఈవేళ ఈమనకి నేనింత బరువై పోయాను. ఆసురేశుడే ఈవేళనన్ను దిక్కులేనిదాన్ని చేసి ఎక్కడికో వెళ్ళిపోవాలని అనుకుంటున్నాడు. ఈమాట నాముఖంమీద అనడానికి ఈమనకి ఈవేళ సంకోచమైనాకూడా లేకపోయింది !'' అని అనుకుంది.

అసలు అన్నింటికంటే విచిత్రమైన విషయం ఏమిటీఅంటే ఈ వ్యక్తి ఒక్కడే ఆమె సమస్తసౌఖ్యాలకీ మూలకారణము! నిన్నటిదాకా అతని శరీరానికి తగిలిన గాలిచేత ఆమె శరీరంఅంతా పులకితమైపోయింది. ఆకాశంఅంతా మేఘాలుకమ్ముకున్నాయి; అప్పుడప్పుడేసూర్యాస్తమానం అవుతూంది. ఆబండి ఆనిర్జనమార్గంలో అంతటా ప్రతిధ్వనిస్తూ గబగబా వెళ్ళిపోతూంది. అందులో కూర్చున్న స్త్రీపురుషులిద్దరూ మౌనంగా కూర్చున్నారు. సురేశుడు ఏమి ఆలోచిస్తున్నాడో అతనికే తెలియాలి ! కాని అతను అన్నమాటలు మననంచేసుకుంటూంటే అచలహృదయంలో ఒక పెద్దభయం ఆవరించింది. ఆమె కిప్పుడు సురేశుడులేడు! ఆమె ఈప్రపంచకంలో ఒక్కర్తె మిగిలిపోయింది అపకాకిత్వంలోఉండే అనంత్యం ఈవేళ ఆమెహృదయంలో ఒక పెద్ద మెరుపులాగ మెరిసింది. దురదృష్టంచేత ఆమె ప్రయాణంచేస్తూన్న నావే ఈవేళ సముద్రంలో ముక్కముక్కలై మునిగిపోతూంది. ఆమెచుట్టూరా ఈవేళ అనివార్యమైనమృత్యువునృత్యం చేస్తూంది. ఈవిషయం ఆమెకి తెలిసినంతగా ఇతరుల కెవ్వరికీ తెలియదు. ఈవేళ చుక్కలు లేని సముద్రంలో కొట్టుకుపోతున్నానని ఆమె అనుకుంది. ఆమాట అనుకునేసరికి ఆమెశరీరంఅంతా మంచుగడ్డలాగ చల్లబడిపోయింది. ఇప్పుడు ఆమెకు ఎవ్వరూ లేరు. ఆమెను ప్రేమించేవాళ్ళుగాని

ఆమెచెయ్యి సురేశుడి పిడికిటిలోనే ఉండిపోయింది. అతను ఆమెచెయ్యి గట్టిగా నొక్కిపట్టుకుని పెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు. బండి క్రమంగా రోడ్డువిడిచిపెట్టి రామబాబుగారి ఇంటిఆవరణలో ప్రవేశించి, ఆతరవాత ఉచ్చైశ్శ్రవాలలాంటి గుర్రాలతోకూడా ఆబండి ఇంటిముందుకు వచ్చే సరికి ఆ ఇల్లంతా ఒక్కసారి గజగజవణికింది. క్రమంగా ఆబండి ఇంటి ముందర ఆగింది. తళతళలాడే వేషంవేసుకున్న సైనువాడు తలుపు తెరిచి పక్కగానుంచున్నాడు. సురేశుడు స్వయంగా దిగి అచలచెయ్యిపట్టుకుని దింపాడు. అచల దృష్టిఅంతా పైనున్న వరండామీదపడింది. అక్కడ ఉన్న స్త్రీలందరితోనూ కలిసి రాకుమారి లేచి నుంచుంది. చాలాకాలం తరవాత కలుసుకోవడంచేత ఇద్దరు స్నేహితురాళ్లూఒక్కసారి కలకల నవ్వారు. రామబాబు కిందే ఉన్నారు. ఆయన పైమీద బట్టవేసుకుని ఇవతలికివచ్చి ఎంతోసంతోషించి స్నేహమిశ్రితమైన కంఠస్వరంతో "రా! అమ్మా! రా!" అని పిలిచారు.

ఆయన అంత ఆప్యాయంగా పిలుస్తూంటే ఆమె కలకల నవ్వుతూ చటుక్కుని కిందికిచూసింది. ఆమెకు ఎదురుగుండా రామబాబు నుంచున్నారు. ఆయనపక్కని మహీనుడు నుంచున్నాడు. అతన్ని చూసి ఆమె నిశ్చేష్టురాలై రాయిలాగ నిలబడిపోయింది. వారిద్దరికళ్లూ కలుసుకున్నాయి. కానివాళ్లిద్దరి కనురెప్పలూ అల్లాగే నిలబడి పోయాయి. అచలశరీరంమీదఉన్న రత్నాలంకారాలు మాత్రం వాల్లాగే తళతళలాడుతున్నాయి. వజ్రాలకాంతి కొంచమైనా మందగించలేదు! కాని ఆ అలంకారాలమధ్య తళతళలాడుతున్న కమలంమాత్రం ఒక్క నిమిషంలో ముడుచుకుపోయింది.

అయితే అప్పుడే సూర్యాస్తమానం కావస్తోంది. [illegible] మసక మసకగా ఉన్న ఆసాయంకాలపుచీకటిలో [illegible] వని చేసేవాళ్లనని అనుకున్నారు. ఆయన అచల [illegible] ఉండడంచేత

సిగ్గుపడుతూందని అనుకుని గబగబా అచలకేసి సముదాయిస్తూ "పోనీలే అమ్మా! ఇప్పుడునువ్వు పాదాలు ముట్టుకుని నమస్కరించక్కర్లేదు. నువ్వు ముందు పైకిపదు!" అన్నాడు. అచల ఏమీ సమాధానం చెప్పలేదు. అటూఇటూ ఊగిసలాడుతూ పైకివెళ్ళింది.

రామబాబు "ఈ మనసు శేఖరబాబు. ...— అని ఏదోఅనబోయాడు. సురేశుడు "ఏనాడునాకు శ్రోత్రంగా చెబుతున్నావేమిటి? మేమిద్దరమూ ఒకక్లాసు" —అన్నతనని చూచి "అలా కాదు" అని నవ్వడానికి ప్రయత్నించాడు. కానిముఖం వికృతంగాతయారైంది, అంతేగాని నవ్వుమాత్రం రాలేదు. ఆతరవాత "ఏమిటోయ్! మహామా! హాతాత్తుగానువ్వు—" అని ఊరుకున్నాడు. అంతేగాని అకనుఆమాట పూర్తిచెయ్యలేకపోయాడు. మహిముదుముఖం ఒకకొక్కపక్కకి తిప్పేసి గబగబా లోపలికి వెళ్ళిపోయాడు. పాపం మునలావిడ మతిపోయి నట్లయి సురేశుడిముఖంకేసి చూశారు. సురేశుడుకూడా మళ్ళీఒకనవ్వు నవ్వడానికి ప్రయత్నించాడుకాని, ఎంతప్రయత్నించినా చివరికి నవ్వలేక పోయాడు. పైన కర్రమెట్లమీద ఒకపెద్దవస్తువు జారిపడినట్లు చప్పుడయింది. అందరూ ఆశ్చర్యంతో నిశ్చేష్టులయిపోయారు. లోపల ఒక పెద్దగల్లంతు బయలుదేరింది. రామబాబు గబగబా లోపలికిపరిగెత్తుకు వెళ్ళిచూశారు. అచల మూర్ఛవచ్చి లుంగచుట్టుకుని కిందపడిపోయింది. ఆమె రెండుమూడుమెట్లుమాత్రం పైకెక్కింది. ఆతరవాత ఆవిధంగా మూర్ఛపోయింది.

## ౪౧

తిరిగివచ్చేసమయంలో అచల ఆబండిలో ఒకమూలగా కూర్చుని కళ్లుమూసుకుని ఈవేళవచ్చినమూర్ఛతో ప్రాణంపోతే బాగుండునని అనుకుంది. తనచేతులతో తనుఆత్మహత్య చేసుకోవడం అనేవిషయం

ఆలోచించడంకూడా ఆమెకి కష్టమయింది. కాని ఈవిధమైన ప్రశాంతమైన మృత్యువువస్తే బాగుండునని ఆమె అనుకుంది. ముందు పూర్తిగా స్పృహతప్పిపోవాలి. ఆపైన ప్రాణాలుపోవాలి. అవిఘ్నంగా సుఖంగా ప్రాణాలు విడిచిపెట్టేమార్గం ఏమీలేదా? ఎవరికైనా ఆ ఉపాయం తెలుసునా?

సురేశుడు ఆమెనుస్పృశించి "మీరు ఇంకొకచోటికి ఎక్కడికైనా వెళ్లిపోవాలని అనుకున్నారు. వెళ్లిపోదామా?" అన్నాడు.

"వెళ్లిపోదాము పదండి!"

"ఆతరవాత ఇక్కడ ముఖం ఎత్తుకుతిరగడం చాలాకష్టం"

"ఆయన ఈసంగతి మరిఎవరితోటీ చెప్పరా?"

ఆమాటవిని సురేశుడు ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి కొంచెంసేపు ఊరుకున్నాడు. ఆపైన మెల్లిగా "అక్కా! భయంలేదు. నేను మహిముణ్ణి బాగా ఎరుగుదును. మహిముడు అసహ్యంచేత మనపేరైనా నోటితో ఉచ్చరించడు!" అన్నాడు. సురేశుడు ఈమాట యథాలాభంగా అనేశాడు. కాని అచల ఆమాటవిని గజగజవణికింది. ఆతరవాత బండి ఇంటికివచ్చిందాకా ఎవ్వరూ ఏమీమాట్లాడలేదు. సురేశుడు ఆమెను చెయ్యిపట్టుకుని ఎంతో జాగ్రత్తగా కిందకిదింపి "మీరువెళ్లి కొంచెంసేపు నిద్రపోవడానికి ప్రయత్నించండి. నేను జవాబుగా కొన్ని ఉత్తరాలు రాయాలి" అని తను చదువుకునే గదిలోకి వెళ్లిపోయాడు.

అచల పరుపుమీదపడుకుని ఆలోచించడం మొదలుపెట్టి "నాకు వయస్సింకా ఇరవైఏళ్లు దాటలేదు. నేను ఎరిగి ఉన్నంతవరకు ఎవళ్లకీ ఏవిధమైన అపకారమూ చెయ్యలేదు. ఇల్లాంటి దుర్గతినాకు ఎందుకు పట్టాలి?" అని అనుకుంది.

కాని ఈవిధంగా ఆలోచించడం కొత్తకాదు. అప్పుడప్పుడు ఆమె [illegible] ప్రశ్నించుకుంటూనే ఉంది. జ్ఞాపకం వచ్చినంతవరకు

చిన్ననాటినుంచీ జరిగిన సంగతులన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటూనే ఉంది. ఇల్లాగ జ్ఞాపకం తెచ్చుకుంటూంటే ఆమెకీవేళ హఠాత్తుగా ఒకనాడు మృణాలకీ తనకీ జరిగిన వాగ్వాదం జ్ఞాపకం వచ్చింది. ఆమె ఆ వాగ్వాదంలో వచ్చిన మాటలన్నీ ఒకటొకటే జ్ఞాపకం చేసుకోవడం మొదలు పెట్టింది. వివాహం జరిగింది మొదలుకొని ఆమెకీ భర్తకీ పొత్తు కుదరనేలేదు. అతనికి జబ్బుచేసినప్పుడు మాత్రం కొన్నిరోజులు ఇద్దరిమనస్సులూ కలిశాయి. ఆసమయంలో ఆమెకు ఏవిధమైన భయమూ ఉండేది కాదు. మనస్సులో నిశ్చింతగా ఉండేది. ఆమెకు జీవితం అంతా సుఖంగా వెళ్ళిపోతూ ఉండేది. అల్లాంటిపరిస్థితుల్లో ఆమె ఇతరులకష్టదుఃఖంచూసి మనస్సులో ఎంతో బాధపడుతూ ఉండేది. ఆమె ఆరోజుల్లో ఒకనాడు మృణాలని కౌగలించుకుని గద్గదస్వరంతో "అక్కయ్యా! నువ్వు మామకం అవలంబించి మానవసమాజంలో ఉంటే నీ జీవితం ఇల్లా వ్యర్థమైపోకుండా చేసేదాన్ని!" అంది.

మృణాల నవ్వుతూ "ఏంచేస్తావు ఒదినా! నాకుమళ్ళీపెళ్ళిచేస్తావా?" అంది. అచల "ఏంఎందుకు చెయ్యకూడదు! కానీ దానిమాటకేంలే! అక్కయ్యా! నీకాళ్ళుపట్టుకుంటానుగాని ఆశాస్త్రాలసంగతి నాదగ్గిర తలపెట్టకు! దీన్నిగురించి ఎన్నో మల్లయుద్ధాలు జరిగాయి. నాకామాటలు తలపెడితే భయంగా ఉంటుంది!" అంది.

మృణాల అల్లాగేనవ్వుతూ "భయంకాదూ! భయమే! ఆగొడవంతా వచ్చి ఎవరిమీద పడుతుందో చెప్పడానికివీల్లేదు. దానికేంగాని ఒక సంగతి చెబుతున్నాను విను ఒదినా! ఈవాగ్వాదాలు చేసేవాళ్ళకి అదొక వృత్తి! ఒంట్లో ఓపిక ఉన్నంతకాలమూ వాళ్ళల్లాగ యుద్ధాలుచేస్తూనే ఉంటారు. అందులో ఓడిపోవడం ఏమిటో జయించడం ఏమిటో వాళ్ళకే తెలియాలి! దానివల్ల మనకి వచ్చేదీపోయేదీ ఏమీలేదు. ఆరెండుపక్షాల వాళ్ళలోనూ మనని ఎవళ్ళూ ఏమీ అడగరు!" అంది.

అచల "అడిగితే ఏం!" అంది.

మృణాల "ఏమోనమ్మా నాకు తెలియదు! నువ్వు ఆలోచించినట్లు ఆలోచించి నువ్వు చెప్పినదానికి ఒప్పుకుంటే ఈపాటికి నాక్కూడా ఒకవరుడు దొరికిఉండును!" అని నవ్వింది. ఆనవ్వుచూసి అచలమండిపడి "మానసమాజం సంగతి ఎత్తేసరికి నువ్వు హేళనచేస్తూ మాట్లాడుతున్నావు. నవ్వేదానికేంలే! మాటామాట అల్లాడుచు! ఆవాగ్వాదాలు చేసేవాళ్ళంతా ఊరికే తమాషాకి వాగ్వాదంచేసేవాళ్ళేనా! అందులో ఒకళ్ళూ నిజంగా వాదించేవాళ్ళు లేరా?" అంది.

మృణాల మునిపళ్లతో పెదవినొక్కిపెట్టి "ఇల్లాంటిమాట వింటేకూడా పాపము! సరే! దానికేంగాని నేను రేపుపొద్దున్నే బయలుదేతి వెళ్ళిపోతున్నాను. మళ్ళీ మనంఇద్దరమూ ఎప్పుడు కలుసుకుంటామో తెలియదు. వెళ్ళేముందు నాతో ఒకసారిఅయినా కులసాగామాట్లాడవా!" అంది. ఆమాటలు అంటూంటే ఆమెకళ్ళమ్మట నీళ్లు గిర్రున తిరిగాయి. అయినాగాని ఆమె మళ్ళీ ధైర్యం తెచ్చుకుని మనస్సు కుదుటబరుచుకుని నేను చెప్పేమాటలన్నీ నువ్వు బోధపరుచుకో లేవుఒదినా! మీసంఘంలో వివాహంఅంటే ఒక సాంఘిక వ్యవస్థ. అందుచేత మీరంతా దాని మంచిచెడ్డలిని గురించి చర్చించుకుంటూ ఉండవచ్చును. యుక్తులచేత ఆవివాహనియమాలు ఒకప్పుడు మారిస్తే మార్చవచ్చును; కాని మాలో వివాహం అల్లాంటిదికాదు! మాకది ఒకధర్మం! మేముభర్తని చిన్నప్పటి నించీ ఈ విధంగానే స్వీకరిస్తాము. ఈ విషయంలో మాకు చర్చలూ ఆవీ పనికిరావు!" అంది.

అచల ఆశ్చర్యపడి "అయితే! మీధర్మంలో మనిషి మారడంలేదా" అని అడిగింది. మృణాల "ధర్మంవిషయమయిన అభిప్రాయాలు మారితే మారవచ్చును గాని అసలు వస్తువుమాత్రం మారడానికి వీల్లేదు. భర్త మంచిచెడ్డలినిగురించి మేముకూడా ఆలోచిస్తూఉంటాము. మేముకూడా

మనుష్యులమే కాబట్టి ఆమంచిచెడ్డల విషయంలో ఏమైనా అభిప్రాయాలు మారితే మారవచ్చును; కాని భర్త మాకు ధర్మము ! అందుచేత భర్త మారడానికి వీల్లేదు. 'భర్త మాకు జీవితంలోనూ మరణంలోనూ కూడా నిత్యుడే. ఆకారణంచేత మేము భర్తను మార్చలేము !' అంది. అచల ఆమాటవిని కొంచెంసేపు ఊరుకుని "ఇది నిజమే అయినా మీలో ఇన్ని అనాచారాలు ఎందుకున్నాయి?" అంది. మృణాల "అనాచారాలు ఉండడానికి కారణం ధర్మమే ! ధర్మం లేకపోతే ఆ అనాచారాలు లేవు ! కుక్కల్లోనూ పిల్లుల్లోనూ అనాచారాలున్నాయా ?" అంది.

అచలకి చటుక్కుని ఏమీ సమాధానం దొరికిందికాదు. అందుచేత కొంచెంసేపు మాట్లాడకూరుకుని "మీసంఘంలో ఆచారాలు చాలా గొప్పవే! అని మాటవరసకి అందాము. అయితే మీలో గొప్పగొప్ప వాళ్ళల్లోకూడా ఈఘోషాపద్ధతులూ ఈనిర్బంధాలూ ఇవన్నీ ఎందుకు ? పరీక్షవచ్చినప్పుడు ఆగినప్పుడే ఈనిర్బంధ పాతివ్రత్యంసంగతి ఏమిటో బోధపడుతుంది !" అంది.

అచల ఆవేశం చూసి మృణాల ఉలిక్కిపడింది. అల్లాగ ఒక్క నిమిషముండి ఆపైన ఒక్కనవ్వునవ్వి "ఈప్రశ్నకి సమాధానం నన్నడిగితే నేనేం చెప్పగలనమ్మా ! ఈవిధినిషేధాలన్నీ ఎవరు సృష్టించారో వారిని అడుగు ! మాలాంటివాళ్ళం అంతా తల్లిదండ్రుల దగ్గిరనించి నేర్చుకున్నవాటినే ఆచరిస్తున్నాము. కాని నీతో నేను ఒక్కవిషయం మాత్రం గట్టిగా చెప్పగలనమ్మా ? భర్తని ఉభయలోకాలలోనూ ధర్మరూపంగా స్వీకరించినది ఒకస్త్రీ ఉందనుకో ! ఆమెను ఖైదులో పెట్టినా పెట్టకపోయినా, ఆమెపాతివ్రత్యపరీక్ష ఆమె హృదయంలోనే జరిగిపోతుంది !" అంది.

ఇల్లాగ అన్నతరవాత కొంతసేపుఆగి మృణాల మళ్ళీ మెల్లిగా ఇల్లాగ అంది "నాభర్తగారిని నువ్వు చూశావుగదా ! ఆయన చాలా పెద్ద

వారు; డబ్బూ దస్కమూ ఆయన దగ్గర ఏమీలేదే కాని; అందంలోనూ గుణాలలోనూ ఆయన సామాన్యంగా అందరిలాగే ఉండేవారు. కాని ఈలోకంలోనూ పరలోకంలోనూ ఆయనే నాకు భర్త!" అంది. ఆ తరవాత కళ్ళుమూసుకుని భర్తని ఒకసారి ధ్యానించుకుంది. అల్లాగ కొంతసేపుండి ఒకచిన్న నవ్వునవ్వి "ఉపమానాలు చెబితే సరిగ్గా సరిపోవు బదినా! తండ్రికి గుడ్డివాడయినా కుంటివాడయినా కొడుకుమీద పూర్తిగా ప్రేమ ఉంటుంది. అందమైన పిల్లవాణ్ణి ఎవణ్ణైనా చూసినప్పుడు అల్లాంటి తండ్రికి మనసులో బాధకలగవచ్చును. కాని కొడుకు విషయంలో అతనికి ప్రేమ అణుమాత్రమయినా తగ్గదు. మా సంసారమూ మా కాలో చసలూ అన్నీ చాలా వేరుగా ఉంటాయి బదినా! నేను చెప్పిన ఈ ఉపమానమూ ఈ మాటలూ నువ్వు తిన్నగా అర్థం చేసుకోవని నా భయం! కాని ఒక్క విషయం చెబుతున్నాను విను బదినా! భర్తని ధర్మస్వరూపంగా స్వీకరించని స్త్రీ వైభవంలో ఉన్నా స్వేచ్ఛగా ఉన్నా ఒకటే! ఆమె పాతివ్రత్యం చాలా గొప్పదని అనుకుంటూ ఉన్నా సమయం వచ్చేసరికి అధఃపాతాళంలోకి పడిపోతుంది! ఆమె ఘోషాలో ఉన్నా ఉండకపోయినా ఇదితప్పదు!" అంది.

సరిగ్గా ఆమె చెప్పినట్టే జరిగింది. అచల ఆసమయంలో ఈ సత్యం సరిగ్గా అర్థం చేసుకోలేకపోయింది. కాని ఈవేళ ఈ అధఃపతనం పాతాళలోకం వైపు లాక్కుపోతూన్నప్పుడు ఆమె నాటి మాటల్లో ఉన్న అర్థం పూర్తిగా బోధపడడం మొదలు పెట్టింది. అచల నియమాలతో కట్టుబడిఉన్న సమాజంలోనే పెరిగి పెద్దదయింది. కాని ఆమె స్వాతంత్ర్యానికి అణుమాత్రమైనా భంగం కలగలేదు. ఆమె జీవితంలో ప్రతీదీ స్వయంగా కోరుకుని ఎంచుకుంది. కాని పరీక్షాసమయం వచ్చేసరికి ఆమె ఆ పరీక్షకి ఆగలేకపోయింది. స్నేహితుడి వేషంలో ఆమెకు ఆపత్తు ఎదురైంది. పినతండ్రి స్నేహమనే మిషతో, ఆ ఆపత్తు

దాకా గడిచిపోయింది. కాని దుఃఖానికికూడా ఒకవిధంగా విశ్రాంతి ఏర్పడుతుంది. అందుచేత ఆమె చెంపలమీద కన్నీళ్ళప్రవాహం క్రమక్రమంగా ఇంకిపోయింది. కన్నీళ్ళతోతడిసిన కనురెప్పలకి క్రమంగా నిద్రపట్టింది.

ఆమె నిద్రపోయి లేచేసరికి అప్పుడే బాగాపొద్దెక్కింది. సుకేశుడికోసం ఆమె గదితలుపు తెరిచేఉంచింది. కాని అతను లోపలికి వచ్చాడో లేదో తెలియదు. పెరట్లోకి వచ్చేసరికి నౌకరు "బాబుగారు చీకటితోటేలేచి బండిఎక్కి వెళ్ళిపోయారు" అన్నాడు.

"ఆయనకూడా ఎవరైనా ఉన్నారా?"

"ఎవరూలేరండి! నేనుకూడావస్తానన్నానండి! కాని నన్నాయన రావద్దని చెప్పి ప్లేగురోగంవచ్చి చచ్చిపోవాలని ఉందేటూరా! అన్నారండి!"

"అందుచేత నువ్వుకూడా వెళ్ళలేకన్నమాట! దయతలిచి ఎల్లాగో అల్లాగబండి తీసుకువచ్చావనుకుంటాను! నన్నెందుకులేపలేదు!"

నౌకరు మాట్లాడకూరుకున్నాడు. అచలకూడా మాట్లాడకూరుకుంది. గాని మళ్ళీ ఒక్కనిమిషం ఊరుకుని "బండిఎవరు తీసుకువచ్చారు? నువ్వేనా?" అని అడిగింది. నౌఖరు తలవంచుకుని "అండి కొత్తగా తీసుకురావలసిన అవసరం ఏమిఉందమ్మా! నిన్న ఇంటికి వెళ్ళిపోయేటప్పుడు ఈవేళ బండి తీసుకురమ్మని ఆయనే చెప్పారమ్మా!" అన్నాడు.

ఆమాటవిని అచల నిశ్చేష్టురాలై పోయింది. ఆమె ఆలోచించినట్లు జరగలేదు! నిన్నసాయంత్రం జరిగిన సంఘటనకీ దీనికీ ఏమీసంబంధం లేదు. నిన్నసాయంత్రం జరిగిన సంఘటన జరక్కపోయినా అతను వెళ్ళిపోయేవాడే! వెళ్ళిపోవాలనే సంకల్పం అతను ఎప్పుడూ విడిచిపెట్టనేలేదు! అచల భయంచేత ఆ అభిప్రాయం రహస్యంగా మనస్సులో

ఉ చుకున్నాడు అంతే! ఆమె "బాబుగారు ఎప్పుడు తిరిగి వస్తారో చెప్పారా?" అని అడిగింది. నౌకరు ఎంతో సంతోషంతో "ఎల్లుండిగాని అవతల ఎల్లుండిగాని ఆతరవాత రోజునగాని తప్పకుండా వస్తామని చెప్పారండి!" అన్నాడు.

అచల ఆపైన ఏమీ అడగలేదు. నిన్న చీకటిలో జారి పడిపోయినప్పుడు ఎక్కడెక్కడ దెబ్బలు తగిలాయో బాగా తెలియలేదుగాని ఈవేళ మాత్రం ఒళ్ళంతా బాగా నొప్పిగా ఉంది. అందుచేత ఒంట్లో నీరసంగా కూడా ఉంది. ఆపైన రామబాబు ఈవిషయంలో ఆమెనొకసారి చూడడానికి వస్తే బావుణ్ణును. ఆకారణంచేత ఆభయం ఆమె మనస్సులో శూలంలాగ గుచ్చుకోవడం మొదలుపెట్టింది. మహిమను ఎవరితోనూ తమవిషయం ప్రస్తావించదన్న సంగతి సురేశునికంటె ఆమెకే బాగా తెలుసును. అయినాగాని ఏవేవో ఆకస్మికసంఘటనలు జరగవచ్చునని ఆమెకొక వెర్రిభయం పట్టుకుంది. అందుచేత ఆమె ఇంద్రియాలన్నీ ఈవేళవీధి ద్వారబంధంవైపు ఏకాగ్రదృష్టితో పరిశీలించడం మొదలుపెట్టాయి. ఆవిధంగా పొద్దున్నంతా గడిచిపోయింది. ఆతరవాత మధ్యాహ్నమూ, ఆతరవాత సాయంకాలమూకూడా గడిచిపోయాయి. రాత్రి అతనువస్తాడనేఆశ ఏమీ కనబడలేదు. అందుచేత అతనికోసం ఎదురుచూడ్డం మానేసి పడుకుంది. ఆమెకి ఎదురుగుండాఉన్న బల్లమీద ఒకఔషధాల కేటలాగు కనబడింది. ఆఔషధాల కేటలాగుకేసి అలాగ పరధ్యానంగా చూస్తూ ఆమె తన బాధలన్నీ మరిచిపోయింది. ఆమె కా కేటలాగులో ఒక ఔషధప్రకటన కనబడింది. ఆఔషధానికి మహారాజాధిరాజా మొదలుచ్చుకుని ఎలిమెంటరీ స్కూల్లో పనిచేస్తూన్న మూడోక్లాసు మేష్టరుదాకా అందరూ యోగ్యతాపత్రాలిచ్చారు. ఆయోగ్యతాపత్రాలు చదువుతూ ఆమె ఎప్పుడు నిద్రపోయిందో ఆమెకే తెలియదు!

నౌకరు "బాబుగారు రెండుమూడు రోజుల్లో వస్తా" రని చెప్పాడు. కాని అచలకి ఆరెండోరోజుని రోజంతా అతనికోసం నిరీక్షిస్తూ కూర్చోవడం చాలా కష్టమైపోయింది. క్రమంగా మూడోరోజు కూడా గడిచిపోయింది. రామబాబు ఈమూడురోజుల్లోనూ ఒక్కనాడూ కూడా సురేశుడిగారింటికి రాలేదు. రామబాబు వస్తారంటే అచలకి భయంగానేఉంది. కాని ఆయన ఈమూడురోజులనించీ రాకపోవడంవల్ల అచల మరింత భయపడింది. క్రమంగా ఆభయపిశాచం ఆమెను పట్టుకుని వేధించడం మొదలుపెట్టింది. ఆయనకి ఈమూడు రోజులనించీ జ్వరంగాఉంటే ఉండవచ్చుననికూడా ఆమె అనుకోలేకపోయింది. ఆఖరికి ఈవేళమాత్రం వారింటిదగ్గిరనించి ఒకనౌఖరువచ్చాడు. వాడు గేటులో ఉన్న నౌకరుని ఏవేవో ప్రశ్నలడిగి వెళ్ళిపోయాడు; అంతే! వాడు వచ్చి ఏమేమిసంగతులు అడిగి తెలుసుకున్నాడో కనుక్కోవాలని అచల కుతూహల పడింది. కాని భయంచేత చివరికి ఏమీ అడగలేకపోయింది. కాని అప్పటినించీ ఆమె మనస్సులో ఈభవనమూ ఈతోటావన్నీ విడిచిపెట్టి ఎక్కడికయినా పారిపోతే ప్రాణాలు రక్షించుకోవచ్చునేమో అని అనిపించింది.

ఆమె నౌఖరునుపిలిచి "రఘువీరా! నువ్వు ఈప్రాంతాలలో నివసించే వాడవు. నీకుబాబుగారు వెళ్ళినపల్లెటూరు ఎక్కడఉందో తెలుసునా?" అని అడిగింది. వాడు "చాలా రోజులకి పూర్వం నేనొకసారి ఆఊరు వెళ్లానమ్మా!" అన్నాడు.

"అక్కడికి ఎంతదూరం ఉంటుందో చెప్పగలవా?"

రఘువీరుడు ఈప్రాంతంవాడయినప్పటికీ చాలా కాలంనించి ఒంగాళీ వాళ్లతో కలిసిమెలిసిఉండడంచేత వాడికి కొంత లెఖ్ఖకట్టడం తెలుసును. అందుచేత వాడు మనస్సులో కొంత లెఖ్ఖవేసుకుని "పదహారుంది

క్రోసులికి తక్కువ ఉండవమ్మా!" అన్నాడు.

"ఈవేళ నువ్వు నాతోకూడా రాగలవా!" రఘువీరుడు ఎంతో ఆశ్చర్యపడి "అయింతక్కడికి వెంటాగా అమ్మా! అక్కడ నేను బాగా ఎక్కువ దూరముందనీ!" అన్నాడు. అచల "నువ్వు రాకపోతేనా! ఇంకెప్పటికైనా చెప్పవంపించగలవా! ఎంతదూరమైనా మీ అంతదూరం వస్తాను" అంది.

రఘువీరుడు మనస్సులో నవ్వుకొని "తమరు వెళ్ళలేకపోతే మేమురాలేక పోవటం ఏమిటమ్మా! కాని దారి బొత్తిగా బాగుండదమ్మా! తమపెద్ద గుర్రపుబండి అక్కడిదాకా వెళ్ళదమ్మా! మరి మోటారుబండిమీద గాని డోలీమీద గాని ప్రయాణంచెయ్యాలియుగదా! అమ్మా! అక్కడికి వెళ్ళడం ఎల్లాగ?' అన్నాడు. అచల "ఈసమయంలో ఏదొరికితే దానిమీద ప్రయాణంచేస్తాను. మరి ఇంక ఆలస్యంచేస్తే లాభంలేదు! నీకు ఏదిదొరికితే అది తీసుకురా!" అంది.

రఘువీరుడు ఆతరవాత ఇంకమాట్లాడకుండా గబగబావెళ్ళి ఒకడోలీ తీసుకువచ్చాడు. ఆతరవాత తన కంబళీ చెంబూ కర్రా మొదలైనవన్నీ ఒకమూటకట్టుకుని భుజంమీద వేసుకుని ఒకయుద్ధవీరుడిలాగ ఆడోలీతో కూడా నడిచివెళ్ళడానికి సిద్ధంగానుంచున్నాడు. అచల ఇంటిపనులా అంతా నౌకర్లమీద విడిచిపెట్టి సురేశుడికోసం తను ఇంతకుపూర్వం ఎప్పుడూ ఎరగని ఒకపల్లెటూరి వైపువెళ్ళడం మొదలుపెట్టింది. అప్పుడామెకు ఈమధ్యజరిగిన విషయాలన్నీ ఒకపెద్దస్వప్నంలాగ కనిపించాయి! ఆమె "ప్రపంచంలో ఇంతవిచిత్ర సంఘటన జరుగుతుందని ఎవరైనా ఊహించగలరా!" అని అనేకసార్లు మనస్సులో అనుకుంది.

అది ధూళితోనూ దుమ్ముతోనూ నిండిన ఒకమట్టిరోడ్డు. ఎదురుగుండా ఒకపెద్దమైదానం కనిపిస్తూంది. ఆరోడ్డు ఏదైనావక్కచిన్న పల్లెటూరిదగ్గిర ఆగిపోయిందో లేక ముందుముందు ఇంకా చాలా దూర దూరందాకా ఉందో చెప్పడంకష్టం. ఇప్పుడామె సంసారతాపత్రయం

వల్ల ఉన్న భవనం విడిచిపెట్టి ఇంతకుపూర్వం ఎన్నడూ, కనివిని ఎరగని ఒక గ్రామాంతరం వెళ్లవలసివచ్చింది. కొంతదూరం వెళ్లేదాకా ఆమెకు కొత్తకొత్త పరిసరాలన్నీ చూడడానికి బాగానే ఉన్నాయి. కాని ఇంకా కొంతదూరం వెళ్లేసరికి ఆమెకి ఎదురుగుండా ఒక శవం కనబడింది. ఆ శవాన్ని గడకర్రకి కట్టి నలుగురు మనుష్యులు మోసుకుపోతున్నారు. ఆ శవం కనబడేసరికి ఆ రోగం సంక్రమిస్తుందేమో ననే భయంచేత ఆమె శరీరం అంతా సంకుచితమయిపోయింది. ఆమె "చనిపోయిన మనిషి వయస్సెంత? అతనే రోగంచేత చచ్చిపోయాడు. అతనికింకా ఎవరెవరున్నారు?" అని అడుగుదామనుకుంది. కాని ఇంకా చాలా దూరం వెళ్లవలసిఉంది. అప్పుడే ఇంచుమించుగా సాయంకాలం కావస్తోంది. దగ్గిర దగ్గిరగా ఉన్న గ్రామాలనించి పెద్దపెద్ద ఏడుపులు వినిపిస్తున్నాయి. అందుచేత ఆమె ఏమీ అడగలేదు. ఆమెకు ఆయాసంవల్ల క్రమక్రమంగా కునికిపాట్లు రావడం మొదలుపెట్టాయి. పైగా ఆమెకు చాలాసేపటినించి బాగా దాహంకూడా వేస్తూంది. సరీగ్గా ఆ సమయాన్ని ఆ డోలీ ఒక నది గట్టుమీదనించే వెడుతూంది. ఆమెకు సమీపంలో ఒక రేవుకూడా కనబడింది. అందుచేత అచల డోలీ ఆపి అక్కడ దిగి ఆ రేవుదగ్గిరికి వెళ్లింది. ఆమెకు ఎదురుగుండా రెండు శవాలు కనబడ్డాయి. అవి నీటిలో సగం సగం మునిగి ఉన్నాయి. వాటి భీభత్సరూపం చూడడంవల్ల అచల మనస్సుకి ఏమీ ఆఘాతం కలగలేదు. ఆమె ఏమీ చలించకుండా నిర్భయంగా కాళ్లూ చేతులూ కడుక్కుని కొంచెం మంచినీళ్లు తాగి, మళ్లీ వెళ్లి డోలీలో కూర్చుంది. ఏ పరిస్థితుల్లోనైనా తనకిలాంటి అవస్థ పడుతుందని ఆమె ఎప్పుడూ అనుకోలేదు.

ఆ తరవాత ఆమెకు దోవలో కనపించిన గ్రామాలన్నీ చాలావరకు నిర్జనంగానే ఉన్నాయి. ఒక్కొక్కచోట బాగా గుండె ధైర్యం ఉన్నవాళ్లు కొందరు మిగిలారుగాని మిగిలినవాళ్లంతా ఇళ్లువిడిచి పారిపోయారు.

ఎక్కడా చీమచిటుక్కుమన్నా చప్పుడైనా వినిపించడంలేదు. ఏమి చేసి చూసినా చూడడానికి అసహ్యంగా ఉంది. గృహద్వారాలుకూడా ఇంకా చావుతప్పదని నిశ్చయంచేసుకుని దానికోసం నిరీక్షిస్తున్నట్టుగా కనబడ్డాయి. ఆడోలీమోసేవాళ్లూ రఘువీరుడూ అనిర్జనగ్రామాలలో పాకిలిపోతూ నడుస్తున్నారు. వాళ్లనడకా అదీ చూసేసరికి అచలకి అడుగడుక్కీ ఆపత్తేదో ముంచుకువస్తూన్నట్టే కనిపించింది. అయినా గాని ఆమె ఏమీ చలించలేదు. ఆమెధోరణి చూస్తే ఆమెకూ ఈఆపత్తులకూ ఏదో పూర్వజన్మసంబంధం ఉన్నట్టు కనిపించింది.

ఈవిధంగా ప్రయాణంచేసి వాళ్లు సురేశుడు వెళ్లిన పల్లెటూరుచేరుకునే సరికి అప్పుడే సూర్యాస్తమానం అవుతూంది. అచల అక్కడికిచేరుకునే సరికి తనకష్టాలన్నీ గట్టెక్కుతాయని అనుకుంది. ఆమె అక్కడికి వెళ్లేసరికి ఆపల్లెటూరివాళ్లంతా ఎంతో కృతజ్ఞతతో తనదగ్గిరికి పరుగెత్తుకు వస్తారనిన్నీ, ఆతరవాత ఎంతోమర్యాదగా సురేశుడిదగ్గిరికి తీసుకువెడతా రనిన్నీ అనుకుంది ఆమె అక్కడికివెళ్లేసరికి రోగులంతా సురేశుడి చుట్టూమూగి ఉంటారనికూడా అనుకుంది. ఆమె తనఅక్కడికి వెళ్లగానే ఎక్కడకూర్చోవాలో ముందుగానే మనస్సులో నిర్ణయించుకుంది. కాని తీరాఅక్కడికి వెళ్ళేసరికిఆమెకు తనుఅనుకున్నదంతా ఒట్టిభ్రాంతి అని అనిపించింది. అక్కడ ఆమెకెవ్వరూ కనబడలేదు. ఈపల్లెటూరుకూడా సరిగ్గా దోవలోకనబడిన పల్లెటూళ్లమాదిరిగానే ఉంది. ఇక్కడకూడా తలుపులన్నీ వేసి ఉన్నాయి. సురేశుడు ఎక్కడ ఉన్నాడో వెతికిపట్టుకోవడంకూడా చాలాకష్టం.

ఈఊళ్లో రోజూ సంత జరుగుతూఉంటుంది. అది ఈవేళకూడా జరుగుతూంది. కాని మూడుఝాములయ్యేసరికి జనంఅంతా ఎవళ్ల ఇళ్ళకివాళ్ళు పారిపోతారు. దుకాణాలు పెట్టినచోట్ల ఇంకా కొంచెం కొంచెంగుర్తులు కనిపిస్తున్నాయి. రఘువీరుడు వెతికివెతికి ఒకదుకాణ

దారడిగి ఇల్లు కనుక్కున్నాడు. ఆ దుకాణదారుడు ఒక కళకళవృద్ధుడు. వాడు దుకాణపుతాళపుచెవులూ అవీ అప్పగించేమూసివేశాడు. వాడు "తనవాళ్ళంతా ఇంకొకచోట ఉండేవారి గోదావరిలో, దుకాణం బిగించక తాపీనంగా ఉండేది పెట్టలేక తనూ తన భార్యామాత్రం ఆ దుకాణాన్ని అంటిపెట్టుకుని ఉన్నామనిన్నీ చెప్పాడు. ఆ పైన రఘువీరుడు సుశీలుడి సంగతి అడిగాడు. ఆ దుకాణదారుడు "డాక్టరుబాబుగారు ఇంతవరకూ సందూపాండ్యాగారి ఇంట్లో ఉన్నారు బాబూ! మరిప్పుడు మహామ్మ్రుపురం వెళ్ళారో లేక పోతే అక్కడే ఉన్నారో తెలియదు బాబూ!" అన్నాడు.

"మహామ్మ్రుపురం ఎక్కడ ఉంది?"

"సరిగ్గా ఇక్కడికి దక్షిణంగా రెండు క్రోసుల దూరంలో ఉంటుంది!"

"సందూపాండ్యాగారి ఇల్లెక్కడ?"

ఆ ముసలివాడు ఇవతలికి వచ్చి ఒక పెద్ద మేడచుట్టు చూపించి "అక్కడికి వెళ్ళి కనుక్కుంటే తెలుస్తుంది బాబూ!" అన్నాడు. ఆపోలీవాళ్ళు హడిలిపోతూ అచలని ఆ మేడచుట్టున్న ఇంటిదగ్గిరికి తీసుకువెళ్ళారు. అప్పటికప్పుడే సూర్యాస్తమానం అయిపోయింది. ఆ ఇల్లు చాలా పెద్దది. ఆ ఇంటి పైన నాలు రెండుమూడు పెంకుటిళ్లు కనిపిస్తున్నాయి కాని మిగిలినవన్నీ ఇంచుమించుగా మట్టిఇళ్ళే. ఆ ఇంటికి ఎదురుగా ప్రహారీగోడ లేదు. అంతా మైదానమే. ఆ ఇంటియజమాని బాగా డబ్బున్నవాడిలాగే కనిపించాడు. కాని ఇంటిలోంచి ఒక్కళ్ళూ ఇవతలికి రాలేదు! నౌకర్లూ చాకర్లూకూడా ఎవ్వళ్ళూ కనబడలేదు. లోపల ఒక గుర్రం కట్టివేసి ఉంది. అది ఆకలికీ దప్పికీ ఓర్చుకోలేక ఎంతో జాలిపుట్టేటట్లు గట్టిగా సకిలిస్తున్నాది.

సింహద్వారం తెరిచేఉంది. రఘువీరుడు సాహసించి లోపలికి తొంగి [illegible] ఒక మంచంమీద సుశీలుడు పడిఉన్నాడు. [illegible] దగ్గిరగా కూర్చుని కసిపాళ్లు పడుతూంది.

"బాబుగారూ!"

సురేశుడు కళ్ళు తెరిచి మంచంపట్టెలసహాయంతో కొంచెం పైకిలేచి తలఎత్తి రఘువీరుడికేసి చూశాడు. ఆపైన "ఎవరు? రఘువీరా!" అన్నాడు. రఘువీరుడు సలాము చేసి పక్కగా వెళ్ళినిలబడ్డాడు. సురేశుని ముఖంకేసీ ఎర్రగా చింతనిప్పుల్లాగున్న అతని కళ్ళకేసీ చూసేసరికి రఘువీరుడికి మరినోటమ్మట మాట రాలేదు.

"నువ్విక్కడికి ఎల్లాగవచ్చావు!"

రఘువీరుడు మళ్ళీసలాముచేసి కేవలంభీతిమైప్రకాశించిన "అమ్మగారు—" అని మాత్రం అని ఊరుకున్నాడు. సురేశుడు ఆశ్చర్యపడి లేచికూర్చుని "నిన్నిక్కడికి పంపించారా?" అన్నాడు. రఘువీరుడు "కాదండి! అమ్మగారు స్వయంగా ఇక్కడికి వచ్చారండి!" అన్నాడు. ఆమాటవిని సురేశుడు రఘువీరుడికేసి అదేపనిగా చూడడం మొదలు పెట్టాడు. సురేశుడిధోరణిచూస్తే రఘువీరుడు చెప్పినమాట పూర్తిగా బోధపరుచుకోడానికి చాలాసేపు పట్టిందేమోనని అనిపించింది. ఆతరవాత సురేశుడు కళ్ళుమూసుకుని మెల్లి మెల్లిగా పడుకున్నాడు; అంతే గాని ఏమీమాట్లాడలేదు. ఆతరవాత అచలవచ్చి అతనికాళ్ళదగ్గరగా కూర్చుంది. అతను అల్లాగేకళ్ళుమూసుకుని పడుకుండున్నాడు. అంతే గాని మర్యాదకోసం ఆఖరికి "రా! ఇల్లాగవచ్చికూర్చో!" అన్న మాటైనా అనలేకపోయాడు. సురేశుడు చిన్నప్పటినించీ చాలా గారంగాపెరిగాడు. అందుచేత అతనికి ఎంతతోస్తే అంతే చెయ్యడం అలవాటుయుందిగాని, ఆత్మనిగ్రహం కొంచెమైనా అలవాటు కాలేదు. అతనికి ఆత్మనిగ్రహంఅనేది రామబాబుగారింటిదగ్గిర మహిముడు చటుక్కుని ముఖం ఇంకోకపక్కకి తిప్పేసి లోపలికి వెళ్ళిపోయినప్పుడు మాత్రమే అలవాటయింది. ఆవేళఅతను నిశ్శబ్దంగా ఎంతయాతన అనుభవించాడో ఆపరమేశ్వరుడికే తెలియాలి! అచల అతనికేసిచూసి

"ఈవేళ ఈయనహృదయంలో ఎల్లాంటితుపాను చెలరేగుతూందో!" అని అనుకుంది. ఆవేళ మహిముడివల్ల ఆ ఆఘాతం అనుభవించి అతను ఆ బాధఅంతా నిశ్శబ్దంగా ఓర్చుకున్నాడు. అల్లాగే ఈవేళ కూడా అతనులోపలనించి పొంగిపొంగివస్తూన్న ఆవేశం పైకిరాకుండా ఉండడానికి విశ్వప్రయత్నం చేశాడు. అతను తనకికలిగిన పశ్చాత్తాపం కూడా కొంచెమైనా పైకి కనబడనీయలేదు.

ఈవిధంగా ఎంతసేపుగడిచిపోయిందో చెప్పడంకష్టం. కాని ఇంతలో జోలీమోసేవాళ్ళ పిలుపువిని రఘుపీరుడు చటుక్కుని అక్కడినించి వీధులోకి వెళ్ళిపోయాడు. అప్పుడుసురేశుడు మెల్లిమెల్లిగా కళ్ళుతెరిచి చూసి "మీకునేనురాసిన ఉత్తరం అందిందా?" అని అడిగాడు. అచల ముఖంపైకెత్తకుండానే "లేదు" అంది. సురేశుడు ఆమాటవిని ఎంతో ఆశ్చర్యపడి "మీరు ఉత్తరం అందకుండానేవచ్చారా! చాలా ఆశ్చర్యంగా ఉందే! సరే! మంచిపనిజరిగింది. ఒకసారి మళ్ళీ ఒకరినొకరు చూసుకున్నాము" అన్నాడు. ఆపైన తలవంచుకునికూర్చున్న ఆమెకేసి చూసి "నాకోసంమీరు ఎన్నోకష్టాలు అనుభవించారు. బతికిఉన్నంతకాలమూ ఇంకమీకు నాగొడవ అక్కరలేదు. సరే! దానికేంగాని, నేనుచాలా పెద్దపొరపాటుపని చేసేశాను. మీకు మహిముడిమీద ఇంతప్రేమ ఉన్నదన్న సంగతి నాకు తెలియదు. బహుశః ఆసంగతి మీకే తెలియదేమో!" అన్నాడు.

కాని అచల అల్లాగే నిశ్శబ్దంగా తలదించుకుని కూర్చుంది. అది చూసి సురేశుడు మళ్ళీ ఇల్లా అన్నాడు. "ఆమాట అల్లాగ ఉండనీయండి! మనిషి మనస్సు ఎప్పుడూ స్వతంత్రంకాజాలదని నా అభిప్రాయము. అది కేవలం దేహధర్మాన్ని అనుసరించి నడుస్తూఉంటుందని నేననుకుంటాను! ప్రేమకూడా అంతే! మీ శరీరాన్ని పొందితే మీ మనస్సునికూడా పొందగలనని ఆశించాను. ఎల్లాగోఅల్లాగ క్రమంగా

మీ ప్రేమకూడా లభిస్తుందని అనుకున్నాను. ఎప్పటికో అప్పటికి అదృష్టం బాగుపడక పోతుందా! అని అనుకున్నాను. నేను నా సమస్తం సమర్పించి మిమ్మల్ని ప్రేమించాను! అదేవిధంగానే మీరుకూడా నామీద దయతలిచి నాకు ప్రేమభిక్షాదానం చేస్తారని అనుకున్నాను; కాని ఆవిషయాలన్నీ చర్చించడానికి ఇప్పుడు వ్యవధిలేదు. ఏమైతేనేం! మొత్తం మీద ఇంకా కొంతకాలం నిరీక్షించడానికి నాకవకాశం దొరకలేదు" ఆతరవాత అతను మంచంపట్టెలసహాయంతో కొంచెం పైకిలేచి కళ్లు రెండూ పెద్దవిచేసి ఆసంధ్యాకాంతిలో అదేపనిగా అచలకేసి చూడటం మొదలుపెట్టాడు.

అచల అతనికేసి ఒకక్షణకాలం ఎంతో ఆప్యాయంగానే చూసింది. కాని ఆఉత్తరక్షణంలో కిందికిచూస్తూ ఎంతోసిగ్గుపడుతూ అతి మృదువుగా "ఇక్కడినించికూడా జనం పారిపోతున్నారు. అందుచేత ఇక్కడి పని అయిపోతే ఇంటికి వెళ్లిపోదామురండి లేకపోతే ఇంకెక్కడికైనా వెళ్లిపోదాము నడవండి! అంతేనేగాని డొహాకీలోమాత్రం ఒక్కక్షణ కాలమైనా ఉండలేము!" అంది. సురేశుడు "ఈసంగతి నాకు తెలిసినంత బాగా ఇంకెవ్వరికీ తెలియదు" అని ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి చటుక్కుని తలగడామీద పడిపోయాడు. ఆపైన అతను అల్లాగ కొంతసేపుండి స్తిమితపడి మళ్లీ మెల్లమెల్లగా "ఈవేళపొద్దున్న అతికష్టం మీద రెండుఉత్తరాలు రాయగలిగాను. అందులో ఒకటిమీనాకూ, ఇంకొకటిమహిముకీ పంపించాను. అతను వెళ్లిపోకపోతే ఒకసారి ఇక్కడికి వస్తాడనుకుంటాను" అన్నాడు.

అదివిని అచల భయంచేతా ఆశ్చర్యంచేతా ఒక్కసారిగా ఉలిక్కిపడింది. ఆపైన "ఆయనకి ఎందుకు?" అంది. అదివిని సురేశుడు పూర్వంమాదిరిగానే మెల్లిమెల్లిగా "ఇప్పటికీ అతను తప్పకుండా రావలిసినఅవసరం ఒకటిఉంది. నేను చిన్నప్పటినించీ అనేకమైన ఘోర

బాటుపనులు చేస్తూ ఉండడమూ వాటివిషయంలో అతనునాకు సహాయము చేస్తూ ఉండడమూ ఎప్పుడూ ఉన్నదే. అందుచేత ఈసారికూడా నేను అతన్నే పిలిచాను. ఇల్లాంటి ధైర్యం ప్రపంచకంలో ఇంక ఎవరికీ ఉండదు!" అన్నాడు.

అచల ఈమాటవిని మనస్సులో ఎంతో కంగారుపడింది కాని తల వంచుకుని అల్లాగే వింటూకూర్చుంది. సురేశుడు మళ్లీ "నాఉత్తరంలో అన్నిసంగతులూ ఉన్నాయి. చదివితే తెలుస్తుంది. ఆవేళ నేను మీకిచ్చినది నావీలునామా. అవసరంఅయితే మీరు ఆఆస్తిలో కొంత తీసుకోవచ్చును. బహుశః మీకు అల్లాగ తీసుకోవలసిన అవసరమేమీఉండదని నాఅభిప్రాయము. నేను బ్రతికిఉన్నంతకాలమూ నాఆస్తిఅంతా చాలవరకు బీదవాళ్లకోసం ఖర్చుపెట్టాను నేను చచ్చిపోయినతరవాతకూడా అల్లాజరిగితే చాలాసంతోషిస్తాను. మీరు నాకు సంబంధించినదానితో దేనితోనూ సంబంధం పెట్టుకోకండి! మీభావిజీవితం నిశ్చింతగానూ నిర్విఘ్నంగానూ జరగాలని నా కోరిక! నాతో మీకు ఏవిధమైనసంబంధమూ లేకపోతే నేను చాలా సంతోషిస్తాను. ప్రయత్నించేస్తే ప్రపంచకంలో ఏదుఃఖమైనా సహించవచ్చును. నావల్ల వచ్చిన దుఃఖంగూడా మీరు ఆవిధంగా సహించగలరని నాఆశ!" అన్నాడు.

అచల ఇక్కడికివచ్చినప్పటినించీ అతనిమాటలూ అతనిధోరణీ చూసి లోలోపల బాగా భయపడుతూంది. అతను ఈచివర అన్న మాటలు విని ఆమె నిజంగా చాలాభయపడింది. అందుచేత "ఈమాటలన్నీ ఇప్పుడు నాతో సంప్రతించడం ఎందుకు? మీరు లేచికూర్చోండి! మనంఇప్పుడే బయలుదేరి ఇంటికి వెళ్లిపోదాము!" అంది. సురేశుడు అచలభయమూ అదీ చూశాడు. అయినాగాని ఏమీ సమాధానం చెప్పలేదు. ఆమంచంకిందదగ్గిర కూర్చుని పాటుపడుతూన్న ముసలివి

కొంచెం తేలుకుని "బాబుగారూ! మీరు లోపలికివస్తారా? లేకపోతే దీపం ఇక్కడికి తీసుకురమ్మన్నారా?" అని అడిగింది. అతను దానికి కూడా ఏమీ సమాధానం చెప్పలేదు. ఇంతలో అతనికి మగత కమ్మింది. అచల కంగారుపడి తను అడిగినప్రశ్నే మళ్లీ అడగాలని అనుకుంది; కాని ఇంతలో సురేశుడు కళ్లు తెరిచి చూసి అతిసహజమైన కంఠస్వరంతో "ఇంతవరకూ మీతో నేను అసలుసంగతి చెప్పలేదు. నేనింక కొద్దిసేపటిలో చచ్చిపోతాను. నేనింక బతకడానికి అణుమాత్రమైనా ఆశలేదు" అన్నాడు.

ఆమాట వినేసరికి అచల కంఠంలోనించి ఒక అవ్యక్తమైనధ్వని పైకి వచ్చింది. ఆపైన ఆమె రాతివిగ్రహంలాగ అల్లాగే కూర్చుండి పోయింది. సురేశుడు మళ్లీ చెప్పడం మొదలుపెట్టి "నేను వీలునామా ముట్టమొదటే రాశాను; కాని ఎవరైనా నేను చావాలని చచ్చిపోతున్నానని అనుకుంటే నాకుచాలా అన్యాయం చేశానన్నమాట! అది నాకు చచ్చిపోవడంకంటేకూడా ఎక్కువగా బాధకలిగిస్తుంది. నేను చాలా జాగ్రత్తగా ఉన్నాను. ఏదీ పొరబాటుపని చెయ్యలేదు; కాని చివరికి ఏమీ ఉపయోగం లేకపోయింది! ఒకవేళ ఎవరైనా ఎప్పుడైనా మిమ్మల్ని అడిగితే నేను ప్రపంచంకంలో అందరికిమల్లేనే జబ్బుచేసి చచ్చిపోయానని చెప్పండి! చావకుండా ఉండడానికి ప్రయత్నించాను గాని లాభంలేకపోయింది. అందుచేత చచ్చిపోతున్నాను! నేను చచ్చిపోవడం విషయంలో ఏవిధమైన అపవాదూ లేకుండా ఉండాలని నాకోరిక!" అన్నాడు.

అచల ఏమీమాట్లాడలేదు. అసలు ఆమెలో మాట్లాడ్డానికికూడా శక్తిలేదు. ఆసాయంకాలపుకనుచీకటిలో సురేశుడు ఈవిషయం గమనించలేకపోయాడు. సురేశుడు కొంచెంసేపటిదాకా మాట్లాడకూరుకుని బాగా స్తిమితపడి మళ్లీ చెప్పడం మొదలుపెట్టాడు. "నేనిక్కడికి రాకుండా ఉండ

డానికి వీల్లేకపోయింది. అందుచేత మీతో చెప్పకుండా, ఆవేళపొద్దున్నే ఇక్కడికివచ్చేశాను. ఇక్కడికివచ్చి చూసేసరికి గ్రామమంతా చాలావరకు నిర్మానుష్యంగాఉంది ఈ ఇంటిలో ఒకసారి కలరావచ్చిపోయింది. ఇంట్లో వాళ్ళంతా వాడిదహనసంగతి ఆలోచించకుండా ఎవళ్ళ ప్రాణాలకి వాళ్ళు పారిపోడానికి సిద్ధపడ్డారు. నేనువాళ్ళెవళ్ళనీ ఆపలేకపోయాను. కాని ఆ శవానికి మాత్రం ఎల్లాగోఅల్లాగ దహనసంస్కారం చేయించగలిగాను. ఆ శవాన్ని తగలబెట్టించి తిరిగివస్తూ ఇంక ఇంటికి తిరిగి వెళ్ళిపోదామని అనుకున్నాను. కాని రెండుజాములయ్యేసరికి ఒకకుర్రవాడు ఏడుస్తూవచ్చి వాళ్ళమ్మకి జబ్బుగా ఉందనిచెప్పాడు. వాళ్ళింటికి ఆపరేషన్ చేస్తూంటే నా కీమురదృష్టం సంక్రమించింది. నేను ఇల్లాంటిఆపరేషనులుచాలాచేశాను. ఆపరేషను చేసేటప్పుడుకూడా చాలాజాగ్రత్తగాఉన్నాను అయితేం ఒక విషయంలోమాత్రం కొంచెంపొరపాటుచేశాను. దారిలో వస్తూంటే బొటనవ్రేలుకి బండిచక్రం తగిలిగీసుకుపోయింది. ఆపరేషనుచేసేటప్పుడు నాకా విషయంజ్ఞాపకం లేదు. ఆపరేషనుచేసి చేతులు కడుక్కుంటూంటే నాకా సంగతి జ్ఞాపకంవచ్చింది. చటుక్కుని అప్పుడుచేయవలసిన ప్రతిక్రియలన్నీ చేశాను. ఇంటికితిరిగి రావడానికి ఏఉపాయంఉన్నాతిరిగి వచ్చేసేవాణ్ణే! కాని ఎంతప్రయత్నించినా తిరిగి ఇంటికి రాలేకపోయాను. నిన్నరాత్రికొంచెం జ్వరంవచ్చినట్టు కనబడింది. కానిఆజ్వరంఏమిటో నాకు తెలిసిపోయింది. అప్పుడు ఎంతో కష్టపడి, బ్రహ్మాండంమీద ఒక మనిషిచేత మీఇద్దరికీ ఉత్తరాలు పంపించగలిగాను."

అచల కంటనీరుపెడుతూ గద్గదస్వరంతో "అయితేఇప్పటికికూడా ఒకఉపాయంఉంది. మిమ్మల్ని నేను ఎక్కివచ్చినడోలీలో కూర్చోపెట్టి ఇంటికి తీసుకువెళతాను. ఇంకమీరిక్కడ ఒకనిమిషంఅయినా ఉండడానికి వీల్లేదు" అంది.

"మరి మీరు?"

" నేను నడచి వస్తాను. నా విషయంలో మీరేమీ కంగారు పడక్కరలేదు.

" నడచి వస్తావా ! ఇంత దూరమా !"

మీ కాళ్ళు పట్టుకుంటాను. ఇప్పుడు నేను చెప్పేదానికి అడ్డుచెప్పకండి" అని అచల బాబుని వేడింది. సురేశుడు ఒక క్షణకాలం నిశ్శబ్దంగా ఉండి ఒక నిట్టూర్పు విడిచి " సరే నువ్వు చెప్పినట్టే చెయ్యవచ్చును. కాని బహుశః ఇంక ఇంటికి తీసుకువెళ్ళడంవల్ల ఉపయోగం ఏమీ ఉండదనుకుంటాను. అందువేత తీసుకువెళ్ళవలసిన అవసరం ఏమీలేదు" అన్నాడు. అచల పెరట్లోకి వెళ్ళి చూసింది. రఘువీరుడు వేపచెట్టుక్రింద సెనగలు నములుతూ కూర్చున్నాడు. ఆమె వాణ్ణి దగ్గరికి పిలిచి" రఘువీరా! బాబుగారికి చాలా జబ్బుగా ఉంది. తక్షణం మనం ఇంటికి తీసుకు వెళ్ళాలి. ఎన్ని రూపాయలు కావలిస్తే అన్ని రూపాయలు ఇస్తానన్నానని చెప్పి డోలీవాళ్ళని పిలుచుకురా. ఇంక ఒక్క నిమిషమైనా ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు!" అంది.

యజమానురాలి కంఠస్వరం విని వాడు కంగారుపడి "అయితే వాళ్లు ఇద్దరినీ ఒక్కసారి మోసుకువెళ్ళలేరమ్మా!" అన్నాడు.

" అబ్బే! ఇద్దరినీ తీసుకువెళ్ళక్కరలేదు ఒకర్ని తీసుకువెడితే చాలు. నేను నడిచి వస్తాను— అయితే ఇంక మనం ఒక్క నిమిషమైనా ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు! ఆ డోలీమోసేవాళ్లెక్కడ ఉన్నారు?"

రఘువీరుడు " వాళ్ళకి కావలసిన కూలీ తీసుకుని వాళ్ళు ఇప్పుడేమంచి నీళ్లు తాగడానికి వెళ్ళారు. నేను వెళ్ళి వాళ్ళని ఒక్క నిమిషంలో తీసుకు వస్తాను" అన్నాడు. ఆపైన వాడు కండువా కొంగుకి కొన్ని సెనగలు కట్టుకుంటూ గబగబా అక్కడనుంచి వెళ్ళిపోయాడు. అచల తిరిగివచ్చి సురేశుడి తలగడా వైపుని కూర్చుని అతని నుదురుమీంచ చెయ్యిపెట్టి చూసింది. అతని నుదుటివేడి చూసి ఆమె ఎంతో భయపడింది. అక్కడకూర్చున్న ముసలిది ఒక కిరసనాయిలుబుడ్డి వెలిగించి అక్కడపెట్టింది. ఒక్క నిమి

మనులో ఆదీవం పోగ ఇల్లంతా సంకీపోయింది. ఆపోగ ఇటూ అటూ కొట్టి వేస్తూంటే అచలకి అక్కడ ఒకమందు సీసా కనబడింది. ఆమె సురేశుడు కేసి తిరిగి "ఈమందు మీదేనా ?" అని అడిగింది. సురేశుడు "అవును ; ఇది నామందే! నిన్న నేను ఇదన్న్యాయంగా తయారుచేశాను; కానిచివరికి తాగ లేకపోయాను" అన్నాడు.

ఈమాటవిని అచలమనస్సులో ఎంతో బాధపడింది. కాని అతన్ని దానికి కారణం అడిగి వాదోపవాదాలు పెంచడం ఆమెకిష్టంలేదు. అతనికి మందిచ్చి ఆమె మళ్ళీ వెళ్ళి తలగడా దగ్గిర కూర్చుంది. చాలా సేపటిదాకా సురేశుడు ఏమీ మాట్లాడలేదు. కాని అతను నిశ్శబ్దంగా అనుభవిస్తూన్న ఆబాధ చూసేసరికి అచలకి కన్నుళ్ళు తిరుక్కుపోయింది. అప్పుడే చాలా ఆలస్యం అయింది. కాని ఇంతవరకూ రఘువీరుడి సంగతి ఏమీ తెలియలేదు. అచల మధ్యమధ్యని గబగబా వీధిలోకి వచ్చి రఘువీరుడు వస్తున్నాడేమోనని చూస్తూ ఆకినంతవరకు చూసింది. ఆ అంధకారంలో ఎంతసేపు చూసినా ఆమెకెవ్వరూ కనబడలేదు. పైగా ఈ కంగారూ అదీ సురేశుడు కనిపెట్టిపోతాడేమోనని ఆమె మరింత భయపడడం మొదలుపెట్టింది.

అప్పుడే ఇంచుమించుగా అర్ధరాత్రి కావచ్చినది. మంచంకోటిదగ్గిర పడుకుని నిద్రపోతూన్న ముసలమ్మ బాగాగుర్రుపెట్టడం మొదలు పెట్టింది. ఇంతలో రఘువీరుడు లోపలికి వచ్చాడు. వాడు బాగా అలసి పోయాడు. వాడిముఖంమీద నిరుత్సాహం తాండవిస్తూంది. వాణ్ణి చూసి అచల ఏదో మూడింది అనుకుంది. వాడు తెల్లతెల్లబోతూ "డోలీమోసే వాళ్లు డోలీతీసుకుని తిరిగి వెళ్ళిపోయారమ్మా ! వాళ్లు వెళ్ళి అప్పుడే చాలాసేపయింది. ఎంతదూరం వెళ్ళినా వాళ్ళెక్కడా కనబడ లేదు !" అన్నాడు.

అచల తను శాన్తగంభీరంగా ఉండాలన్న విషయం అంతా మరిచి

పోయి వికృతమైన కంఠస్వరంతో మాటిమాటికీ "అయ్యయ్యో! అంతా వెళ్ళిపోయారా? ఏదారమ్మట వెళ్ళారు? ఎందుకు వెళ్ళిపోయారు? నాడబ్బంతా ఇస్తానన్నా గాని నాకీవేళ ఒక్క డోలీ దొరకదా?" అని అనడం మొదలుపెట్టింది. రఘువీరుడు తలవంచుకుని నుంచున్నాడు; అంతే గాని ఏమీ మాట్లాడలేదు. వాడు "వచ్చిన ఆపత్తే కాకుండా డోలీ వాళ్ళు కూడా వెళ్ళిపోయారేం?" అని లోలోపల ఎంతో బాధపడి, చేయవలసిన ప్రయత్నం అంతా చేసి ఇంక ఏమీ లాభం లేదన్నప్పుడు తిరిగి అచల దగ్గిరకి వచ్చేశాడు.

సురేశుడు మాత్రం ఆ పరుపుమీద అల్లాగే పడుకుని ఉన్నాడు. అతని ముఖంలో ఏమీ కంగారు కనబడలేదు. రఘువీరుడు వెళ్ళిపోగానే అతను అచలకేసి తిరిగి మెల్లిగా "ఇప్పుడు మీరు కంగారుపడితే మాత్రం ఏమి ఉపయోగం ఉంది? ఆ డోలీ వాళ్ళు దొరికినా మనకి ఉపయోగం లేకపోను! ఇదే బాగుంది. నేను ఇక్కడ ఉండడమే మంచిది!" అన్నాడు. అచల ఏమీ మాట్లాడలేదు. అనంతయాత్రికుడైన ఆ వ్యక్తి నుదుటిమీద చెయ్యివేసి రాతివిగ్రహంలాగ అల్లాగే కూర్చుండి పోయింది. నాలుగువైపులా నిర్మానుష్యంగా ఉన్న ఆ ఊరు భయంకరమైన మృత్యువులాగ కనబడింది. అసలే గంభీరంగా ఉన్న రాత్రి మరింత గంభీరంగా మారిపోతూంది. పైన నీలాకాశం మరింత ఎక్కువగా నల్లబడిపోతూంది. ఆమె ఆ బాహ్యప్రకృతి కేసి మాటి మాటికీ చూసి "దీనికంతటికీ పరమావధి ఏమిటి? ఇదంతా ఇల్లాగ ఎందుకు జరగాలి?" అని అనుకుంది.

ఆమె జీవిత కురుక్షేత్రంలో ఈవేళ ఒక ప్రచండమైన సంగ్రామం జరుగుతూ ఉంది. ప్రపంచకంలో ఈ సంగ్రామానికి ప్రయోజనం ఏమిటి? ప్రపంచకంలో అనేకమైన నైచ్యాలూ అనేకమైన స్వార్థాలూ కలిసి ఏర్పడిన ఈ మహాసంగ్రామం ఈ రాత్రిలాగ ఈవేళే ఆఖరై పోతుందా?

లేకపోతే కురుక్షేత్ర స్మశానంలాగ యుగయుగాంతరాలదాకా అల్లాగే ఉండిపోతుందా? ప్రపంచకంలో దీనికంతటికీ ప్రయోజనం ఏమిటి? అసలీ కురుక్షేత్ర సంగ్రామం ఎందుకు వచ్చింది? ఇదంతా ప్రారంభించినవారెవరు?

ఈవేళ ఈశ్వరశక్తి తన సంపత్తూ, ఐశ్వర్యమూ, మొదలైనవాటి నన్నిటినీ విడిచిపెట్టి ఈ దిక్కు లేనిచోట చచ్చిపోవడానికి సిద్ధంగా కూర్చున్నాడు. ఈశ్వరశక్తి ఒకప్పుడూ ఇంతగొప్ప త్యాగం ఎందుకు లేవదీశాడు? ఇంక ఎవరికీ ఈత్యాగంలో వంతులేదూ?

అచల అనేకవిధాల ఏవేవో ఆలోచించింది గాని చివరికి అన్నీ ఒక్కసారిగా గూనేసి యథాప్రకారంగా తిన్నగా కూర్చుంది. ఆమెకు ఎవరో ఒక్కసారిగా రెండు చేతులతోనూ గొంతుక పిసికివేసినంత బాధ కలిగింది. ఇంతలో సురేశుడు మంచినీళ్ళు కావాలని అడిగాడు. అచల కొంచెం ఒంచి, అతని గొంతుకలో నీళ్ళు పోసి మళ్ళీ యథాప్రకారంగా తిన్నగా కూర్చుంది. ఆమె కేమీ ఆయాసం కలగలేదు. ఆమెకళ్ళకి నిద్రవచ్చేసూచన కూడా కనబడలేదు. ఆమె అల్లాగే ఆకాశంకేసి చూస్తూ కూర్చుంది. ఆమెకు తన జీవితంలో ఒకమహాసంగ్రామం పూర్తి అయిపోతూన్నట్లు కనబడింది. ఆమె కళ్ళకి ఎదురుగుండా పెద్దపెద్ద రక్తప్రవాహాలు ప్రవహిస్తున్నాయి. అనేకమంది కాళ్ళూ చేతులూ తెగిపోవడంచేత ఇటూ అటూ దొర్లుతూ ప్రాణాలు విడిచిపెడుతున్నారు. కోట్లకొలది చితులు ప్రజ్వలిస్తున్నాయి. ఆచితులవల్ల బయలుదేరినపొగ స్వర్గమర్త్యలోకాల్లో సంపూర్ణంగా వ్యాపించింది! చివరికి ఆలోకాలు రెండూ ఏకాకారంగా మారిపోయాయి!

కొంతసేపటికి మళ్ళీ సురేశుడికి కొంచెం మగతకమ్ముకుని ఉంటుంది. అతను ఏమీ మాట్లాడకుండా పరుపుమీద అల్లాగే పడుకున్నాడు. అర్ధరాత్రికూడా క్రమక్రమంగా గడిచిపోయింది. అప్పుడే ఇంచు

మించు తెల్లవారకట్ల కానవచ్చింది. కాని అచలకి ఇంకా తెల్లవార్లేదు! ఆమె కళ్లుమూసుకుంది; కన్నీళ్లు కళ్ళమ్మట అదేపనిగా ప్రవహిస్తున్నాయి. ఆమెచేతులు రెండూ సుకేశిని తలగడామీద పడి ఉన్నాయి. ఆమె ఏకాగ్రమైన మనస్సుతో "పరమేశ్వరా! నేను అనేకదుఃఖాలు అనుభవించాను. నేను పడ్డ బాధలకి అంతూదరీలేదు! నాదుఃఖాలకీ బాధలకీ బదులుగా నువ్వు నన్ను వేగ నీసన్నిధికి తీసుకువెళ్ళిపో! నేనుచేసిన అపరాధాలన్నీ క్షమించు! నాకు తల్లీ, తండ్రీ, సోదరుడూ, భర్తా,—ఎవ్వరూలేరు! నేనువేళ ఈఅభిశాపం భరించలేకుండా ఉన్నాను. దీనమూలాన్ని నా క్షీణపంచకంలో నిలవనీడలేకుండా పోయింది. ప్రభూ! నేనెంత సహించానో నీకు తెలుసునుగదా! నాకింక జీవితం అక్కరలేదు! నన్ను నీసన్నిధికి తీసుకుపో!" అని ప్రార్థించింది. ఆమె ఆవాక్యాలన్నీ ఎన్నెన్నిసారులు ఉచ్ఛరించిందో లెక్కలేదు. ఆవేళ ఆమెకళ్ళమ్మట ప్రవహించిన కన్నీటికికూడా అంతూ దరీ లేదు!

"అమ్మగారూ!"

అప్పుడప్పుడే తెల్లవారింది; అచల ఉలిక్కిపడి చూసింది. రఘువీరుడు లోపలికి ఎవరినో తీసుకువచ్చే ఉద్దేశంతో సింహద్వారందగ్గర నుంచుని ఆమె ఆజ్ఞకోసమై నిరీక్షిస్తున్నాడు. ఆమె రఘువీరుణ్ణి చూసి "ఏమిటి!" అంది. ఇంతలో ఒకవ్యక్తి అక్కడికివచ్చి నుంచున్నాడు. అచలా ఆవ్యక్తీ ఒకర్నొకరు చూసుకున్నారు. ఆవ్యక్తి ఎవరో కాదు! మహిముడే!

ఆమె ఆపాదమస్తకమూ ఒక్కసారిగా గజగజవణికింది. కాని ఆఉత్తరక్షణంలో తలవంచుకుని కూర్చుంది. ఒక్కనిమిషంసేపు మహిముడికికూడా కాళ్ళాడలేదు! అక్కడ ఆమెను ఈవిధంగా కలుసుకోవలసివస్తుందన్నసంగతి అతనెప్పుడూ అనుకోలేదు. కాని ఆఉత్తర

క్షణంలో అతను మెల్లిమెల్లిగా అచలదగ్గిరికి వచ్చిసిలబడి అతిమృదువైన కంఠస్వరంతో "సురేశుడికి ఇప్పుడు ఎల్లాఉంది ?" అని అడిగాడు. అచల ముఖం ఎత్తనూ లేదు. మాట్లాడనూలేదు. తనకేమీ తెలియదనిమాత్రం చెబుదామని అనుకుంది.

మహీముడు ఒక్క నిమిషం మాట్లాడకూరుకుని బాగాదగ్గిరగావచ్చి సురేశుడినుదుటిమీద చెయ్యివేశాడు. వెంటనే సురేశుడు కళ్లు తెరిచి చూశాడు. సురేశుడిముఖంలో ఎక్కడా కళా కాంతీలేదు. అతనికళ్లు ఎర్రగా చింతనిప్పుల్లా ఉన్నాయి. అతనిధోరణి చూసేసరికి మహీముడికి నోటమ్మట మాటరాలేదు. అతను ఒక్కనిమిషంసేపు మాట్లాడ కూరుకుని "సురేశా! నీఒంట్లో ఎల్లాఉంది ?" అని అడిగాడు. సురేశుడు "ఏమీ బాగాలేదు; నేనింక వెళ్ళిపోతున్నాను. నువ్వు వస్తావని నేను అనుకున్నాను. నాకు ఎదురుగుండావచ్చి కూర్చో !" అన్నాడు. మహీముడు లేచి అతనికాళ్ళదగ్గిర కూర్చున్నాడు. ఆపైన సురేశుడికేసి తిరిగి "డిహారీలో డాక్టరున్నాడు. ఎల్లాగోఅల్లాగ నాబండిలోకూర్చుంటే—" అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

సురేశుడు అక్కర్లేదని తల అడ్డంగా తిప్పుతూ "మహీమా! ఇప్పుడు ఈగొడవ ఏమీ తలపెట్టకు! దీనివల్ల ఏమీ లాభంలేదు! నన్ను నెమ్మదిగా వెళ్ళిపోనీ!" అన్నాడు.

"అయితే ఇప్పటికికూడా ఇంకా—"

"అవును! ఇప్పటికికూడా తెలివిఉంది. కాని మధ్యమధ్యని మగత కమ్ముతూఉంటుంది. మహీమా! నాజీవితం అంతా నేను దరిద్రులకోసం వినియోగిద్దామని అనుకున్నాను. కాని అది సాగిందికాదు, నాఐశ్వర్యం అంతా వాళ్ళకోసంవినియోగించాలి. అందుచేత నేను నీకింత శ్రమకలగజేశాను. ఇంతేనేగాని చచ్చిపోయేటప్పుడు నిన్ను క్షమించమని కవిత్వం చెప్పేఉద్దేశం నాకెప్పుడూ లేదు!" అన్నాడు. మహీముడు మాట్లాడకూరు

కన్నాడు. సురేశుడు మళ్ళీ "అల్లాంటి వాటిమీద నాకేమీ నమ్మకం లేదు. అసలల్లాంటివి అంటే నాకిష్టంకూడా లేదు! అదీగాక ఒక్కనాడు నువ్వు నన్నర్థిస్తే నాకేమి ఒరికింది! సరే! అసలువిషయం చెబుతున్నాను విను! నేనొక విల్లురాశాను. అందులో అచలకి ఏమీ ఇవ్వలేదు. ఆమెను ఈతరవాతకూడా అవమానించడానికి నాకు చేతులు రాలేదు. కాని ఏదైనా అవసరంవస్తే నువ్వుకొంతడబ్బు ఇవ్వవచ్చును" అన్నాడు.

మహిముడు కొంతవ్యాకులపడి "సురేశా! నన్నింకా ఇందులో ఎందుకు దూరుస్తావు?" అన్నాడు. సురేశుడు "మహిమా! కేవలం నిన్ను ఇందులో దూర్చాలంటేమాత్రం దూర్చగలనా? న్యాయాన్యాయాలసంగతి బాగా తెలుసుకుని ఏమాత్రమూ లోభంలేకుండా ఉండేవ్యక్తి—" అని చటుక్కుని ఆకాశంకేసిచూసి "అచలా! నువ్వు రాత్రి తెల్లవార్లూ మేలుకున్నావు! లేచివెళ్ళి కాస్త ముఖం కడుక్కో! ఇక్కడఉన్న ముసలిది నీకు అన్నిసంగతులూ చెబుతుందిలే! వెళ్లు!" అన్నాడు.

అచలవెళ్ళిపోగానే సురేశుడు మళ్ళీ "మహిమా! ఒక్కవిషయం తెలుచుకునిమాత్రం నేను చాలా బాధపడుతున్నాను. అచల నిన్ను ఎంతో హృదయపూర్వకంగా ప్రేమించింది! ఆసంగతి నాకూ తెలిసిందికాదు; నీకూ తెలిసిందికాదు! అంతవరకూ ఎందుకు? అచల కూడా ఆసంగతిఎరగదు! నీదారిద్ర్యంవల్ల ఆప్రేమఅంతా బూడిదపాలై పోయింది—సరే! పోనీలే! ఆగొడవ ఇప్పుడెందుకు? ఇల్లాంటి సొగసైన వస్తువుని తీసుకువెళ్ళి నేను గంగలోకలిపేశాను! నీకూ దక్కనివ్వానుగాను. నేనూ దక్కించుకోలేకపోయాను. కాని ఏంచెయ్యను? కాస్త మాపిన్నిసంగతి కనిపెడుతూఉండు. పాపం ఆవిడ ఎంతో దుఃఖపడుతుంది." అన్నాడు.

ఇంతలో ఆ ముసలిది మందుసీసా పుచ్చుకొని ఎదురుగావచ్చింది. అదిచూసి సురేశుడు గట్టిగా "అబ్బే! ఇప్పుడునాకు మందువద్దు! కొంచెం మంచినీళ్ళియ్యి!" అన్నాడు. ఆపైన మహిముడికేసి తిరిగి "మహిమూ! నేను ఒకనాటకం రాయడం మొదలుపెట్టాను. అది నాడ్రాయరులో ఉంది. చదవాలనిఉంటే ఒకసారి చదువు!" అన్నాడు.

మహిముడు అతనిముఖంకేసి చూడలేక తలవంచుకునికూర్చుని ఆమాటలన్నీ వింటున్నాడు. కాని ఇప్పుడు కళ్ళెత్తిచూసి ఏదో మాట్లాడబోయాడు. కాని అంతలోసురేశుడు అతన్ని మాట్లాడవద్దని సంజ్ఞచేసి "ఇప్పుడు ఇంక ఏమీవద్దు మహిమూ! నేను కొంచెంసేపు నిద్రపోతాను. మీరు భోజనంచేస్తే చెప్పవచ్చును గాని, ఇప్పుడింక ఏమినడుస్తుంది?" అన్నాడు. ఆపైన మెల్లిగా కళ్ళుమూసుకున్నాడు.

మహిముడు ఒక్కనిమిషం మాట్లాడకుండాకూర్చుని మెల్లిగా "నేను ఆఖర్ని నిన్నొక్కకోరిక కోరాలని అనుకుంటున్నాను. నేను చెప్పినట్లు చేస్తావా!" అన్నాడు.

"ఏమిటి?"

"నువ్వు భగవంతుడివిషయం ఎప్పుడూ ఆలోచించలేదు. ఇప్పుడు కొంచెం భగవంతుడివిషయం——"

సురేశుడు "నాకిష్టంలేదు!" అనిచెప్పి పక్కకితిరిగి పడుకున్నాడు. మహిముడు అతిప్రయత్నంమీద ఒకపెద్దనిట్టూర్పు పైకిరాకుండా అల్లాగేకూర్చున్నాడు.

## ౪౩

రామబాబు ఇంటిదగ్గరలేరు; గాని అమర్నాథు ఇంటికివచ్చి మహిముడురాసిన ఉత్తరంచూసుకుని తక్షణం సురేశుడున్నచోటికి ప్రయాణం అయ్యారు. దోవలో గుర్రాన్ని చచ్చేటట్టుబాదించి ఇంచుమించుగా

నాన్యాస్త్రమానం అన్యోన్యంగా సురేశుడుకిచ్చిన ఊరు చేస్తున్నారు. ఒకనాటి కాణాదాయుడు ఆయన ఎవరో పోలీసుకి రిపోర్టు ఇచ్చాడని ఆయన్ని స్వయంగా సురేశుడున్న ఇంటికి తీసుకువెళ్ళారు. ఆ కాణాదాయన్ని ఆయనకి అచలకూడా అక్కడికి వచ్చిందన్న సంగతి తెలిసింది. సింహ ద్వారం తెరిచి ఉంది. ఆయన లోపలికి వెళ్ళారు. అప్పటికప్పుడే వ్యవహారం అంతా ముగిసిపోయింది. సురేశుడు చచ్చిపోయి అప్పటికే రెండుగంటలయింది. అచల అతని పాదాలదగ్గిర నిశ్శబ్దంగా కూర్చుంది.

రామబాబు అకస్మాత్తుగా ఈదృశ్యం చూడలేకపోయారు. ఆయన లోపలికి వచ్చిరావడంతోనే "అమ్మో! తల్లీ" అని నేలమీద కూలబడి అదేపనిగా ఏడవడం ప్రారంభించారు. అచల ఒక్కసారి ముఖం ఎత్తి ఆయనకేసి చూసింది. ఆతరవాత మళ్ళీ తలవంచుకుని ఏమీ అనకుండా మాట్లాడకూరుకుంది. రామబాబు ఆర్తనాదం ఆమె చెవుల్లో ప్రవేశించింది; అంతేగాని హృదయందాకా వెళ్ళలేదు.

మహిముడు ఇంటిలోకి వెళ్ళి కర్రలు పోగుచేస్తున్నాడు. అతనిఆర్త నాదం వినగానే బయటికి వచ్చి "బాబుగారూ! సురేశుడు ఇంతకి పూర్వమే చచ్చిపోయాడు. సరే! మీరురావడం మంచిదేఅయింది. లేకపోతే నేనిక్కడ ఎన్నో ఇబ్బందులు పడవలసివచ్చును" అన్నాడు.

రామబాబు ఏమీ అనకుండా కళ్ళుతుడుచుకోవడం మొదలు పెట్టారు. రామబాబుకి ఏమిఅనాలో ఏమిచెయ్యాలో ఏమీ తెలియలేదు.

మహిముడు "నది ఇక్కడికి దగ్గిరే! రఘువీరుడు కొన్నికర్రలు తీసుకువచ్చాడు. నేను కొన్నికొన్ని సంపాదించాను. మనంముగ్గురమూ కలిస్తే శవాన్ని ఎల్లాగోఅల్లాగ మోసుకుపోవచ్చును. లేకపోతే ఇంకఉపాయం ఏమిఉంది! ఈగ్రామములో ఎక్కడా మనుష్యులు లేరు. ఉన్నవాళ్లు బంగాళీశవం మేము ముట్టుకోమంటున్నారు" అన్నాడు.

రామబాబుకి ఈసంగతి తెలియకపోలేదు. ఆయన అచలకి విన

బడకుండా మెల్లిగా "మనంఇద్దరమే గా! ముగ్గురము ఎక్కడఉన్నాము!" అన్నారు. మహిముడు "రఘువీరుడుకూడా మనకి కొంచెం సాయం చేస్తాడు" అన్నాడు. రామబాబు ఆమాటవిని కంగారుపడుతూ "అబ్బెబ్బే! అల్లాగ చెయ్యడానికి వీల్లేదు. నేను బ్రాహ్మణశవం ఇతరులు ముట్టుకోడానికి అంగీకరించను. నది దూరంగా లేనప్పుడు మనంఇద్దరమే ఎల్లాగో అల్లాగ తీసుకుపోవచ్చును." అన్నారు. మహిముడు "అయితేసరే! పోనీ అల్లాగే కానియ్యండి!" అని మళ్ళీ కర్రలు వెతకడానికి లోపలికి వెళ్ళాడు. రామబాబు అక్కడ అల్లాగే మాట్లాడకుండా కూర్చున్నారు.

ఆయనకి అప్పుడే చాలావయస్సు చెల్లింది. చిన్నప్పటినించి ఇప్పటిడాకా ఆయన అనేకమంది చచ్చిపోవడం ఎరుగుదురు. ఇంతేకాక ఆయన అనేకమైన సుఖాలు అనుభవించారు అనేకమైన ఆఘాతాలు తగలడంమూలాన్ని ఆయన హృదయవీణతంతులన్నీ బాగా బిగుసుకుపోయాయి. ఈ కొత్త ఆఘాతంవల్ల ఆవీణలోనించి ఇప్పుడు అపస్వరాలుకూడా బయలుదేరాయి. ఒకనాడు ఈమె "పెదనాన్నగారూ! అనిపిలిచి ఆయనగుండెలమీద పడింది. ఆదృశ్యం ఆయన ఎప్పుడూ మరచిపోలేదు. ఈవేళకూడా ఆయన హృదయంలోనించి పితృస్నేహం పొంగి పొంగి పైకి వస్తూంది. ఆయనకి ఆమెను ఎల్లాగ ఓదార్చాలో తెలియలేదు. అయినాగాని ఆయన ఆమెను ఒక్కసారి దగ్గిరికితీసుకుని "నేనుండగా నీకు భయంఏమిటమ్మా!" అని అందామని అనుకున్నారు. కాని ఆయనకి ఆకోరికతీరడం ఎల్లాగ? అచల ఒక్క అడుగైనా ముందుకి వేసి ఆయనదగ్గిరికి రాలేదు. ఆమె అక్కడ అల్లాగే కూర్చుంది.

ఆయనకి అచలా సురేశుడూ కలిసిఉన్నరోజుల్లో జరిగినసంగతులన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఆయన వాళ్ళు అనేకబాధలు అనుభవించడం చూశారు. ఆయనకి వాళ్ళవిషయంలో అప్పుడప్పుడు ఏదో ఒకచిన్న

అనుమానంకూడా కలుగుతూవచ్చింది. కాని ఆ అనుమానం ఎప్పుడూ ఆయన వాత్సల్యాన్ని మింగివేసేటంత పెద్దది కాలేదు. అందుచేత ఆయన మనస్సు ఎప్పుడూ నిర్మలంగానే ఉండేది. కాని ఈవేళ నూతనవైధవ్యం వచ్చినతరవాతకూడా ఆమె అల్లాగే గుండెరాయి చేసుకుని కూర్చోడం చూసేసరికి ఆయనహృదయంలో ఉన్న స్నేహం అంతా మాయమైపోయింది. క్రమంగా ఆయన మనస్సులో ఉన్న అనుమానం ఎక్కువకావడం మొదలుపెట్టింది.

ఆతరవాత క్రమక్రమంగా సూర్యాస్తమానం అయింది. మహీముడు చెయ్యవలసినపనులన్నీ పూర్తిచేసి "బాబుగారూ! మనం ఇంక శవాన్ని తీసుకువెళ్ళాలి" అన్నాడు. ఆతరవాత అచలకేసి తిరిగి "మేము అక్కడ ఎక్కువసేపు ఆలస్యంచెయ్యము. అంతవరకూ మున లమ్మదగ్గిర కూర్చోడంమంచిది" అన్నాడు. అచల ఏమీ మాట్లాడ లేదు. ఆపైన రామబాబు ఎల్లాగో అల్లాగ మనస్సుకి ధైర్యం తెచ్చుకుని తలవంచుకుని కూర్చున్న అచలని ఉద్దేశించి "అమ్మా! నేనీమాట చెప్పలేకుండా ఉన్నాను" అని కంఠం సవరించుకుని మళ్ళీ గద్గదస్వరంతో "ఇంటులో భార్య చిట్టచివర చెయ్యవలసిన పని ఒకటి ఉందమ్మా! అగ్నిహోత్రం నువ్వే ముట్టించాలి" అని ఆపైన వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టాడు.

అసలే అచలముఖం ఇంతకిపూర్వమే వాడిపోయింది. ఈమాట వినేసరికి ఆమెముఖాన్ని కత్తివాటువేసినా నెత్తురుచుక్క కనబడ లేదు. అయినాగాని ఆమె ప్రశాంతమైనకంఠస్వరంతో "అగ్నిహోత్రం ముట్టించవలసిన అవసరంఉంటే నేనే ముట్టిస్తాను. హిందూధర్మంలో దీనికి ఏదైనా ఒకప్రత్యేకఫలితం ఉంటేమాత్రం నాకు ముట్టించడం ఇష్టంలేదు. నేను ఈయనకి భార్యనికాను" అంది.

రామబాబుమీద ఒక్కసారిగా పిడుగుపడ్డట్లయింది. ఆయన కను

రెప్పవెయ్యకుండా ఆమెకేసి అల్లాగే కొంతసేపు చూసి చివరికి మెల్లిగా "నువ్వు సురేశబాబుభార్యవు కావూ?" అని అడిగారు. అచల మొదటిమోస్తరుగానే ఏమీ చలించకుండా "ఆయన నాకు భర్త కాదు" అంది.

ఒక్కనిమిషంలో రామబాబుకి ఇంతకిపూర్వం జరిగినసంగతులన్నీ జ్ఞాపకంవచ్చాయి. ఆవేళ ఆయన మొట్టమొదట వాళ్ళకి ఇంట్లో బసఇవ్వడం మొదలుకొని ఆమె ఈమధ్యాని మేడమెట్లమీద మూర్ఛపోవడందాకా జరిగిన వృత్తాంతాలన్నీ ఆయనకళ్ళఎదుటుగుండా గిర్రుని తిరిగాయి. ఇంక ఆయనమనస్సులో అణుమాత్రమైన అనుమానం మిగలలేదు! ఈమె ఎవరు? ఎవరిపిల్ల? కులం ఏమిటి? బహుశః అయితే బోగంది అయిఉంటుంది. పాపం ఆయన ఈఅమ్మాయిని అమ్మా! అనిపిలిచారు. అమ్మాయీ! అనిపిలిచారు. ఆమెచేతిఅన్నం తిన్నారు. ఆఖరికి ఆమెవండినఅన్నం తీసుకువెళ్ళి దేవుడికి నైవేద్యంపెట్టారు. ఇవ్వన్నీ తలుచుకునేసరికి ఆయనకి ఆమెమీద భరించలేనంత అసహ్యభావం కలిగింది. ఇన్నాళ్ళనించీ ఆయనకి ఆమెమీద కలిగిన ఆ అతిమధురమైన పుత్రికావాత్సల్యమూ; ఆ శ్రద్ధా అన్నీ ఎడారిలో పడిన నీటిబిందువుల్లాగ ఒక్కసారిగా మాయమైపోయాయి.

అయితే ఈనాటవిని రామబాబే కాదు. మహేంద్రనాథ్ కూడా నిర్ఘాంతపోయాడు. అతను ఒక్కనిమిషం అల్లాగనుంచుని "ఇంక ఇది జరగనప్పుడు మనం దీనికోసం ఆలస్యంచెయ్యడం ఎందుకు? రండి! మనం శవాన్ని తీసుకుపోదాము!" అన్నాడు. రామబాబు 'రండి' అని కలగంటూన్నమనిషిలాగ ముందుకివచ్చారు ఆయనకి ప్రస్తుతం కలిగిన ఆపత్తుముందర మిగిలిన అందరిఆపత్తులూ కేవలం నీడల్లాగ అస్పష్టంగా కనిపించాయి. ఆయన రెండుచెవులలోనూ కేవలం "జాతిపోయింది. ధర్మంపోయింది. ఈమనుష్యజన్మఅంతా

వ్యర్థమైపోయింది. అనేమాటలుతప్ప ఇంకేమీ వినిపించలేదు.

సురేశుకి అంత్యసంస్కారాలు జరగడంలో అట్టే ఎక్కువకాలం పట్టలేదు. మొదటనించి చివరదాకా ఆయన ఏమీ మాట్లాడకుండా తంతు అంతా నడిపించేశారు. ఆపైన తిన్నగా తిరిగివచ్చి బండి వాణ్ణిపిలిచి జోడికట్టమని ఆజ్ఞాపించారు. మహిముడు "తక్షణమే వెళ్ళిపోతారా?" అని అడిగాడు. రామబాబు "అవును. ఇప్పుడే వెళ్ళిపోతాను. నేను రేపుపొద్దున్న బయలుదేరి కాశీవెళ్ళాలి. ఇప్పుడు ఆలస్యంచేస్తే రేపుపొద్దున్నబండి అందదు" అన్నారు.

మహిముడికి ఆయన మనస్సులో ఉన్న అభిప్రాయం ఏమిటో పూర్తిగా తెలిసిపోయింది. ఆయన ప్రాయశ్చిత్తంచేసుకోడానికి కాశీ వెళుతున్నారన్న సంగతికూడా గ్రహించాడు. అందుచేత అతను ఎంతో సంకోచపడుతూ "మాది ఈదేశంకాదు. ఇది అంతా నాకుకొత్త. దయ ఉంచి ఈవిడ ఇక్కడినించి వెళ్ళడానికి ఏదైనా—" అని ఇంకాఏదో చెప్పబోయాడు; కానిరామబాబు అదిలమాట ఎత్తేసరికి అగ్నిహోత్రంలాగ మండిపడి "దయా? [illegible]కేమన్నా మతిపోయిందా ఏమిటి? మహిమబాబు!" అన్నారు.

మహిముడు ఆయనకేమీ "నూరుచెప్పలేను. కాని ఆయనకేసి ఎంతో వినయవిధేయతలతో "రెండుమూడు రోజులనించి తిన్నగా భోజనంకూడా చెయ్యలేదనుకుంటాను. ఈమృత్యుసన్నిధిలో ఇల్లాగ అతిభయంకరమైన అసహాయస్థితిలో విడిచిపెట్టి వెళ్ళడం—" అని సగం సగం చెప్పి ఆపైన ఇంకాఏదో చెప్పబోయాడు. కాని ఈసారికూడా రామబాబు మహిముణ్ణి మాట పూర్తిచెయ్యనియ్యలేదు. ఆయన మంచినైష్ఠికుడు. ఆయనకి చిన్నప్పటినించికలిగిన సంస్కారాలకి ఇప్పుడొక పెద్దఆఘాతం కలిగింది. అందుచేత ఆయన మనస్సిప్పుడు ప్రతిహింస చెయ్యాలనే పట్టుదలచేత నల్లరాయి అయిపోయింది. ఆయన ఒక్క-

నిమిషం అల్లాగ ఊరుకుని గుండెల్లో పొడుచుకు నేర్పాంగ్యంతో "అవును ! మీరు బ్రహ్మసమాజానికి చెందినవారేగా ! అన్నట్టు నేను మరచిపోయాను ! అయితే మహాశయా ! మీరు ఎంతగొప్ప బ్రహ్మసామాజికులైనా కావచ్చునుగాని నాకొంప ఎల్లాగ నట్టేట్లో కలిసిపోయిందో గమనించారా ? సర్వస్వమూ ఎంతవరకు నశించిపోయిందో మీరు కొంచెమైనా గ్రహిస్తే ఈవేశ్యమీద దయచూపించమని మీరు నన్ను అడిగి ఉండరు !" అన్నారు. ఆతరవాత ఆయన చటుక్కుని బండిఎక్కి "సరే! ఇప్పుడుమనకి బ్రహ్మజ్ఞానంగొడవ అక్కర్లేదు ! ప్రాణాలు రక్షించుకోవలసిన అవసరంఉంటే రండి ! కొంపంటుకుపోతుంది." అన్నారు.

మహిముడు మాట్లాడకుండా ఆయనకొక నమస్కారంచేశాడు. ఆయనకి కలిగిన సర్వనాశనాన్ని గురించిగాని ఆయనఆహ్వానం అంగీకరించడంవిషయంలోగాని అతనేమీ ప్రస్తావించలేదు. కేవలం ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టి మాట్లాడకూరుకున్నాడు.

ఆయనకికలిగిన సర్వనాశనానికి అంతూదరీఉందా? ఆమాటలు నిజమే! లోపలకూర్చున్న అచల బండివెళ్లినచప్పుడువిని ఇంతంతాగ్రహించింది. ఆయన లోపలికివచ్చి ఒక్కమాటైనా మాట్లాడనపోవడానికి కారణం గూడా ఆమెకి తెలిసిపోయింది. ఇందాకటినించీ సురేశుడిమరణభయంవల్ల మహిముడికీ అచలకీ మధ్యన ఒకతెరలాంటిది ఏర్పడింది. ఇప్పుడు ఆతెరకాస్తా తొలిగిపోయింది. ఇప్పుడు మహిముడు ఎదురుగుండా వచ్చి దగ్గిరగా నుంచున్నాడు. కాని అచల ఇప్పుడు ఏమీ మాట్లాడదలచుకోలేదు. అసలు ఆమెకు ఈసిగ్గుపడడమే ఒకపెద్దభారమైపోయింది. మహిముడు లోపలికివచ్చి చూశాడు. ఆమె కిరసనాయిలుబుడ్డికిఎదురుగా మాట్లాడకుండా కూర్చుంది.

మహిముడు దగ్గిరికివచ్చి "ఇప్పుడునువ్వు ఏంచేస్తావు?" అన్నాడు అచల "నేనా?" అనిఅతనికేసి చూస్తూఏదేదో ఆలోచించడం మొదలు

మంటావు ?" అన్నాడు. బహుశః ఈప్రశ్న అచలకి వినబడనే వినబడ
లేదు ! ఆమె తనుఅన్నమాటవినకుండానే తనలో తనే . ఆలోచించు
కుంటూ "మిమ్మల్ని విడిచిపెట్టిన మొదలుకొని నేను "పరమేశ్వరా !
ఇంక నేనిది సహించలేను ! నువ్వు నన్నింక తీసుకుపో !" అని భగవం
తుణ్ణి అనేకసారులు ప్రార్థించాను. కాని ఆపరమేశ్వరుడు నాప్రార్థన
ఆలకించలేదు. మీకుకూడా నాప్రార్థన వినడంఇష్టంలేదు ! ఇంక నేనేం
చెయ్యను ?" అంది.

మహిముడు ఆమె అన్నదానికి ఏమీ సమాధానం చెప్పలేక వీధు
లోకివెళ్ళిపోయాడు. కాని నిరాశాపూర్ణమైన ఆకంఠస్వరమూ అభి
మానమూ సంకోచమూ సిగ్గూ కూడా విడిచిపెట్టి ఆమె మాట్లాడిన
మాటలు వినేసరికి అతనిమనస్సు మళ్ళీ కొంత ఇటూఅటూ ఊగిస
లాడింది. అతను అక్కడ అటూఇటూ పచార్లుచేస్తూ "ఇప్పుడు నేనేం
చెయ్యను ?" అని అనుకున్నాడు. అసలే అతనుతన జీవితభారంచేత
కుంగిపోతున్నాడు. ఆపైన సురేశుడు అతని నెత్తిమీద తన పాప
పుణ్యాలభారం పడవేసి ఈప్రపంచకంలోనించి నిష్క్రమించాడు.
ఈభారంఅంతా ఎక్కడికివెడితే తగ్గుతుంది ?

రఘువీరుడు ఎంతో వాకబుచేసి డెహరీలోకి మూడుకోసులదూరంలో
రేపు ఒకసంత జరుగుతుందనిన్నీ అక్కడికివెళ్ళి ప్రయత్నిస్తే ఒకరెండెడ్ల
బండీ దొరకవచ్చుననిన్నీ చెప్పాడు. మహిముడు ఆమాటవిని ఎంతో
కంగారుపడడం మొదలుపెట్టాడు. రఘువీరుడది చూసి "నేనిప్పుడు
బయలుదేరివెడితే రేపుపొద్దున్న ఆసంత సమయానికి అందుకుంటాను.
బాబూ ! కాని ఈఊరుసంగతి చూసి ఇక్కడికి ఎవరూరారేమోనండి!
అందుచేత అమ్మగారుకొంచెం అంతవరకూ—" అని సగంసగం చెప్పి
ఊరుకున్నాడు.

అచల ఆమాటవిని తత్క్షణం "పదమండి వెడదాము !" అని లేచి

నుంచుంది. కాని ఆమె కాళ్ళు వణకడం మొదలుపెట్టాయి. ఆమె పడి పోవలసిందేగాని అంతలో మహీము ఆమెకు చెయ్యి అందిచ్చాడు. అచల చటుక్కున అతని చెయ్యి పట్టుకొని పడిపోకుండా నిలబడింది. కాని సిగ్గువల్లా విరక్తివల్లా మహీముడికి ఎంతో సంకోచం కలిగింది. అతను చెయ్యి మళ్ళీ వెనక్కి లాక్కోవడానికి ప్రయత్నిస్తూ "పోనీ ఈ వేళకి ప్రయాణం మానేద్దాము" అన్నాడు.

"ఏం ? మీరు ఈ వేళకి ఇక్కడే ఉండడం మంచిదికాదన్నారుగా ! మళ్ళీ డెహరీనించి బండి తెప్పించుకుని ప్రయాణం అయ్యేసరికి రేపు కూడా గడిచిపోతుంది"

"మరి నువ్వు చాలా నీరసంగా ఉన్నావు !"

అచల ఇంతకిపూర్వమూ చెయ్యి విడిచి పెట్టలేదు ; ఇప్పుడూ విడిచి పెట్టలేదు ! కాదన్నట్టు మాత్రం తల అడ్డంగా తిప్పి "అబ్బే ! నీరసంగా లేను ! మీ చెయ్యి పట్టుకుని ఎంతదూరం నడవమంటే అంత దూరమూ నడుస్తాను !" అంది. మహీముడు "అయితే సరే !" అన్నాడు. రఘుపతి ముందు నడిచాడు. అతని వెనకాల ఆ ఇద్దరూ నడిచి వెళ్ళారు. మహీముడు నడుస్తూ నడుస్తూ దారిలో అనేక సార్లు తనమనస్సులో నిట్టూర్పులు విడిచిపెడుతూ "దీనికి ఎప్పటికైనా అంతం కనిపిస్తుందా ఈ ప్రయాణం ఎప్పటికైనా ముగుస్తుందా ? ముగిస్తే ఎల్లాగ ముగుస్తుంది ? ఎప్పుడు ముగుస్తుంది !" అని అనుకున్నాడు.

## ౪౪

అచల ఇంటికి వచ్చినతరవాత ఆ పెద్దకవరుతీసి మహీముడికి చూపించి "ఇదిగో ! ఇది ఆయన వీలునామా" అంది. మహీముడు చెయ్యిచాపి అదితీసుకున్నాడు. అతనికి అందులో ఉత్తరం ఉందని అన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. అతనికి అందులో ఏవేవి విచిత్రమైన విషయాలున్నాయో తెలుసు

కోవాలని ఒకపెద్దకుతూహలం కలిగింది. ఆకుతూహలం క్రమక్రమంగా ఎక్కువై అతనిమనస్సులో ఒక పెద్దగాలివాన రేగినట్లయింది. కాని అతను ఆకుతూహలంబలవంతాన్ని అణిచివేసుకుని ఆకవరు తనజేబులో పెట్టుకున్నాడు.

అచల "మీరు రేపుదయం ఈవేళే బయలుదేరి వెళ్ళిపోతారా?" అని అడిగింది.

"అవును; ఇక్కడ ఇంక ఉండడం నాకేమీ బాగా లేదు"

"ఇంక నేను ఎప్పుడూ ఇక్కడే ఉండిపోవాలా?"

మహిమడు ఒక్కనిమిషం సేపు మాట్లాడకూరుకుని నవ్వి "ఇంకెక్కడికైనా వెళ్ళాలని అనుకుంటున్నావా?" అని అడిగాడు. అచల "చిన్నటినించీ నేనీవిషయమే ఆలోచిస్తున్నాను. విదేశాలలో నావంటి అనాథలకి ఆశ్రమాలుంటాయని విన్నాను. వాటసంగతి ఏమిటో నాకు బాగా తెలియదుగాని ఈదేశంలో అల్లాంటివేవీ—" అని ఊరుకుంది. ఆమాటలు అంటూంటే ఆమె కళ్ళమ్మట పెద్ద పెద్ద కన్నీటిబిందువులు ప్రవహించడం మొదలు పెట్టాయి. ఈవేళ ఆమెకళ్ళవెమ్మట కన్నీళ్ళు ప్రవహించడానికిది రెండో మొదలు. మహిమునికికూడా గుండె నీరైపోయింది. కాని అతను మెల్లిగా నాకూ తెలియదు. వాకబుచేసి చెబుతాను" అన్నాడు. నేనెప్పుడైనా ఉత్తరం రాస్తే మీరు దానికి సమాధానం రాస్తారా?"

మహిముడు "అవసరమైతే సమాధానంఇస్తాను. సామాను సర్దుకుని స్టేషనుకి వెళ్ళేసరికి ఆలస్యంఅయిపోతుంది. నేను వెళ్ళిపోవాలి!" అన్నాడు.

అచల తన దుఃఖాలన్నీ మనస్సులో నివారించుకొని భూమిమీద సాష్టాంగపడి అతనికి నమస్కరించింది. అతను వెళ్ళిపోయిన తరవాత గుమ్మంలో నిలబడి అతనికేసిచూస్తూ నుంచుంది. మహిముడు వెళుతూ వెళుతూ "దారిలో ఈవేళ ఇంక రామబాబుగారింటిలో ఉండడానికివీల్లేదు. ఎల్లాగో అల్లాగ ఈవేళ ఇక్కడనించి వెళ్ళితీరాలి" అనుకున్నాడు. ఇదే

కాక అతనింకా ఆఉత్తరం చదువుకోవాలి. తనవిషయాలన్నీ ఒక్కసారి ఆలోచించుకోవాలి. ఈ రెండుపనులూ చెయ్యడానికి అతని కిప్పుడొక ప్రశాంతమైన ఏకాంతస్థలం కావాలి.

అచలని ఎంతోఆప్యాయంగా ప్రేమించిన విషయం అంతా అతనికీవేళ అస్పష్టంగా కనిపించిది. ఆమెనుగురించి అతనిజీవితంలో ఒకపెద్దప్రళయం లాంటి గాలివాన రేగింది. ఆప్రళయానికి ప్రపంచకంలో ఎక్కడా సాటి లేదు. ఆపైన పరమేశ్వరుడుకూడా అతనికి నిశ్శబ్దంగా సహించడానికి కావలసినంత శక్తిప్రసాదించలేదు. ఇందుచేత తనఇల్లు లోపలా పైనా భగ్గుమని మండిపోతూన్నప్పుడు అతనిల్లాగ నిలబడి నిలువునా భస్మమై పోయాడు. కాని ఇప్పుడతనికి కేవలం సహించడానికికూడాశక్తికలిగింది. అందుకని అతనీవేళ ఒకచోట కూర్చుని తన వ్యవహారాలన్నీ సావ కాశంగా ఆలోచించుకోవాలనుకున్నాడు.

అతను ఇంటికివచ్చి సామానులన్నీ గబగబా సర్దుకున్నాడు. అయిదుగంటలకి ఒకబండి వస్తుంది. అది ఇంకొక గంటసేపట్లో వస్తుంది. బహుశః రామబాబు కాశీవెళ్లి తిరిగివచ్చేటప్పటికి ఆలస్యం అవుతుంది. అసలు ఆయన అక్కడికి ప్రాయశ్చిత్తం చేయించుకో డానికి వెళ్ళారు. ప్రాయశ్చిత్తం చేయించుకోందే నేను వచ్చిమంచి నీళ్ళైనా తాగనని ఆయన ప్రతిజ్ఞపట్టారు. అందుచేత ఆయన్ని కలు సుకుని ఆయనదగ్గిర సెలవుపుచ్చుకోవడం అసంభవము. ఆకారణం చేత ఈవిషయంలో ఒకఉత్తరంరాస్తే బాగుంటుందని అతను నిశ్చ యించుకున్నాడు. కలమూ కాగితమూ పుచ్చుకుని రెండుమూడు పంక్తులు రాసేసరికి అతనికి ఆయన వ్యంగ్యంగా అన్నమాటలన్నీ జ్ఞాపకంవచ్చాయి. ఆపైన అతనికి అచల గద్గదకంఠంతో ప్రార్థించిన ప్రార్థన జ్ఞాపకం వచ్చింది. ఆతొందరలో ఆమెబాధ ఇంతవరకూ అతనికి తీవ్రమైనవేదన కలిగించలేదు. కాని అతనికి నిద్రమాత్రం

తిన్నగా పట్టలేము. ఇప్పుడు రామబాబు అన్న మాటలు తలుచుకొంటూన్నకొద్దీ అతని మనస్సులో కొంచెమైనా నిలకడ లేకుండా పోయింది.

ఆ మునసబాయనతో ఇతనికంతగా ఎక్కువ పరిచయం కలగలేదు. కాని ఆయన ఔదార్యమూ, దయా, ధర్మనిష్ఠా భక్తీ చాలా గొప్పవని అతను విన్నాడు. ఆ కలిగిన పరిచయం వల్ల మహిముడికిప్పుడు ఒక అపూర్వమైన ఆదర్శం వైపు దృష్టి మళ్ళింది.

ఈ మునసబాయన అచలని "సురమా! తల్లీ! అని ఎంతో ఆప్యాయంగా పిలుస్తూండేవాడు. ఈ అచల వండిన అన్నం తప్ప ఆయన ఎప్పుడూ పరగోత్రీకులు వండిన అన్నం తినలేదు. ఒకసారి ఆయనే, ఈ విషయం మహిముడితో ఎంతో ఆప్యాయంగా చెప్పారు. అందుచేత ఆయనకి కలిగిన ఆపత్తు ఎల్లాంటిదో మహిముడికి తెలిసింది. కాని ఈ విషయంలో అతని మనస్సులో మాటిమాటికీ ఒకవిధమైన జిజ్ఞాస బయలుదేరడం మొదలుపెట్టింది. సరే! అచల చేసిన అపరాధాన్ని గురించి తరవాత ఆలోచిద్దాము; కాని ఒక సామాన్య బాలిక మోసం చేసినంత మాత్రాన్ని మోసగించబడిపోయిన ఈ నైష్ఠికుడి ధర్మం ఏమంత గొప్పది? ఈ ధర్మం ఏదైనా ఒక గొప్ప ఆపత్తు వచ్చినప్పుడు తననీ రక్షించుకోలేక పోతూంది. ఇతరులనీ రక్షించలేక పోతూంది. పైగా ఏదైనా ఆపత్తు వచ్చినప్పుడు రాత్రింబగళ్ళు తన రక్షణకోసం పాకులాడుతూంది. అల్లాంటిది ఏమంత నికరమైన ధర్మము? మానవ జీవితంలో ఆ ధర్మంవల్ల వచ్చే ప్రయోజనం ఏమిటి? ఈ ధర్మం ఇప్పుడు స్నేహమర్యాద పాటించలేకపోయింది ఒక స్త్రీ నిస్సహాయురాలై పడి ఉన్నప్పుడు ఆమెను మృత్యుముఖంలో పడదోయడానికి కూడా సందేహించలేదు దెబ్బ తగిలేసరికి దయాదాక్షిణ్యాలు కలిగిన మునసబాయన్ని కూడా క్రౌర్యంలోకి దింపేసింది. ఇల్లాంటిది ఇది ధర్మం ఎల్లాగ అవుతుంది దీన్ని అవలంబించిన ఆ రామబాబుకి మాత్రం సత్యస్వరూపం

ఏవిధంగా గోచరిస్తుంది? నిజమైన ధర్మం కవచంలాగ ఎన్ని ఆఘాతాలైనా సహిస్తుంది! ఇది ఖండించవచ్చునా ? కాదా ? ఆ నిశ్చయానికి ఇదే పరీక్ష !

ఇలాగ ఆలోచిస్తూంటే చటుక్కున అతనికి ఈవిధంగా ఇలాగ పారిపోవడం ఉచితం కాదు ! అనిపించింది. కాని అతను ఆ ఆలోచన మళ్ళీ మనస్సులో ప్రవేశించకుండా దూరంగా తరిమివేసి కలంపుచ్చుకొని రాయవలసిందేదో రాశాడు. ఆ పైన సామానులన్నీ తీసుకొని స్టేషనుకేసి వెళ్ళిపోయాడు.

బండివచ్చింది. మహిముడు ఒకపెట్టె తలుపు తీసి అందులో కూర్చో బోయాడు. ఇంతలో ఒకముసలాయన అతనికి కనిపించారు. ఆయన ఒకపిల్ల తను చెయ్యిపట్టుకుని ప్లాటుఫారమ్మీదికి దిగారు.

ముసలాయనకూడా మహిముణ్ణి చూసి "ఇదిగో! మహిముడు! నువ్వు ఇక్కడున్నావేమిటి" అన్నారు. మృణాల మహిముడిపాదాలకి నమస్కరించి "అన్నయ్యా ఎక్కడికేమిటి వెళ్ళడం?" అంది. వాళ్ళిద్దరూ మహిముడు లోపలికివచ్చి కూర్చోవడం చూసి ఎంతో ఆశ్చర్యపడ్డారు.

మహిముడు "నేను కలకత్తా వెళ్ళిపోతున్నాను. సురేశబాబుగారింటికి తీసుకువెళ్ళమంటే బండివాడు తిన్నగా అక్కడికి తీసుకువెడతాడు అచల అక్కడ ఉంది అన్నాడు. కేదారబాబు ఏమీ ఆలోచించక వెర్రివాడిలాగ అదేపనిగా అతనికేసి చూస్తూ ఉంటున్నారు. మహిముడు "సురేశుడేమో చచ్చిపోయాడు. అచల నన్నేదైనా ఆశ్రమం ఉందేమో చూడమంది. కాని నేను దానికి సమాధానం ఇవ్వలేకపోయాను. నువ్వు ఏదైనా సమాధానం చెప్పగలవనుకుంటాను మృణాలా !" అన్నాడు.

మృణాల అతని ముఖంకేసి చాలాసేపు చూసి "ఆశ్రమం ఎందుకు ఉండదు అన్నయ్యా? అయితే ఒకవిషయం ఉంది. నేనన్ని విషయాలు నీదగ్గిర నేర్చుకున్నాను. వదినకి ఆశ్రమం కావలసివచ్చినా ఆశ్రయం కావలసివచ్చినా నేను చూపించగలను; కాని ఆశ్రమమో ఆశ్రయమో

ఏదో ఒకటి నువ్వే ఇవ్వవలసి ఉంటుంది" అంది.

మహిముడు ఏమీ మాట్లాడలేదు. బహుశః అతను ఆమె తీక్ష్ణదృష్టిని తప్పించుకోడానికి ముఖం ఇంకొకపక్కకి తిప్పివేసుకొని ఉంటాడు.

ఇంతలో బండిగంట మోగింది మృణాల ఆముసలాయన చెయ్యి తనచేత్తో పట్టుకుని రండి! బాబయ్యగారూ! మనం వెడదాము! అంది.

సమాప్తము

———

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము